# భారతి

సాహిత్య మాసపత్రిక






సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మార్చి 1958

సంపుటము 35 : : సంచిక 3

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1958

# కథ కంచికి

శ్రీ నాయని సుబ్బారావు

కథ కంచికి పోయినదా?
వ్యథితాత్మత కథకు డింటి కరుగవ్వలెనా?
పృథుమత్సత్వ కవిత్వ
ప్రధాన మార్గమ్ము మూయబడినట్లేనా?

* * *

ఒక పరలోకాగత బా
లిక నవకిసలయ కరాంగుళీ నఖరేఖల్
చికటారి సూది మొనలై
యొక రాతిరి రాత్రి నన్ను నూరక కలచెఁ!

ఆ మఱుపురాని రాత్రి శయ్యాంతరమున
నాక్రమిత వత్సలా దేహయష్టియగుచు
శ్యామల మనోజ్ఞ తేజఃప్రసన్న మొక్క-
యాత్మ యశరీర వధువుగా నవతరించె!

ఆ రాత్రి యేమి యద్భుత
మో! రాత్రులు శతసహస్రములు క్రింగి తదే
కారాధ్యమ్మై కవితా
శ్రీరంగము నాదు జిహ్వఁజిందులు ద్రొక్కెఁ!

అశరీర వధూ స్పర్శా
త్రిశూల ధారలకు జలదరించిన యెదలో
ప్రశమిత కల్పాంతములై
విశాల విశ్వప్రపంచ వీధులు మెదలెఁ!

# కాళిదాసునాటి కళింగనగరము

శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రి

శ్రీమద్వాల్మీకి రామాయణమందు అయోధ్యాకాండమున వశిష్ఠాదేశమున భరతుని దీసికొని వచ్చుటకు దూతలు మార్గవశమున కళింగ నగరమున సాలవనమును దాటిరని "కళింగ నగరే చాపి ప్రాప్య సాల వనం మహత్" అని వర్ణింపబడినది. కళింగరాజధాని "నగరము" అని గాంగరాజుల శాసనములందును గొన్నింటగలదు. కాళిదాసమహాకవి రఘువంశచతుర్థ సర్గమునందు రఘుమహారాజు దిగ్విజయ యాత్రా సందర్భమునను, ఆరవ సర్గమున ఇందుమతీ స్వయంవర సందర్భమునను రెండు పర్యాయములు కళింగప్రశస్తిని గావించినాడు. నాల్గవ సర్గలో కేవలము కళింగాధిపుని బలపరాక్రమములు యుద్ధసైన్య పాటవములు మాత్రమే వర్ణించినాడు. ఊరిపేరు కులగోత్రములు పేరియు జెప్పలేదు. ఆ సందర్భమున వాని ప్రసక్తి అనుచిత మగుటచే విడచినాడు. ఆరవసర్గమున స్వయంవరావసర మందన్నను ఇందుమతికి వరింప బోవు వరుని సర్వవృత్తాంతములను దెలియునవసరముగలదు. కావున అక్కడ విస్తరించి వివరించినాడు.

శ్లో॥ అథాంగదాశ్లిష్ట భుజం భుజిష్యా హేమాంగదం నామ కళింగనాథమ్, ఆసేదుషీం సాదిత శత్రుపక్షం బాలాము బాలేందు ముఖీం బభాషే॥ ౧॥ అసౌ మహేంద్రాది, సమానసారః పతి ర్మహేంద్రస్య మహోదధేశ్చ. యస్యక్షరత్సైన్య గజచ్ఛలేన యాత్రాసుయాతీవ పురో మహేంద్రః ॥౨॥ యమాత్మనస్సద్మని సన్నికృష్టో మంద్ర ధ్వనిత్యాజిత యామ తూర్యః ప్రాసాదవాతాయన దృశ్యవీచిః ప్రబోధయ త్యర్ణవ ఏవ సుప్తమ్॥౩॥ అనేకసాకం విహారాంబు రాశేస్తీరేషు తాళీవనమర్మరేషు, ద్వీపాంతరానీత లవంగ పుష్పైరపాకృత స్వేదల వామరుద్భిః ॥౪॥"

హేమాంగదుడను పేరుగల కళింగనాథుని సమీపించిన యిందుమతి నుద్దేశించి సునంద యిట్లు పలికెను. "మహేంద్రగిరితో సమానమైన సారముగల యీతడు మహేంద్రమునకు మహోదధికి ప్రభువు. ఈతని సైన్యములకు ముందట గజసైన్య మిషమున మహేంద్రమే నడచుచున్నట్లుండును. ఈతని ప్రాసాద గవాక్షముల నుండి సముద్ర తరంగములు చూడనగును. భవనములకు మిగుల సమీపమునమున్న సముద్ర ఘోషచే యామ తూర్యములు లాంఛనప్రాయములైనవి. వీనితోగూడ తాటితోపుల మర్మరధ్వనిగల సాగర తీరములందు 'ద్వీపాంతరములనుండి లవంగ పుష్పములను గొనివచ్చిన వాయువులచే హరింపబడిన స్వేదముగలదానవై' విహరింపుము. అని శ్లోకముల భావము.

దీనినిబట్టి కాళిదాసునాటికి కళింగరాజధాని సముద్రమునకు మిక్కిలి సమీపమున తీరమునందే కలదని తెలియుచున్నది. అది యేదియని మన మిపుడాలోచింపవలసి యున్నది. ప్రాచీన శాసనములలోను బౌద్ధజాతక కథలలోను "దంతపురము, సింహపురము, నగరము"నను రాజధానులు పేర్కొనబడినవి. కాని వాని వర్ణన విశేషములు లేమింజేసి యవి యెక్కడనున్నవో నిర్ణయింప నగుపు లేదు. ఉత్కల దేశమున భువనేశ్వర క్షేత్రమునకు నాలుగుమైళ్ళ దూరమున "ఖండగిరి గుహలు" అనబడు బౌద్ధజైన గుహావేశనములును వానికి దగ్గరగా శిశుపాలఘడమను చిన్న పల్లెయును గలవు. ప్రాచీన శిశుపాలుని రాజధానియే శిథిలాతిశిథిలమై ప్రస్తుత మీ పల్లెగా మారినదని స్థలజ్ఞులు చెప్పుదురు. ఆ పల్లెప్రాంతమిప్పుడు ఇండియా దొరతనమువారు ప్రాచీన చరిత్రాంశములకై త్రవ్వించుచున్నారు. ప్రాచీనాయుధములు శిథిల గృహోపకరణములు మొదలగునవి యిక్కడ లభించుచున్నవి. మన చరిత్రకందిన అతిప్రాచీనుడగు ఖారవేలుని రాజధాని అదియేయై యుండును. అతడు మన శాతవాహనులకు సమకాలీనుడు. జైనమతమందభిమానాదరములధికముగాగలవాడైనను వైదిక బౌద్ధమతములకును విశేషాలంబనమిచ్చినవాడు. అతడుఖండగిరి (కందగిరి) ఉదయగిరి అను పేళ్లుగల రెండు చిన్న కొండలయందు అనేక గుహలను దొలిపించినవాడు. వానిలో

నొక విశాలమైన గుహాప్రాంగణమున ఏకశిలతో రెండేనుగుల నిరుప్రక్కల స్థాపించి గుహాంతర్భాగమున గోడల పైని తన చరిత్రమంతయు ప్రాకృతభాషలో నుత్కీర్ణము గావించినాడు. ఆ గుహయే యిపుడు "హాథీగుంఫ" యని వ్యవహరింపబడుచున్నది. ఆ శాసనము హాత్తిగుంఫా శాసనమని ప్రసిద్ధి నందినది. ఆ శాసనమువలన నాతని రాజధాని శిశుపాలఘడ్ యని యూహింప వచ్చును. అతడు చేదివంశమువాడు శిశు లుడు చైద్యుడేకదా ? కళింగమును చేది వంశ్యులు పాలించినట్లు శాసనములు మహాభారతా దీతి హాసములును జెప్పుచున్నవి. అశోకుడు గావించిన కళింగయుద్ధ మిక్కడనే జరిగినట్లు స్థానికులు చెప్పుదురు. కాబట్టి శిశుపాలఘడ్ యొక కళింగరాజధానిగ నుండు నట్లు నమ్మవచ్చును. కాని కాళిదాసుని వర్ణనమునకిది యెంత మాత్రము సరిపడదు. సముద్రమునకు శిశుపాల ఘడమునకు దూరమత్యధికము. కావున మఱియొక ప్రదేశమరయ వలసియున్నది. జాతక కథల యందును, మహాభారతమునందును శాసనములందును పేర్కొను దంతపురము (దంతాపురము)ను గూర్చి యాలోచింతము. ఇదియు సముద్రమునకు మిక్కిలి దూరముగనే యున్నది. ఒకప్పుడు రాజధానియైనను కాళిదాసుడు వర్ణించిన రాజధాని మాత్రము కాజాలదు. సింహపురమను శాసనములందు పేర్కొనబడిన సింహపురము కూడ కళింగ పట్టణమునకు సుమారుగ నైనూర్క్రోసుల దూరమునను శ్రీకూర్మమునకు నాలుగైదు క్రోసులదూరముననుండుటచే నదియు గాజాలదు. జయంతీ నగరమని శాసనములందు జెప్పబడిన ముఖలింగము పై వానికంటె సముద్రమున కత్యధిక దూరమున నుండుటచేనది అసలే సంగతిముగా నేరదు. పైని పేర్కొన్న స్థానము లన్నియు వేర్వేఱు కాలములలో రాజధానులు కాదగును. శ్రీకూర్మమునకు శ్వేతకమను నామాంతరము గలదు. అది గంగవంశపు రాజులకు అధిష్ఠానము. అనగా నపుడపుడు రాజులు బసచేయునదియు సార్వకాలికముగా రాజకీయోద్యోగులు వసించు నదియును. మహేంద్రవాసకమూ(మందసా)కూడ నిట్టి యధిష్ఠానమే. వీనికడ రాజధానీ సూచక శిథిలములు గాని "యివి యొకప్పుడు రాజధానులుగా నున్నట్లు కింవదంతి" యైన గాని లేమిచే నివియు కాళిదాసు వర్ణనమున కనుగుణములు గావు. కాబట్టి మఱియొక తావు పరిశీలింతము. మహాభారతమున కర్ణుడు కళింగరాజగు రత్నాంగదుని కూతురు శుభాంగియను కన్యను స్వయంవరమున జయించి తెచ్చి దుర్యోధనునకు భార్యగా నిచ్చెనని జెప్పబడినది. ఆ రత్నాంగదుని రాజధాని రాజపురము. శ్రీకాకుళమండలమున ఇచ్ఛాపురమునకును సోంపేటకు నడుమ ఉద్యానమునందు ఇప్పుడును రాజపురమను గ్రామము గలదు. దాని పరిసర భూము లందు ప్రాచీనములగు నగలు గృహోపకరణములును గనబడినవి. ఆ పుర మొకప్పుడు రాజరాజనరేంద్రునకు రాజధాని యనియు "హత్తిపడి"యను చెఱువు నందాతని యేనుగులు యీదినవనియు స్థలజ్ఞులందరు పైవిషయముల వలన నాపుర మొకప్పుడు రాజరాజ నరేంద్రునకు గాకున్నను ఎవరో యొక కళింగరాజునకు రాజధానిగ నుండెడిదని యూహింప వచ్చును. భారతమందు పేర్కొనబడిన కళింగ రాజు రత్నాంగదున కిది రాజధానియైననూ గావచ్చును. గాని కాళిదాసుడు వర్ణించిన హేమాంగదుని రాజధాని గా నేరదు. ఏలన నిదియు సముద్రమున కంత సమీపమున లేదు. 4, 5 మైళ్ళ దూరముననున్నది. ఈ ఉద్యానమేమో కాళిదాసవర్ణితమైన తాళీవనమర్మరమనుట నిస్సందేహమే.

ఇవి యన్నియు నిట్లుగాగ నింక కాళిదాసుని హేమాంగదుని రాజధానిగ నూహించుటకు మిగిలిన దొక్క కళింగపట్టణము మాత్రమే. ప్రస్తుతము కళింగ పట్టణమని వ్యవహరింపబడు గ్రామము మిక్కిలి నవీనము. దీనికి పూర్వపుది కళింగపట్టణమను పేరితోనే ప్రస్తుత గ్రామమునకు దక్షిణమున ముప్పావు మైలు దూరమున వరిపొలములకు నడుమ నొకపల్లె గ్రామము గలదు. సముద్రమునకు మిక్కిలి సమీపముందే గలదు. గ్రామమునకును సముద్రతీరమునకును నడుమ విశాలమైన మైదానము దిబ్బ గలదు. ఆ దిబ్బలో సాలిహుండెను బౌద్ధస్తూపములందలివానివంటివి రామతీర్థము గురుభక్తకొండపైన దొరికినవానివంటివి, అనకాపల్లికడ శంకారము బొజ్జనకొండమీదనున్న వానివంటివియును నగు అతిప్రాచీనములైన యిటికెలు వేనవేలు లభించినవి. వాని నా గ్రామస్థులు గుమ్మములక్రిందను గోడల యందును విస్తారముగా నుపయోగించుకొన్నారు. మన కిప్పుడును గనబడుచున్నవి. ఆ దిబ్బ యందపుడపుడు బంగారునగలు చిన్నచిన్నవి లభించునట. రాజుగారి ప్రాసాదము సముద్రతీరమున నుండెడిదట. అది సముద్రము భూమిని కోసివేయుటచే సముద్రములో మునిగి

పోయినదనియు స్థానికవృద్ధులు చెప్పుదురు. సముద్రము పాటు వేళలందు అప్పుడప్పుడు చేపల వేటగాండ్రకు ఆ కోటభాగము లగపడుచుండునవియునందురు. ఆకోట భాగములకు తగిలిన పడవలు శిథిలములగునని జాలరులు ఆ ప్రాంతమునకు దూరదూరముగ వేట బోవుదురు. ఆకోట కంచుకోట యని స్థానికులందురు. కంచుకోట, వెండికోట, బంగారపుకోట మొదలగు లోహపు కోటలు అతిశయోక్తులు గావచ్చును. కాని దక్షిణదేశమున మహాబలిపురము సాగరసమగ్నమైనట్లుగనే యీ ప్రాంతమున ప్రాచీన కళింగపట్టణమును సముద్రగర్భమందణగి పోయిన దనుకొనుట సమంజసమగును. ఇంతియగాక శాలిహుండము జనశ్రుతియు దీనికి బలము చేకూర్చుచున్నది. శాలిహుండము పూర్వము పెద్దపట్టణము. అక్కడ శాలివాహనుడు రాజ్యము చేసెడువాడు. అతనినుండియే ఆపేరు గల్గినది. అతనిరాజనివాసము వంశధారానది కుత్తరతీరమున నుండెడిది. ఆజనావాసయుండు ప్రదేశమునకు వనితమండలమని పేరు. (ఆపేర నిపుడొక చిన్నపల్లె గలదు) అంతఃపురమునకును, కోటకును, రాకపోకల కనువుగ శిలానిర్మితమైన సేతు వుండెడిది. (ఆసేతువు ఇప్పుడు శిథిలమైనను పూర్వస్థితిని గొంత సూచించుచున్నది) పలువదియేండ్లకుముందు పర్లాకిమిడి రాజావారి ద్రవ్యసహాయమున శ్రీ॥ శ్రీ॥ గిడుగు రామమూర్తి పంతులుగారు శాలిహుండము దిబ్బలు త్రవ్వించినపుడు పగడపురాయితో చేసిన రాజముద్రిక యొకటి దొరకినది. దానిని శ్రీ॥ శ్రీ॥ జయంతి బాలకృష్ణమూర్తిగారు (జయంతి గంగన్నగారి అగ్రజులు) సంపాదించి తమ మ్యూజియములో భద్రపఱచియుండిరి. (దానిని నేను చూచితిని) అంగుళమునఱ నిడివి, అరంగుళము వెడల్పు గలిగి కోడిగ్రుడ్డు ఆకారముగా నున్న దాని బల్లపఱుపు భాగమున బ్రాహ్మీలిపిలోనో ఖరోష్ఠ లిపిలోనో చెక్కబడిన అక్షరములు ఐదుగలవు. రెండవ వైపు క్రమముగా సువృత్తుగా నుండి అనామిక వ్రేలు దూరునంతటి రంధ్రముగలదు. అది తప్పక రాజముద్రికయై యుండును. కానిచో శాలిహుండము స్థూపములందు బసచేసెడి బౌద్ధభిక్షువులకు ముద్రాంగుళీయకముతో బని యేముండును. పూర్వకాలమున శాలిహుండము పట్టణమును కళింగపట్టణము నొకటిగానే యుండెడిదని పెద్దలు చెప్పుదురు. సుమారు 25 ఏండ్లకు ముందు కాశీ హిందూ విశ్వవిద్యాలయము చరిత్రాధ్యాపకులు భట్టాచార్యులనువారుకూడ కాళిదాసు వర్ణించిన కళింగ నగర మేదాయని పరిశోధింపదలంచి భువనేశ్వరము మొదలగుస్థలములన్నియు పరిశోధించి ఈ కళింగ పట్టణములకు వచ్చిరి. వారు గ్రామమంతయు బాగుగా పరీక్షించి లైటుహౌసునకును తీరమునకును నడుమ నొక దిబ్బను గనుగొని దానిని త్రవ్వుట కారంభించిరి. ఆఱు గజములోతు త్రవ్వినంతనే కొన్ని ప్రాచీనతా సూచకములు కనబడినవి. అంతలోనే ఆ గ్రామమునకు మకాము వేసిన శ్రీకాకుళము తాసీల్దారుగారాస్థలమునకు వచ్చి ఇండియా దొరతనమువారి అనుమతి లేనిదే ఆ స్థలము త్రవ్వ వీలులేదనియు దాను తంతిమూలముగా వారి యభిప్రాయము కనుగొందుననియు జెప్పి త్రవ్వక మాపుచేయించినారు. ఆయన సిమ్లాలో నున్న ఎపీగ్రాఫిస్టునకు తంతి నీయగా నక్కడనుండి "అట నెంతమాత్రము త్రవ్వవీలులేదనియు దామే త్రవ్వింతుమనియు" బదులువచ్చినది. అంతట భట్టాచార్యులు గారు దొరతనమువారి వాక్యమును తిట్టుకొనుచు తిరిగి వెడలిపోయిరి. అది త్రవ్వించియే యుండిన యెంతటి వింతలు బయల్పడియుండునో? పై విషయములన్నిటిని క్రోడీకరించి జూచిన కళింగపట్టణము ప్రాచీనకాలమున రాజధానిగా నుండెననుట నిస్సంశయముగానే తేలుచున్నది. ఇది కాళిదాసవర్ణిత ప్రశస్తము నవదగునో కాదో యని మాత్రమే మన మిప్పుడు విచారింపవలసి యున్నది. కాళిదాసుని వర్ణనమున ప్రధాన విషయములివి (1) రాజసద్మము గవాక్షములనుండి సముద్రతరంగములను చూచునట్లును, సముద్రఘోషము బిగ్గరగా వినబడుచున్నట్లును నత్యంత సామీప్య మొకటి. (2) తాళీవనముల మర్మరధ్వనులు గల తీరములుండుట రెండవది. (3) ద్వీపాంతరానీత లవంగ పుష్పముల సువాసనలు వాసించు వాయువులు గల్గియుండుట మూడవది. ఇవి ప్రధానములు. తక్కిన మహేంద్రగిరి మహోదధి ప్రభుత్వములు రాజధానికి ప్రసక్తము లయినవి కావు. పురాతనరాజప్రాసాదము సముద్రగర్భమున మునిగినదనియు, దానిశిథిలభాగము లిప్పుడును పడవలవారి కప్పుడప్పుడు గనపడుచుండునవియుగల జనశ్రుతిచేతను ప్రస్తుతము గనబడు దిబ్బయందును, గ్రామమంతటను కనబడుచున్న పెద్ద ఇటుకలు, దిబ్బయందిపుడిపుడు లభించు బంగారునగల శిథిల భాగములచేతను రాజప్రాసాదము సముద్రము నంటియుండెడిదని తెలియుచున్నది. కావున మొదటి విషయము సంగతమగుచున్నది. తాటితోపులు కళింగపట్టణము మొదలుకొని పూరీవరకును గల సముద్రతీరమున విశేషముగ గలవు. అందును "ఉద్యానమను భాగమున విశేషించిగలవు" ఉద్యాన ప్రదేశముల మనము నందికొనియే కవి "తీరేషు" అను బహువచనము ప్రయోగించినాడు. దండి దశకుమార చరిత్రమునందుకూడ వివిధ ఫల కుసుమ భరితములగు సాగరతీరోద్యానము లందు సకుటుంబ పరివారముగ విహరించుచున్న కళింగ

రాజా సాంగ్రమహీశుడు జయసింహుడు బందీగా గొనెనని వర్ణించెను, ఉద్యానము నందిపుడును, తాళ నారికేళ, పనసామ్రాది ఫలతరువు లత్యధికముగా గలవు. ఇది పూర్వకాలమున సాంగ్రరాజగు జయసింహ వల్లభుని నాడును కాళిదాసు నాడు నిట్లే ప్రసిద్ధములైయుండు నని యూహింపవచ్చును. మూడవ విశేషణము ద్వీపాంతరానీత లవంగ పుష్పముల వాసనలు. కవి ప్రయుక్తమగు పదమునకు ద్వీపాంతరము నుండి గాలులు లవంగ పుష్పములను దెచ్చుచున్నవి అనునర్థము లభించుచున్నది కళింగ పట్టణమునకు తిన్నగా తూర్పుదిక్కున సుగంధ ద్వీపములను ప్రసిద్ధిగల జాంజిబారు జావా మొదలగు ద్వీపములున్నవి. వానినుండియే యిప్పుడును లవంగములు దిగుమతి చేయబడుచున్నవి. అయినను నా తూర్పుగాలులు సుదూరమునగల ద్వీపములందలి పూవులను మోసికొని వచ్చునంతటి పెనుగాడ్పులని కవి భావము గాదు. స్వేద లవముల వారించునంతటి పిల్ల తెమ్మెరలు మాత్రమే కవ్యుద్దిష్టములు. అపుడా పదినులపు ద్వీపాంతరములనుండి దిగుమతి చేయబడిన లవంగ పూల వాసనలు గాలులు మోసుకొని వచ్చుచున్నవను భావము స్ఫురించును. ఈ ప్రాంతములందుగల కళింగ వైశ్యుల పూర్వులు చేతివడకు నూలు సన్న బట్టలను పైదేశముల కెగుమతి చేయుచు ప్రాగ్ద్వీపములనుండి లవంగములను దిగుమతి చేయుచును వాణిజ్య మొనరించువారట. తత్సూచకముగ నిప్పటి వారిప్పటికిని వివాహాది శుభకార్యములందు వడుకునూలు వస్త్రములను లవంగములను నుపయోగించుచున్నారు. పెండ్లికి పిలచునపుడు ముందు పిలవవలసిన వారికి లవంగము లిత్తురు. లవంగము లిచ్చినకొడనే నోటజెప్పకయే పెండ్లికి బిలచుచున్నారని గ్రహింపబడును. "లవంగములు పంపుట" అనువాక్యము పెండ్లికి పిలుచుటకు పర్యాయ పదముగ వ్యవహరింపబడుచున్నది. కళింగ పట్టణము కడ వంశధారానది సంగమ ప్రదేశము పూర్వకాలమున గొప్ప ఓడరేవుగ నుండెడిది. ఈ రేవునుండి ద్వీపాంతరములకు నౌకాయానము విరివిగా జరుగుచుండెడిది. బౌద్ధమత ప్రచారకు లీ రేవునుండి బర్మా, సయాము మొదలగు దేశములకు యాతాయాతములు జరుపువారు. వారి బసలకును పూజలకును గానే శాలిహుండము స్థూపములు వెలసినవి. కాబట్టి యీ రేవునకు దిగుమతి జేయబడిన లవంగ పువ్వుల వాసనలను గాలులు మోసికొని పోవునని(యే) కవి భావము. రఘువంశము నాల్గవ సర్గమున ||శ్లో|| తాంబూలీనాం దళై స్తత్ర రచితాపాన భూమయః, నారికేళాసవం యోధా శ్శాత్రవం చ పపు ర్యశః|| అను శ్లోకము గలదు. తమలపాకు దొన్నెల్లో కొబ్బరికల్లు రఘు మహారాజు సైనికులు త్రాగిరని దీని భావము. ఇప్పటికి నా ప్రాంతమున దొన్నెలుగా గూర్చ దగినంతటి పెద్ద తమలపాకులును, కల్లు తీయుటకు సమృద్ధమైన కొబ్బరిచెట్లును విరివిగా గలవు. ప్రాతకళింగపట్టణ మనబడు పల్లెలో నొక శివాలయము గలదు. ఆ దేవుని పేరు పనిశేశ్వరుడట. లింగము అతి ప్రాచీనము. ముఖలింగము నందలి లింగమును బోలి యున్నది. పూర్వకాలపు ఇటుకలు అల్ల ప్రాంతమున గలవు. వీనిచే నా యాలయము పురాతనమైనదని విశ్వాసము గలుగుచున్నది. పసిండి, పనిడి, పైడి శబ్దములకు బంగారమను అర్థము గలదు. ఛిమిడి అను నపభ్రంశ రూపమొకటి వాడుకలో కలదు. ఈ ప్రాంత జనులచేత కొబ్బరికాయను పసిమికాయ, పనికికాయ, పైడికాయ యని వ్యవహరించుచున్నారు. బంగారమను నర్థమిచ్చు పనిడి శబ్దముగాని లేత యని అర్థమిచ్చు శబ్దము కాని యీ శివుని పేరనుట యుక్తముగా లేదు. ఇప్పటి అర్చకులు కొత్తవారగుటచే పూర్వచరిత్రము చెప్పజాలరైరి. "పనిసర" శబ్దము 'పనిస' గా మారిన దేమో యని నా తలంపు. మూడవ వజ్రహస్తదేవుడు దీనికి నాతిదూరమున నే గల కొర్ని (ఖోన్న) గ్రామమును బ్రాహ్మణాగ్రహారముగా దానము చేసినాడు. అతడే బహుశః తన పేర నా శివలింగమును ప్రతిష్ఠించి యుండవచ్చును. పనిసర వజ్రహస్త శబ్దములు సమానార్థకములు గదా? అతడు దానము ప్రకటించిన విజయ కళింగ నగరము ఈ కళింగపట్టణమే గాదగును. అతని రాజధానియు నిదియే. వాల్మీకి రామాయణమున "కళింగ నగరే చాపి ప్రాప్య సాలవనం మహత్" అని కళింగ నగరము పేర్కొనబడినది. గంగ గాంగరాజుల శాసనము లనేకములందు విజయ కళింగనగరము పేర్కొనబడినది. కళింగపదశూన్యముగా నగరమను పదమొకటి రెంటియందు గలదు. ప్రస్తుతము ముఖలింగ సమీపమున నున్న నగిరి కటకము ప్రాంతమున పుణ్యక్షేత్ర సూచనములే గాని రాజధానీ సూచనము లేవియూ లేవు. కావున శాసనము నందలి నగర పదమునకుగూడ కళింగ నగరమే యర్థము. పర్యవసానమేమనగా, వాల్మీకి, కాళిదాస దండికవుల కాలమునను, గాంగ గంగరాజుల శాసనముల కాలమునను వేములవాడ భీమకవి కాలమునను ప్రసిద్ధమైన కళింగ రాజధాని యిప్పటి కళింగపట్టణమే యని తేలుచున్నది. ప్రాచీన పట్టణవైభవము సాగరగర్భమున దిగిపోవుట కాలమహిమ. సుమారు రెండుమూడేండ్ల నుండి వంశధారా నది గ్రామము పడమటి భాగమును ముంచెత్తుచు నేలను కోసివేయుచున్నది. దొరతనము వారు రక్షణ ప్రయత్నములు చేయుచునే యున్నారు. ప్రాచీన వైభవమును మ్రింగివేసిన సముద్రమునకు దోడై వంశధారా నది యీ పురాతన క్షేత్రపతాకాశేషమును కబళింపకుండ శ్రీ పనిసేశ్వరుడు అనుగ్రహించి కళింగపట్టణమును చిరస్థాయిగా నొనర్చుగాత.

# దూతమత్తేభము

కళాదాస

* గత సంచిక తరువాయి *

పగ లాహూషనులన్ చరించుట వియోగంబంత పీడింప; ద
య్యది రేలన్ బహుధా వ్యథించు నని యెంతున్ నిర్వినోదస్థితిన్;
కిటికీనుండి నిశీథి నాదు కుశలం బందించి ఆనంద పె
ట్టము—నేలన్ పవళించి కన్నులను మూయన్ లేని—నా ప్రేయసిన్.

ఒక వైషాత్తిలి—చంద్రరేఖకల ప్రాచీమూలమం దట్లు—గా
ఢమనోవ్యాధి కృశించుచున్ విరహాశయ్యన్ వేగు నాతోయ్యలిన్—
గను; మేరేయి క్షణంబుగా గడిచె నాతో గూడ విచ్ఛారతిన్
గడపున్ దానిని నేడు దారుణ వియోగగ్రీష్మ దీర్ఘంబుగన్.

తొలియట్లే—కిటికీల జొచ్చు శశికిన్ పాదార్చన ప్రీతితో
ఎదురేతెంచియు మోహమః త్రిప్పియబె వెన్కంబోవు పుణ్యాంగి;—ఖే
దమునన్ బాష్పభరాలసంబులగు రెప్పల్ కన్నులన్ గప్ప—దు
ర్దిన భూపద్మినివోలె—మేల్కొనదు నిద్రం బోదు దైన్యంబునన్.

చిగురున్ వాతెఱవాడ—రిక్త సలిలస్నాన క్రియా కర్కశా
లకలన్—చెక్కులజాఱ—పైకెగచు నిశ్వాసంబులో నాదు సం
గమ లీలల్ కలనేని కాంతునని నిద్రాదేవి నర్థించెనీ;
ప్రతిరోధింపను పోవ్యమాణ నయనాశ్రూద్వేగధారల్ సఖా.

విరహారంభ దినంబునందె విరిదండల్ వీడి యేకంబుగా
జడచుట్టన్ కురులన్ శుభాంగి, అదితాకన్ కష్టమై చెక్కులన్
పారలన్ తీయని గోళ్ళతోడ సవరించున్ సారెకున్ చూడు, మా
ముడి శాపాంతమునందు నేను శుచినై విప్పన్ వలెన్ మిత్రమా.

నగలున్ వల్గులు సన్యసించి నిజశయ్యోత్సంగ భాగంబునన్
బడి—దుఃఖాధిక దుఃఖ శుష్కమగు కాయం బెట్టులో మోయు నీ

సఖ,—రాకుండవు నీకు సైత మట నూతాన్న్రశూద కాసారముల్—
కరుణోదారులు కారె ప్రాయికముగా ఆర్ద్రాన్తరాళాత్మకుల్.

ఎఱుగన్ జాలుదు నామె యంతరము నాయం దప్రతి స్నేహ బ
ద్ధముగా—కావున నే తదాద్య విరహాంబాభంగి వర్ణించితిన్;
సుధగమ్మన్యులబోలె నన్ను నొక వాచాలుం డటం చెంచబో
కనుగుం దమ్ముడ! మామకోక్తి మదిమెల్లన్ వేగ ప్రత్యక్షమా.

జిగుకుం గాటుకమాని—ముంగురులు చూపడ్డన్ కటాక్షంబులన్—
మధుసేవన్ త్యజియింప ప్రమాన్పడగ సుభ్రూభంగిమల్—వేగు నా
లలనా వామవిలోచనం బుపరి సుస్పందించు నీరాకలన్—
శకులీక్షుబ్ధసరిత్ భ్రమత్ కువలయశ్రీచక్రరూపంబునన్.

త్యజియించున్ చిరబద్ధమైన తన ముక్తామాలికన్ కాంత—దై
వగతిన్—నానఖరాంక పీడనము దూరంబౌట; నన్మద్రతాం
తములం దొత్తుదు నొయ్యనొయ్య నెపుడే రంభాసిత స్తంబ శో
భిత—మా వామమృదూరుభాగమున స్పందించున్ శుభాదేశమై.

జలదా! నీవట చేరువేళ సుఖనిద్రాలబ్ధ యౌ నేని నా
చెలి—సైరింపుము యామమాత్ర గతగర్జాశాలివై—మెట్టులో
నతికిన్ మామకసంగమంబు కలనేనిన్ దక్కుచో! తద్భుజా
లతికల్ నా మెడ మూళ్లుపడ్డ బిగి కౌగిండ్లూడ కుండున్ త్వరన్.

భవదాపోలవ శీతలానిలములన్ మేల్కొల్పు మన్మత్కళ
త్రముతో—లోల్కరి మొగ్గలీను విరిజాజిన్ గూడ; వాతాయనం
బుల నీవ్రండగ చూచుమానవతి తెప్పల్ వాల్పకే—కాన—ధీ
రుడవై నిల్చి యుపక్రమింపు స్తనితోక్తిన్—దాచి విద్యుత్ప్రభల్.

నను నీ భర్తకు మిత్రుగా నెఱుగుమో పుణ్యాంగనా! తత్ప్రియా
శయమున్ తెచ్చితి నీ సమక్షమున కాత్మం బెట్టి—నే మేఘుడన్;
జడకట్టై పెనబడ్డ ప్రోషితల కేశక్లేశముల్ తీర్ప నా
తురులౌ పాంథుల సేదలార్పుదును త్రోవన్ స్నిగ్ధమంద్ర శ్రుతిన్.

ఇటులాడన్ మొగమెత్తి—సీత హనుమంతున్ బోలె—వీక్షించు న
త్సుకతన్ చిత్తము పల్లవింప—నిను సంభావించు—శ్రద్ధాళులై
విను నా మాటట నీ వచించు కథ—కాంతోదంతముల్ కావె కాం
తల కించించుక సంగమోత్సవ విభావంబుల్—సుహృద్గీతలన్.

ఉపకారంబగు నీకు మామక మనస్సంప్రార్థనల్ జేసి, మి
త్రుడ! భాషింపుము జాయతో నిటు 'చిరంటీ! రామగిర్యంతమం
దమ్మృతుండై విరహించు నీ ప్రియుడు పృచ్ఛించిట్లు నీ సేమముల్ —
సులభాపన్నుల ప్రాణులల్ తొలుత నాశ్వాసించు టిట్లే కదా!

విధి వైరంబున మార్గమడ్డగ సుదూరగ్రస్తుడై యాత డ
శ్రుభరోత్కంఠత కుంగి—క్రుస్సి—విధురోచ్ఛ్వాసంబులల్ వేగు స్వాం
గములల్, చేడ్పడి—చిక్కి—స్రుక్కి—సెగ లూర్పుల్ చిమ్మ, శోషించు నీ
తను భాగంబులతో లయింప తివురల్ సంకల్పధారాధురీల్.

అబలా నీ ముఖమూన నానవడియున్ చేటీ సమక్షంబునన్
పలుకన్ మాని చెవిన్ గదించు ప్రియు డెవ్వం; డాత డేకాకియై
చెవికిన్ చిక్కక—చూపు కందక—నిరోగశ్రాంతి సూత్రించె నే
భవదిష్టార్థపదంబు, దాని విను మస్మత్కంఠ ముక్తంబుగన్.

ముఖకాంతిన్ శశిబింబమం దు—కనుచూపున్ భీతసారంగ నే
త్రములన్—కుంతల బంధమున్ శిఖికలాపం బందు—గోవందనీ
లతికన్ నీ లలితాంగ శోభలను, చండీ! చూడగాంక్షింతు; కా
ని కటా! సంధిల వెందు నించుకయు నీ సౌందర్య సాదృశ్యముల్.

ప్రణయామర్ష వికల్పమైన భవదీయాకార రేఖల్ శిలా
ఫలకం బందున ధాతురంజనల నుల్లేఖించి, పాదస్థలిన్
పడిన ట్లేను లిఖించుకో తలచినంతన్ బాష్పముల్ పొర్లి చూ
పులు మాపున్—విధి సైప డందయిన నస్మత్ సంగమంబుల్—సఖా!

కలలో నెట్లొ లభించు నీ నిబిడగాఢాలింగనార్థంబు క్ర
మ్మఱ నే బాహులు సాచ శూన్యతలి నీక్షించున్ స్థలీదేవతల్
తరుశాఖాకిసలాశ్రుబిందునిచయంబుల్—పెద్దముత్యంబులం
తలు—పెల్లుబ్బగ—రాల్పలేక నిలుపంగా లేక—ప్రాంతంబునన్.

అపుడే త్రుంచిన దేవదారు చిగురాకుం బొత్తులన్ జాఱు క్షీ
ర సుగంధంబు వహించి, దక్షిణదిశానృత్తంబులై వచ్చు తత్
తుహినాహార్య సమీరణంబు, లవి, రాజీవాక్షి మున్ముందు నీ
సరసన్ చుట్టి మెలంగి యుండొలయు నంచున్ కౌగిలింతున్ దగన్.

జలధారల్ తడుపన్ సుగంధియగు భూమిన్ బోని నీయాస్య మం
జలికిన్ దూరుడనై కృశించు నను బాధించిప్పుడేమారు, డిం
క నిదాఘాంతములన్ కటా! గడపు టెట్లో బాల! ధారాధరా
వళితంబై దివసాతపంబు పొడసూపన్ లేని కాలంబునన్.

క్షణకల్పంబుగ దీర్ఘయామ—నిశి—సంక్షిప్తంబుగా నోపునో;
సకలావస్థల మందమంద రవిరశ్మిన్ చిల్కునే యీ పగల్;
అనుచున్ దుర్లభచింతితాభిలషమా నాలూన లీలాశయం
బ శరణ్యంబయి సోలు తావకవియోగ గ్రీష్మ గాఢాహతిన్.

నను నాచే నిలుఁపోపుకొందు నిట నానా రక్తు లూహించుచున్
సుభగా! కావున నీవునున్ దిగులు చెందన్ బోకు మత్యంత—మె
వ్వరి కబ్బున్ సుఖ మొక్కటే? అటులె దుఃఖంబే వహించెవ్వరిన్—
దశలున్ ద్రిమ్మరు క్రిందు మీదులయి చక్రారావళీ ప్రక్రియన్.

ముగియున్ శాపము నాకు చక్రి ఫణిశయ్యన్ లేచునా దుగ్మలీ!
సహియింపం దగు కండ్లు మూసికొని నీ వీ నాల్గుమాసంబు—లా
వల నస్మద్విరహాంబువేళ తలపోతల్ పొర్లె నేమేమి—త
త్తదపేక్షల్ తనివో సుఖంతము శరద్రాకాత్రియామల్ చనన్.

సుదతీ! నీ ప్రియు డాడె నింక నిటు మున్నేనాడొ మత్కంఠ బ
ద్ధవుగా పాన్పున నిద్రచెందియు నెలుంగెత్తేడ్చుచున్ లేవ, ప
ల్మరు పృచ్ఛించితి:—సంత—'నోకితవుడ! కన్గొంటి, నీ వన్య నె
వ్వతెనో చొక్కల చేయుచుంటి' వన వే లోలోపలన్ నవ్వుచున్.

కుశలిన్ గా నను నీ వెఱుంగు మసితాక్షీ! ఇప్పుడే చెప్పి పం
పిన గుర్తుల్ స్మరియించి; నమ్మకము లోకాభిప్రవాదంబు; నే
లనొ భావింతురు విప్రయోగమున స్నేహధ్వంసమున్; కాని ఇ
ష్టపద స్నేహరసంబు—ప్రేమమయి—రాసుల్ గట్టు భోగింపమిన్.

ఇటు లోదార్చి అపూర్వ దుర్భరమహా శోకార్తన్ సఖిన్, సత్వరం
బుగ నే తెంచుము—శూలి యొద్దు కొనకొమ్ముల్ గ్రుమ్ము కైలాసమున్
విడి—నా ప్రేయసి ప్రీతిసంపు కుశలాభిజ్ఞానదానంబుతో
నిలుపన్—వేకువ మల్లెపువ్వవలె రాలన్ బోవు—నా ప్రాణమున్.

సఖుడా! నమ్మెద నిర్వహింతు వని నాయీ బంధుకృత్యంబు, తా
వక ధీరోన్నతి సంశయించుటగు ప్రత్యాదేశ మాసించినన్
నిను యాచింప పయస్సు లిచ్చెదవు నిశ్శబ్దంబుగా చాతకం
బుల;—కథ్యర్థన సిద్ధియొక్కటె బుధప్రత్యుక్తి మిత్రాళికిన్.

జలదా! సౌహృదవృత్తినో—విధురుడంచున్ జాలినో—నల్పు మీ
ప్రియకార్యం బనుకంప నీకనుచితంబైనన్ సుహృత్ ప్రార్థనన్;
జలకాలాడుము ఇష్టదేశముల వర్షశ్రీవిభాసింప—నీ
సహసౌదామినితో వియోగము నిమేషంబేని కాకుండగన్.

ఘనవంశాభరణుం డతండును జనాప్యాయ్యశ్రుతిన్ దివ్య వా
క్కుల యక్షేశ్వరి ప్రాణముల్ నిలువ నాసందేశమున్ చెప్పె, ఆ
సతియున్ నాథుని స్వస్థవృత్తము సమాకర్ణించి సంమోదమా
నసయయ్యెన్—సఫలింపవెట్టు లనవద్య ప్రార్థనన్ కామ్యముల్.

ధనదుండున్ జలదుండు చెప్పిన నదైన్యోదంత మాలించి, తత్
క్షణమే కోపము నాపి శాపమును సంక్షేపించె—నా దంపతుల్
గళితోత్కంఠనులై—ప్రహృష్టహృదులై—సంయోగ భోగంబు లం
దిరి, పూర్వప్రతిపత్తితో ప్రభుదయాదాక్షిణ్య పర్వంబుగన్.

* * *

ఇది కాళిదాసమే
ఘదూత; తెనిగించితి యతికై ప్రాసముకై
వెదుకక, కవికులపతి రస
వదిష్టపద విరచనానువర్తన భణితిన్.

సమాప్తమ్

# నూతనగ్రహములు

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ప్రాచీనకాలమున ఖగోళశాస్త్రవేత్తలచే కనుగొనబడిన ఇంద్ర వరుణ యము లను నూతనగ్రహములు సహా జాతక ముహూర్తాదులలో ఫలప్రదములుగా నున్నవనుట 'భారతి'లోని నా వ్యాసములను కటాక్షించిన పాఠకమహాశయులకు క్రొత్త విషయము కాదు. ఐనా, ప్రాచీనసంప్రదాయపు శాస్త్రవేత్తలు కొందరు ఆ గ్రహములను నిరాదరించుచునే యున్నారు. సత్యమును విచారించితిమేని, ప్రాచీన పద్ధతిపై గల అభిమానము కంటె, ఆధునికదృష్టిపై గల అనాదరమే, వారి అనాదరమునకు కారణము. హైందవ జ్యోతిశ్శాస్త్రము ప్రాచీన నవగ్రహములతోనే సర్వసమగ్రముగా నున్నదనియు, దానికి ఈ నూతనగ్రహములు అవసరము లేదనియు, వారి సామాన్యవాదము. అత్యాశ్చర్యకరములగు ఫలములను సూచించు "నాడీ జాతక" గ్రంథములను రచించిన మహనీయులు మన ప్రాచీనులు నవగ్రహములతోనే నిర్వహించియుండగా, మనకీ నూతనగ్రహము లేల? అనువారున్నారు కూడ. నాడీగ్రంథములందలి ఫలములు సత్యముగా అత్యాశ్చర్యకరములైనవే. కాని, ఆ ఫలములను ఏ ఆధారమున ఆ గ్రంథకర్తలు సాధించిరో, తెలుసుకొను ఉపాయమున్మాత్రము మనకు కానరాకున్నది. తపశ్శక్తితో సాధించిన దివ్యదృష్టి ఫలమేమో? అట్టి తపశ్శక్తిసంపన్నులగు హోరాశాస్త్రజ్ఞులకు ఖండితముగా ఈ నూతనగ్రహముల అవసరము లేదు. అంతియేల? అట్టివారికి ఏ గ్రహములతోమాత్రమేమి పని? వారి దివ్యదృష్టియే చాలదా? కాని, సామాన్యవిద్యార్థుల మాట వేరు.

సాధారణముగా వాడుకలో నున్న మాత్రముల ఆధారమువలననే మన మిప్పుడు జాతకఫలములను ఊహించుచున్నారము. అట్టిచో, ఈ నూతనగ్రహసామగ్రి మన కక్కర లేదా? నవగ్రహములతోననే అన్ని ఫలములు సాధింపవచ్చు ననువారున్నారు. అట్లు సాధించెదరు కూడ. వరుణగ్రహవేధా కాలములలో జరిగిన వివాహము విడాకుల పంపకముతోనో, శాశ్వతవియోగముతోనో, పర్యవసానమయిన సందర్భములలో, అదుష్ఫలము జాతకమందలి ఏ కుజదోషమునకో, ఏశనిదృష్టికో, చెల్లుకట్టి తృప్తినందుట కలదు. ఆ దోషమునకు గాని, ఆ దృష్టికి గాని, విలువ లేదనుట నా ఆశయము కాదు. ముఖ్య కారణ మేది, అనుటే సమస్య.

ఒక కార్యము జరుగుటకు సాధారణముగా ఒకటే కారణము ఉండదు. ఎన్నో కారణము లుండగలవు. వానిలో ఒకటి ప్రాధాన్యము వహించును. ఇతరములు కారణములై దానికి సహాయముగా పరిస్థితుల నెదిగించును. చిన్న ఉదాహరణ మొకటి మనవిచేతును. రాజమార్గముపై వేగముగా పోవుచున్న మోటారుబస్సు దారి తప్పి బాట ప్రక్కనున్న చెట్టునకు 'ఢీ'కొట్టి బస్సులో నున్నవారికి అపాయము కలిగించిన దనుకొందము. ఈ ప్రమాదమునకు కారణ మేది? అను ప్రశ్న యున్నది. బస్సును అతివేగముగా పోనిచ్చుట, 'బ్రేకులు' పటిష్ఠములైనవి కాకపోవుట, సారథియొక్క అజాగరూకత, అనునవి కారణములుగా తోచును. ఇతర ప్రబలకారణము కానరానిచో, సారథియొక్క అజాగరూకతయే ముఖ్య కారణముగా నిరూపింపబడుచున్నది. కాని, అకస్మాత్తుగా, ప్రక్కనుండి యొక బాలిక హఠాత్తుగా పారివచ్చుటచే, ఆ ప్రాణమును కాపాడుటకై, సారథి గభాలున బస్సును త్రిప్పుటవలన చెట్టు తగిలిన దని సాక్ష్యము వచ్చినచో, అప్పుడు ముఖ్యకారణము మారును కదా? అట్లే ప్రబలకారణ మని తగిన గ్రహయోగము మరుగున నున్నప్పుడు, కనిపించిన యోగములలో ఏదో ఒకదానిని సందర్భానుసారముగా ముఖ్యకారణ మని విశ్వసించుట సహజము. కాని, కారణాంతరము ప్రబలమైనది చూపట్టిన తరువాత సైతము, "అది మాకు అనవసరము; మేము అనుకొన్న కారణమే మాకు చాలు." అనుట ఏమి న్యాయము?

పోనిత్తము. ఈ క్రింది దృష్టాంతమును గమనించిరేని, పాఠకమహాశయులే ఈ సమస్యను తేల్పగలరు.

ఈ క్రింద నున్నవి ఒకానొక తరుణ దంపతుల నిరయన జాతక చక్రములు.

| | | | |
|---|---|---|---|
| రా | | | |
| కు | స్త్రీ జాతకము — చంద్రదశ శేషము సం. మా. ది =4-5-8 | | గు |
| శు శ చ బు ర | | | |
| ల | | | కే |

| | | | |
|---|---|---|---|
| కే | | చ | కు బు |
| | పురుష జాతకము — చంద్రదశ శేషము సం. మా. ది = 8-0-0 | | శు ర |
| | | | గు శ |
| ల | | | రా |

ఇద్దరికిని లగ్నము ధనుస్సే. స్త్రీజాతకమున రాహు మహాదశలో గుర్వంతరము, పురుష జాతకమున రాహు మహాదశలోనే కేత్వంతరము, జరుగుచుండగా వీరికి వివాహము అయినది. పెండ్లిఅయిన రెండు వారములకే వధువు తన కాపురమును చేరుకొనెను. కాని హతవిధి వీరి అనుకూలదాంపత్యమును ఓర్వలేదు. ముచ్చటగా మూడునెలలైనా నిండకమునుపే, ఆకస్మికముగా విషమజ్వరముపాలై భర్త లోకాంతరగతు డయ్యెను. పదునైదు సంవత్సరముల ముగ్ధ అనాథ అయినది!

ఇంతటి దుష్ఫలితమునకు వీరి జాతకములో ఏ యోగము కారణము? కుండలులను చూచినచో, ఇటాలన కుజదోషము మనస్సునకు వచ్చును. నీచకుజుడు అష్టమ (మృత్యు) భావములోనున్న జాతకుడు భర్త. ఇది గొప్పదోషముగా పరిగణింపబడుచున్నది కదా? కాని,

ధనే, వ్యయే చ, పాతాళే,
జామిత్రే, చాష్టమే, కుజే,
పత్నీ హంతి స్వభర్తారం,
భర్తా భార్యాం వినాశయేత్."

అను సూత్రముప్రకారము, భర్తకు ప్రబల కుజదోష మున్నది కనుక, భార్యకు అల్పాయువు చూపటవలసియుండెను. కాని ఫలము తారుమారైనది.

"అష్టమే భౌమ దోషస్తు,
ధనుర్మీనద్వయో ర్వినా,"

అను అపవాదసూత్రమువలన భర్త జాతక కుజస్థితి దోషకారి కాదనవచ్చును. ఇక స్త్రీజాతకములో కుజుని దోషము కుటుంబభావములోనున్నది. కాని ఈ కుజుడు నీచాంశలోనుండుటే కాక, అస్తంగతుడైనాడు.

"దుర్బల, శ్శత్రుదృష్టో వా,
సూర్యేణాస్తంగతోపి వా
యుద్ధే పరాజితో వాపి,
న దోషం కురుతే కుజః."

అను ప్రమాణము ననుసరించి, ఈ కుజుడు సహా దోషకారి కాదనవలసియున్నది. ఉండెనా, ఇద్దరికిని కుజదోష మున్నదని కాని, లేదా, ఇద్దరికిని లేదని కాని, ఏర్పడవచ్చును. ఏ వాదము సత్యమైనా, కలిగిన ఫలమున కది కారణము కాజాలదు. మరి, కారణ మేది? భార్యకు అష్టమస్థానమందలి గురువు సౌమంగల్యమును పోషించలేకపోయినాడనవచ్చును. కాని, ఇతడు ఉచ్చ గ్రహము. ఇట్టి దుష్ఫల మతడిచ్చునా?

ఇరువురికిని రాహుదశయే. గృహ (IV) స్థానములోనున్నాడని, గృహభావమును చూచుచున్నాడని, రాహువు గృహస్థాశ్రమభంగమునకు కారణముగా చెప్పవచ్చును. గృహస్థాశ్రమ స్వీకారమునకే భంగము కలిగించియుండినచో, ఈ రాహువునకు ధన్యవాదము లర్పించియుందుము కదా?

ఈ జాతకములకు సాయన గ్రహములతోడి సాయన స్పష్టచక్రముల నింక పరిశీలింతముగాక.

భార్య జాతక మిది:—

| | | | |
|---|---|---|---|
| రా 28-23<br>శు 21-52 | వ 16-12 | | |
| ర 15-57<br>కు 14-54<br>చ 8 40<br>బు 1-21 | భార్య<br>జాతకము | | యు 20-35 |
| శ 28-0<br><br>I 10-32 | సాయనము | | VIII 13-21<br>ఎ 17-52(వ) |
| | | X 19-0 | ఇ 7-10 (వ)<br>కే 28-13 |

లగ్నము మకరమైనది. అష్టమభావాధిపతి (సౌమంగల్య, అథవా, భర్తృమరణస్థానాధిపతి) రవి చతుర్థభావాధిపతియై, కుటుంబ (II) భావమందున్న కుజునితో, ఆ రవికి అత్యంతిక సంయోగము. ఇదిచాలక, అష్టమభావమందలి వ్యయాధిపతి గురువుతో ఈ రవి కుజులకు సమసప్తక క్రూరవేధ! సప్తమాధిపతి చంద్రుడో, ఈ గ్రహముల వేధకే పోవుచున్నాడు! అష్టమ, చతుర్థ, వ్యయభావములకు 'మోక్ష త్రికోణ' మని పేరు. ఈ మోక్షభావాధిపతులు ముగ్గురూ కూడ బలుకుకొని, సప్తమభావాధిపతిని (భర్తను) ఆకర్షించుచున్నట్లు చూపట్టుచున్నది కదా? వైవాహికజీవితవిషయమున ఇది ప్రబలదోషకారి.

కాని, జన్మకాలములోనున్న యోగమిది. అప్పుడే ఫలించదుకదా? ఏయోగమయినా, దశ అనుకూలించనిదే ఫలప్రదము కానేరదు.

"యోగాస్తే కిం కరిష్యంతి,
స్వదశానా మనాగమే?"

అని పెద్దలు చెప్పిరి.

కన్యలకు ముగ్ధావయస్సులోనే ఇట్టియోగములకు దశాసౌకర్యము కలుగుచో, ఆలోగా వివాహప్రసక్తి లేకుండుటే శ్రేయస్సు. అట్టిదశ వచ్చునప్పటికి భర్త వచ్చియుండెడుకనుక, దశాదోషము వైవాహికజీవితమున కంటదు. ఆదశ గడచినతరువాత నెమ్మదిగా పెండ్లి జరిగినచో, మరల ఆదశ రాదు కనుక, తొందరయుండదు. కొన్ని జాతకములకు అట్టిదశ రమారమి 18 నుండి 28 సంవత్సరముల వయస్సులో, ఎప్పుడో తీరినపుడు వచ్చుట కలదు. అది కడమదనుక వివాహము కాకుండుట సాధ్యమా, యుక్తమా, అనుట ప్రౌఢలగు కన్యకలో, వారి పెద్దలో, నిర్ణయించుకోదగిన విషయము. చెక్కులు గుంటలుపడినా. కురులు నెల్లబడినా, వివాహముకాక, లేక చేసుకొనలేక, ముదురుపాకమునకు వచ్చిన కన్యకలు (అనగా, అవివాహితస్త్రీలు) ఎటు చూచినా, సంఘములో నేడు కానవచ్చుచున్నారు గదా! దశలను గురించి వారి వివాహము కాలేదని కాదు. ఎన్నో ఇతర కారణములు!

అది యట్లుండనిత్తము. పదునైదు సంవత్సరముల బాలప్రాయమందే ప్రశంసలోనున్న పడుచుకు వచ్చిన దశ లివి:—

(1) వివాహకారకుడగు శుక్రుడు జన్మలగ్నమునకు కేంద్రమునకు వచ్చుట. (మేషము 10-32°)

పెండ్లిమాటలు పుట్టుదశ ఇది. ప్రయత్నము ఫలించగలదు. (మీనము 1°-40')

(2) చలితరవికి జన్మవరుణునితో అర్ధకేంద్రవేధ.

ఆశచూపి నిరాశలో పర్యవసానమగుచుండెడి దశ ఇది. పులిమీద పుట్ర అన్నట్లు, రవికి అష్టమభావాధిపత్య మొకటి!

(3) చలితగురువు (సింహము 16-51°) వికరముగా జన్మరవికి సమసప్తకము.

మృత్యుభావాధిపతితో కుటుంబస్థానమందలి గురువుకు వేధ! ఇది వివాహమునకు తగనికాలము.

దశలు దుష్టములనుటకు ఇదే చాలును. కాని ఇచటనే సహమ బిందువుల విశేషత. చలితజాతకములో ఈ క్రింది సహమములు ఏమి సూచించుచున్నవో చిత్తగింపుడు:—

(4) చలిత దాంపత్య సహమము (16° వృషభము) జన్మరవితో, చలితగురువుతో (సింహము 16°) సహా, అర్ధకేంద్ర కేంద్రదృష్టికి వచ్చినది.

(5) ఇంద్రుడు చలించి (6°-45' కన్య) పార్శ్వ కేంద్ర విషమదృష్టితో భర్తృమృతిసహమమును ఉద్బోధించుట;

(6) చలిత భర్తృమృతిసహమము (6°-45' కుంభము) శుక్రునితో అర్ధకేంద్ర దృష్టికి వచ్చుట.

ఇట్టి దశలు నడచుచుండగా, వివాహము జరిగినచో, దాని పరిణామము ఎట్లుండగలదో, ఈ సహమములు ప్రేలితో చూపుచున్నట్లున్నదికదా?

పాపము. అంత లేతవయస్సులో ఆకన్యకకు ఇట్టి దుష్టదశలు వచ్చుట దుర్దయిన పరిణామము. ఇప్పటిపరిస్థితులలో ఇంత చిన్నవయస్సులో వివాహ ప్రశంస వచ్చుటే అరుదు. వైవాహికజీవితమునకై ఉత్కంఠాజాలు స్థితిలో ఆమె యుండినది కాదు. కాని, నవనవోన్మేషభాసమానమగు ఆమె సౌందర్యవిలాసమును జూచి భ్రమసిన వరుడు పట్టుపట్టి భగీరథప్రయత్నము చేసి, ఎంతో ప్రయాసపడి ఆమె తల్లిదండ్రుల నొప్పించి, కడకు కార్యమును సాధించినాడు. ఆ వైపున ప్రతిబంధక సామగ్రి ఎంతో యుండినా, ఉపాయముగా అది తొలగించబడినది. నక్షత్రానుకూలమును చూచుటకుగాని, ముహూర్తమును నిర్ణయించుటకు గాని, కన్యక పెద్దలు ఏ దైవజ్ఞునితోనైనా సంప్రతించినచో, ఎవరినోటనేమాటపుట్టి, ఎటులయి ఎటువచ్చునో, అని ఆ భారమంతయు తన పైనే నిర్వహించురీతిగా వరుడు చాతుర్యముతో ప్రవర్తించెనట! ముహూర్తము సమీపింపగా, అరిష్టసూచకముగా ఏదో ప్రబలమైన దైవప్రాతికూల్యపువార్త రాగా, కన్యక తల్లిదండ్రుల కామాట చెవులలో పడినచో, వివాహమునకు విఘ్నము కలుగునని, అట్టి అంతరాయము సంభవించకుండ వరుని పక్షమువారు అతి జాగరూకతతో ప్రవర్తించి ముహూర్తమును సాధించిరట! కన్యక తల్లిదండ్రుల కన్ను గ్రామువచ్చునేకాని, ఆ కర్మసాక్షి సూర్యభగవానుడి కన్నులు మూయ నెవరితరము? మంగళసూత్రధారణమున ఆ వధువు కంఠమునకు పాశము తగిలించి లాగినట్లున్నదికదా? ఆ వరుని దశాయోగము లెంత పటిష్ఠములో!

జాతకుడు మంచి స్ఫురద్రూపి. దర్శనీయమగు ఆకారసౌష్ఠవ మతనిది. మిథునమున శుక్రుని సంపూర్ణదృష్టి లగ్నముపై నున్నదికదా! లగ్నాధిపతి అయిన బృహస్పతి విక్రమ(ప్రాపంచిక విద్య) స్థానప్రభువు శనితో చేరి దశమభావమందుండి, దశమాధిపతియగు బుధునితో అర్ధకోణమిత్రదృష్టి నందుకొన్నాడు. యుక్తిచాతుర్యము, ఉన్నత సాహిత్యవిద్య నిర్గళ వాగ్ధోరణి, అర్జనపటుత్వము, గౌరవాస్పదమగు ఉద్యోగము, కార్యశూరత, కలిగియుండిన ఈ జాతకుడు ఏ కన్యాజనకునికైనా నోటనీరూరించుచుండెడి వన్నచో. అతిశయోక్తి కాదు. కాని, కళత్ర (vii) స్థానాధిపతి బుధుడు మృత్యుభావములో కుజుని సహవాసములో నుండుట, కళత్రకారకుడగు శుక్రుడు కళత్రస్థానమందే యుండి శనివేధకు చిక్కుట, చంద్రుడు ప్రబల పణఫకేంద్ర క్రూరదృష్టిపాలగుట, అనునవి వైవాహిక జీవితవిషయమున మాత్రము అరిష్టసూచకము లనకతీరదు. సప్తమాష్టమాధిపతులగు బుధచంద్రులకు పరివర్తన మున్నది. ఇది దైన్యయోగ మందురు. మూర్ఖపు పుట్టుదల, రోగ (అనవా, శత్రు) బాధ అకార్యాచరణము, మనశ్చాంచల్యము, దీని ఫలమని 'ఫలదీపిక' చెప్పుచున్నది. లగ్నసప్తమాధిపతులగు గురుబుధుల కేమో, చక్కని మిత్రదృష్టి సౌకర్యము కలదు కాని, అష్టమభావమందలి నీచ కుజుడు అతిచారమును సూచించును. భార్యజాతకమునుండి ఈ కుజునికి వేధ వచ్చెనేని, అతి విహారమువలననో, విరుద్ధవిహారముల వలననో భార్యావ్యామోహమే ప్రమాదకారి కావచ్చును కదా?

ఆ వరుని జాతకచక్రము ఈ క్రింద ఉన్నది—

| | | | |
|---|---|---|---|
| శ 8.51(వ) | కే 21-51 | | చ 5-18<br>శు 28-6 |
| | భర్త జాతకము<br>—<br>(సాయనము)<br>— | | య 9-6<br>భార్య 16-14<br>బు 17-4<br>ప్రమాద24-27<br>మృత్యు24-11<br>కు 27-23 |
| | | | ర 6-40.27<br>ఇ 13-14 |
| I 22-16 | | ప్రేమ 8-42<br>రా 21-51 | మన్మథ 9-27<br>గు 18-7<br>[illegible] 21-51<br>X 28-0 |

ఈ దంపతుల జాతకములను పోల్చి చూతము. అన్యోన్యముగా, వీరి రవిచంద్రులకు, కుజశుక్రులకు సహా, చక్కని మిత్రదృష్టి యున్నది. భక్తి, రక్తి, కొదవయుండదు. ఇది రమ్యమైన యోగము. కాని, భార్య శుక్రునికి భర్త శని ఎదురు; భర్త కుజునికి

భార్య శని ఎదురు! అనురక్తులగు దంపతులకు సుఖజీవనమును సూచించు దుష్టయోగమిది. అందులో, భర్త జాతకపు అష్టమ కుజునికి భార్య శనియొక్క సమసప్తక వేధ ప్రమాదకరము. ప్రారంభదశలో రక్తి నిచ్చి, క్రమక్రమముగా విరక్తితో పర్యవసానములు తెలుపు యోగమిది. ఇంత చాలక, భర్త జాతకపు సప్తమాధిపతి బుధునికి, భార్యాసహమమునకు సహా, భార్య జాతకపు వరుణునినుండి కేంద్రశత్రుదృష్టి! నిస్సంశయముగా, ఇది వియోగప్రదము. అన్యోన్యానురాగము, అతిచార ప్రమాదము, ఆకస్మిక వియోగము, ఇవి ఈ గ్రహ సంబంధముల సమష్టి ఫలము.

జాతక వాగ్దానము లిట్లుండగా వివాహపు వయస్సున భర్తకు వచ్చిన దశలను గమనించితిమేని, గుండియ లాగిపోగలవు.

(i) చలిత సప్తమ కేంద్రము (కర్కాటకము $16\frac{1}{4}^{\circ}$) భార్యసహమసంయోగమునకు వచ్చుట.

భార్యాసంపాదనమునకు అనుకూలమగు దశ ఇది.

(ii) చలితరవినుండి (కన్యలో 1°-43′) చలిత సప్తమ భావమునకు అర్ధకేంద్ర వేధ.

భార్యకో, దాంపత్యజీవితమునకో, క్లేశము సూచించు దశ ఇది.

(iii) చలితశుక్రునితో (కన్య 28°-17′) జన్మ శుక్రునికి కేంద్ర వేధ.

అపారమగు కామపరతంత్రత, తీవ్రమగు భావోద్రేకము, సూచితములు.

(iv) చలితకుజునికి (14°-10′ సింహము) ఇంద్రుని (14°-10′ సింహము చలితస్థానము)తో స్పష్ట సంయోగము!

విభేదనాశాన్యములు ఉత్సాహము, అందరాని ఆదర్శములు, కన్నుమిన్నుగానని ప్రవర్తనము, వ్యామోహపరవశత, ఇది దీని ఫలము

“న శ్రుతేన, న విత్తేన, న వృత్తేన, న కర్మణా,
ప్రవృత్తిం శక్యతే రోద్ధుం, మనోభవపథే మనః.”

(క్షేమేంద్రుడు)

అనురీతి, తృతీయ పురుషార్థ సాధనము కొరకు నిరంకుశప్రవర్తనమునకు దారితీయు దశ ఇది. అంతా ఇంద్రునిమాయ. దప్పి పుట్టించి నీరు త్రాగుమని ఎండ మావులను చూపించగల డీ ఇంద్రుడు.

వివాహపు వయస్సులో ఇట్టిదశలు వచ్చుట శోచనీయము.

దశలవలన సంభవించిన ఉద్రిక్తతలలోనై, భార్యాసంపాదనమునకై ఆ తరుణుడు ఆత్రపడుట వింతకాదు. ప్రయత్నపడి మంచి కన్యకనే సంపాదించుకొన్నాడు, ఇచట గమనించదగినది కేవ లొక్కటి. అతని చలిత కుజు డెచ్చట ఇంద్రసంయోగము పొందెనో, (సింహము 14°), అచోటికి సరిగా సమసప్తకములో (కుంభము 14°లో) రవితో చేరిన కుజుడు జాతకములో గల కన్యక అతని ఆకర్షణమునకు పాత్రమైనది. వేరుకన్యక లెందరుండినా, ఆ వరుని ఇంద్రకుజుల కంటబడలేరు. పనిది కూడ. దుష్టదశా కాలములో చేసిన పురుషకారము దుష్ఫలము సంపాదించుటకు పరిపడిన పరిస్థితుల చే అంకురించగలదు. కుజసంయోగములోనున్న ఇంద్రుడు మహామాయావి. మంత్రించి మచ్చుబూడిద చల్లి, కార్యము సాధించినాడు.

భార్య జాతకమందలి ఇంద్రుడు (కన్యారాశి 7°) భర్త జాతకపు వరుణునికి (మీనము 8°) సరిగా ఎదురుకదా! ఆకర్షణము, అపకర్షణము, రెండును ఈ సంబంధములో సిద్ధముగ నున్నవి. భార్య చలితలగ్నము (మకరము $24\frac{3}{4}^{\circ}$) భర్త జాతకములో అష్టమ మృత్యుస్థానమందున్న ప్రమాదసహమమునకు ఎదురుగా పోయినకాల మది. భార్య చలితరవి (మీనము 1°-40′) భర్త చలితరవికి (కన్యారాశి 1°-40′) సమసప్తకమై, భర్తయొక్క చలిత సప్తమభావబిందువునకు (కర్కాటకము $16\frac{1}{4}^{\circ}$) సార్ధకేంద్రవేధలో నుండుట! పోతే, ఆమె జన్మవరుణునితో ఆమె చలిత రవికి అర్ధకేంద్ర వేధ, భర్త చలితరవి సార్ధ కేంద్ర వేధ! వరుణవేధాకాలములో జరిగిన వివాహములు, చేసిన సంబంధములు, నిలుచుట 'స్వప్నవార్త' విడాకులో, వియోగమో, ఫలము. వరుని పెద్దలు విద్యావంతులు. సనాతన సంప్రదాయపు శాస్త్రవేత్తలు. కనుక ఇంద్రావరుణుల వేధను వారు గమనించినవారు కారు. కుజదోషమును విమర్శించి దోషము ఉభయనిష్ఠమని తృప్తిపడినారు. పాపము.

ఈ దంపతుల వివాహమునకు ఏర్పరచి సాధించిన ముహూర్తమును పరిశీలింపుడు.

| | | | |
|---|---|---|---|
| | X 14<br>ద 18-2 | శు 17-40 | కు 0-14<br>రా 1-27<br>శ 21-57<br>చ 22-10 |
| | వివాహ ముహూర్తము<br>—<br>(సాయనము)<br>— | | బు 16-31<br>I 17-0 |
| | | | ర 6.5<br>యమ 11-2 |
| కే 1 27 | గు 19-11 | ఇ 8-2 | |

ఈ ముహూర్తము ఎంత శ్లాఘ్యముగా నున్నదో, చిత్తగింతురు గాక.

(1) శనివారము—రేవతీ నక్షత్రము. ఇది ప్రబలారిష్టయోగము.

(2) క్రూరమయిన విష్టికరణము వ్యాప్తిలో నుండిన కాల మది.

"పరీతా విపరీతా, వా
విష్టిర్నష్టాతు మంగళే."

అను సూత్రము నిరాదరింపబడినది.

(3) కడచిన అమావాస్య రాహుగ్రస్తసూర్యోపరాగము. అట్టి రాహువు ముఖప్రవేశముచే అత్రి ముతో ముహూర్తపు శుక్రుడు అభిలషించుచుండుట!

దాంపత్య సుఖమునకు గ్రహణము పట్టుటే ఇది.

(4) ముహూర్తరవికి వరుణుడు పీడలివ్వ నున్నాడు.

భర్త చలితరవికి భార్య వరుణుని వేధ యుండుటచే, ఇది వియోగసూచకము. ఐశ్వర్యమును నీవే నిర్వహించమని వరుణుని ఆహ్వానించుటే ఇది.

(5) వ్యయభావములో రవి యుండుట— అందులో వరుణసంయోగములో.

ఇది మృత్యుయోగ మందురు.

(6) భర్త జన్మలగ్నమునకు అష్టమ (మృత్యు) స్థానములో లగ్నమున్నది.

ఇది భర్త ఆయుర్దాయమునకు భంగకారి. ఎన్ని సుగుణము లుండినా, అష్టమరాశి వివాహలగ్నముగా నిర్ణయింపకూడ దని ప్రాచీన మహర్షులు చెప్పిరి.

"అష్టమంతు న కర్తవ్యం, యది సర్వగుణాన్వితం." అని దుష్టవివాహకాలములో సంకల్పించిన పురుషకారము ఎట్టి శుభముహూర్తమును సంపాదించుకొన్నదో, చదువరులు గమనించగలరు. నిండు తారుణ్యము తొణకుచున్న వయస్సులో నున్న వారికి ప్రబల దుష్టవేళలు దాపురించినచో, వివేచనాశక్తి శూన్యమగుట సామాన్యఫలము. వివాహమునకై వారు ఉత్కంఠింప దూపుట, వయోధర్మమును బట్టి, క్షంతవ్యమే. కాని, వారికి హితము బోధించి సమాధానపరచి పురుషకారమునుండి విరమించ వలసిన బాధ్యత అనుభవజ్ఞుల పెద్దలది. అపుడు కొ దపుడు కోపాలువచ్చి ఇల్లు కళకళలాడవలెనని ఆశతో వారే పూనుకొనిరని, దైవప్రాతికూల్యపు సూచనల నుపేక్షించిరని, గ్రహములనో, విధినో, మనము నిందించ నేల?

"కామం భగవతీ యేవ, భిద్యతే భవితవ్యతా."
అనుకొనక తీరదు.

భార్యవచ్చిన వెంటనే భర్తకు వర్ధంతి. ఆ వర్ష ప్రవేశకాలపు చక్ర మిదే:-

| | | | |
|---|---|---|---|
| . | I 11-53 | రా 29-0 | మృత్యు<br>11-44<br>కు 20-32<br>శ 24-34 |
| | వర్ష జాతకము<br>—<br>సాయనము | | బు 18-22<br>శు 27-8 |
| చ 10-49<br>X 8-52 | | | ర 6-40-37<br>కే 11-40<br>య 12-45 |
| | గు 18.2<br>కే 29-0 | ఇ 8-28 | |

వర్షలగ్నాధిపతి కుజుడు. జన్మశుక్రుని అంకపాలి చేరుకొన్నాడు.

"జన్మ శుక్ర కర్కశో ణామః,
స్త్రీసుఖోత్సవకృత్ బలీ.)" (వష్టి తంత్రము)

కామోత్సవము ఈ యోగపు ఫలము. అనురూపురాలు, అనురాగవతియు నగు వనువును కోరి, ప్రయాసపడి, తెచ్చుకొన్నవాడా తిరుగును. అట్టి సందర్భములో, ఈ యోగఫలమును తప్పుపట్టజాలము. కాని, వియోగకారి యగు వరుణమహాశయుడు సయితము ఆ జన్మశుక్రుని ప్రక్కనే చేరుకొనుట విషాదకరము. వర్షచక్రములో కుజవరుణులు జన్మశుక్రునికి చేరియొకవైపున నిలిచి పర్యాటలాడుచున్నారనుట. ఇంతేకాదు. వర్షచక్రమందలి శుక్రుని చూడుడు. భార్యాస్థానాధిపత్యము వహించి జన్మకుజుని ఆలింగనములో ఆనందించుచున్నాడు!

"రతి చక్ర ప్రవృత్తిస్య,
నైవ శాస్త్రం, న చక్రమః."

అనురీతి, కన్నుమిన్ను కానరాని కాముక వ్యాపారము చూపు యోగము ఇది. అష్టమస్థానములో నీచకుజుడు, మన్మథ సహాయమునకు వరుణ సమసప్తక దృష్టికల జాతకునికి, అనుకూల దాంపత్యము లభించిన తరుణమందే, ఇట్టి వార్షికయోగములు తోడయ్యెనేని, అతిచారప్రీతి తలయెత్తుకొనుట ఏమి అరుదు?

"పానీయంబులు త్రావుచున్, కు
డుచుచున్, భాషించుచున్, హాసలీ
లా నిద్రాదులు చేయుచున్,
తిరుగుచున్, లక్షించుచున్,"—

నిరంతర నవోఢాధ్యానతత్పరుడై ఇతరమును మరచివాడా తిరుగును.

జన్మకాలములో సప్తభావాధిపతి శుక్రుడు. ఇతనికి శనినుండి కేంద్రవేధ. ఈ శుక్రుడు భార్యాస్థానము (సప్తమ భావము)లోనే యుండుట. భార్యవలన ఆరోగ్యభంగము సూచితమగును కదా? ఇక, వర్షచక్రమందలో, శుక్రునికే భార్యాస్థానపట్టము వచ్చినది. అందులో భార్య జాతకపు శనినుండి సమసప్తక వేధ. ఇట్టి పరిస్థితులలో, జన్మశుక్రుని మీద వర్ష కుజవరుణులు! అతిచారము వలన అనారోగ్యమో, అనారోగ్యస్థితిలో అతిచారమో, సూచితమగుట ఆశ్చర్యముకాదు. ఏమి దుర్విధి! శీలవంతులు, అనురూపులు, తరుణవయస్కులు, అగు అనురక్త నూతనదంపతులకు వివాహము, తరువాత అచిరకాలమందే ఇట్టి క్రూరయోగములు రావలయునా? వారి అన్యోన్యానురాగమే అతిచార కారణమున ముప్పయినది. అమృతముకొరకు క్షీరసాగరమును మథింపగా, మొదట హాలాహలము పుట్టినట్లు! కామదహనము చేయజాలిన పరమేశ్వరుడు ఆ విషాగ్నిని మ్రింగిన తరువాతనే కదా అమృతము లభించుట! అష్టమభావములో దుష్టకుజుడు, సప్తమ భావములో శుక్రుడు గల జాతకునికి నవోఢాసాన్నిధ్యమున మనోనిగ్రహ మెట్లువచ్చును?

ఈ చక్రములో చంద్రుడు (మనస్సు) నిలిచియుండుట ఒకరకముగా భార్య లగ్నబిందువు పైననే. జన్మ సప్తమ (భార్యా) భావాధిపతియగు బుధుని పైనే, వర్షచక్రపు రోగాధిపతి బుధుడు నిలుచుట! జన్మకాలమందలి ప్రేమసహాయము పైననే, వర్షప్రవేశకాలమున మాయదారి ఇంద్రుడుండుట! కళత్రము, వ్యామోహము, అనారోగ్యము, ఈ మూడును కూడ పలుకుకొని వ్యవహారమునకు దిగినట్లు చూపట్టుచున్నది కదా? ఇక, జన్మయమునిమీదనే వార్షిక చతుర్థ (విరామ) స్థానమున్నది. పర్యవసానము యముని అధీనమని అర్థమా? ఎంత ఘోరము!

భర్త అవసానదినము నాటి గ్రహస్థితి ఈ క్రింది కుండలి చూపగలదు :

| | | | |
|---|---|---|---|
| | | రా 25-59 | చ 26-9 |
| వ 7.50 | భర్త మృతిదినము<br>—<br>సాయంకాలము<br>5-30 P. M. కు<br>గ్రహస్థితి<br>—<br>(సాయనము) | | కు 26-43 |
| | | | యమ 14-20<br>శ 18-35 |
| | గు 24-32<br>కే 25-59 | ర 1-34<br>శు 7.29<br>ఇంద్ర 10-18<br>బు 21-25 | |

భార్య జాతకములో అష్టమభావ బిందువు సింహరాశిలో 14° లో నున్నది. ఆ భాగలో భర్త

గారి చలితకుజాదుల చలితేంద్రునకు చేరిన వయస్సులోనే వివాహము జరుగుట! అదే సింహరాశి 14° లో చారములో యుండునపుడే ఈ ఘోర వ్యసన పాతము. ఇది కాకతాళీయ మనగలమా?

ఆ దినమునకు వర్షజాతక కేంద్రములు దైనిక చలనపద్ధతితో ఎంతున్నవో చూతము.

| | | |
|---|---|---|
| వర్షజాతకమునాటి నాక్షత్ర కాల ధ్రువకేకిని, అవసానదినపు నాక్షత్రకాలధ్రువకేకిని కలభేదము | = | 3-40-47 |
| వర్షజాతక కేంద్ర చలన పద్ధతిలో, పై నాక్షత్ర కాలము నకు ధన సంస్కారము | = | + 0-53-23 |
| మొత్తము | = | 4-34-10 |
| వార్షిక దశమ కేంద్రమునకు నాక్షత్రకాలము | = | + 18-38-38 |
| మొత్తము | = | 23-12-48 |

ఈ ఫలమునకు లగ్నపట్టికాగ్రంథములో చలిత కేంద్రస్థితి ఇట్లు వచ్చును.

చలిత వార్షిక దశమము = 17-10 మీనము
చలిత వార్షిక లగ్నము = 25-0 మిథునము

ఈ దశమ కేంద్రము భర్త జాతకమందలి గురువునకు నికరముగా ఎగురు. అనగా, చలిత చతుర్థ (అవసాన) భావబిందువు భర్త లగ్నాధిపతి గురువుపైననే నిలచియున్నదనుట! ఇక, చలిత లగ్నమో, సాక్షాత్తుగా వర్షజాతకపు వరుణునిమీదనే నిలచినది. వియోగకారి వరుణుడు ఆడిన నాటకమునకు భరతవాక్యము కదా ఇది? ఇది కాకతాళీయము కాగలదా?

భార్యకు ఆనాటికి దైనిక జాతకమును సాధించినచో, దైనిక లగ్నము కన్యారాశిలో $6\frac{1}{2}$° లో వచ్చును. అనగా, ఆమె జాతకమందలి ఇంద్రునిపైననే ఆ కేంద్రము నిలచుట! భర్త జాతకపు వరుణునితో సమసప్తక వేధ యీ ఇంద్రునికి కలదనుట మరువరాదు. ఆ కథాఫల మిది అని సూచించుట కదా ఇది? "ఇది నా ప్రభావమే." అని తెలుపుటకొరకే ఆమె దైనిక లగ్నములో ఆనాడు ఇంద్రుడు ప్రత్యక్షమైనాడు. ఇది సహా కాకతాళీయ మనవచ్చునా?

ఇదే దినమునకు భర్తకు దిన జాతకమును సాధించితిమేని, దశమకేంద్రము మకరములో $27\frac{3}{4}$° కు వచ్చును. నికరముగా భార్య జాతకపు శనిస్థానమదే! అనగా, దిన చతుర్థభావము (పాతాళము) జన్మకుజ స్థానమందున్న వార్షిక శుక్రునిపైన, తాత్కాలికకుజుని పైన సహా ప్రవాలి, అతిచారమువలని ఫల మిది యని కరతలామలకముగా చూపుచున్నదనుట.

ఇంతె చాలును.

చెప్పవచ్చిన దేమన, సంధిలించిన దుష్ఫలితమునకు భర్త అష్టమ కుజునితో, భార్య కుటుంబస్థాన కుజునితో సంపూర్ణదృష్టి వంటగట్టు అవిచారకము లేయ మనుట. ఈ కుజస్థితివలన భార్యాభర్తలిరువురు పరస్పరవ్యామోహపరవశులు కావచ్చును; అతి విహారప్రియులు కావచ్చును; కొంతకాలము మరిపెంపు ముచ్చటలలో మునిగి తేలవచ్చును. ఇంతమాత్రమే గొప్ప లోపముగా పరిగణించుట అనవసరము. అన్యోన్యముగా ఈ దంపతులకు ఇంద్రావరుణులకు, ఇంద్రకుజులకు, కుజశనులకు సమసప్తక వేధ వచ్చియుండెనిచో, ఇంతటి దుష్ఫలము రానవసరము లేదు వచ్చియుండెదు కూడ. శనికుజుల సమసప్తకము ఒకటే చాలదా? ఈ నూతనగ్రహము లేల? అందు కేమో? అది యొకటే వాస్తవముగా చాలదు. అది క్లేశకరమే. కాని, శని మందుడుకదా? అతిపడి ఏ కార్యము కాని చేయుట శనిస్వభావము కాదు. అంతా నెమ్మదిగా యథావకాశముగా, జరుగవలసినదే. అంతేకాని, ఇంతత్వరగా, ఇంత తీవ్రముగా, ఇంత ఆకస్మికముగా ఇటి వియోగము వచ్చియుండెదు. ఇంద్రావరుణ యమగ్రహముల జన్మకాలిక స్థితికి, దశలలో, చారములో, వాని ప్రాముఖ్యమును సహా, గమనించు సహృదయులకు ఆ గ్రహములకు ఫలము లేదనుట సాహసమని తోచకమానదు.

ప్రాచీన గ్రహములకు ఫలము లేదని కాదు. నూతన గ్రహములకు సహా కొంత ఫలము కలదనుకొన్నచో మనకు వచ్చిన నష్టమేమో, బోధపడదు. ఫలముకలదని నిదర్శనములు చూపుచున్నవి. మనకు పక్షపాత మేల? సనాతన సంప్రదాయము ప్రీతి యోగ్య మైనదే. కాని, అది కొయ్యబారి పోరాదు. కాలానుసారముగా, ఎన్ని విషయములలోనో, మార్పులను అంగీకరించుచున్నాముకదా? ఈ ఒక్క విద్యయందు మాత్రమే ఇంతపక్షపాతపు పట్టుదల ఏల?

శాస్త్రమునకు నైర్మల్యము వచ్చుటకు నూతనోపాయములు అవసరమని, మహానుభావుడు వరాహమిహిరాచార్యుడు చెప్పిన ఈ క్రింది ఉపదేశమును స్మరింతముగాక.

"యథాషాఢాది సంతాపైః
హేమ్న శ్శుద్ధిర్యతే తరాం
తథైవ నూతనోపాయైః
శాస్త్రం నిర్మలతాం వ్రజేత్."

# కనిపించని ముల్లు

శ్రీ ఆర్. యం. చిదంబరం

అతనిమాటలు తెల్చుకుంటే లలితకళ్ళు జల్లుమంది.

మన సంతా కల్లోలమైంది. స్వచ్ఛంద జీవంలో పుట్టి, కంకరదారివెంట వెళ్ళి, దావాగ్నితో భస్మమవుతూన్న అల్లిబిల్లి అడివిలో ఆ మాటలు ఆగిపోయాయి. ప్రతి మాట శూలంలా గుచ్చుకుంది. వెలుగుండగానే చీకటి కమ్ముకుంది. గబగబా నడుస్తూ రావటంవలన రామం వెనకబడిపోయాడు. తిరిగిచూసింది. అతని చిన్ని కాళ్లను ఇసుక కసిదీర బంధించి వేస్తోంది. అతని పరిస్థితి సైనికబలం లేకుండా శత్రువుల్ని ఎదుర్కొన్నటుంది.

దురుక్కుమంది—

లలిత ఆగిపోయింది. తెల్లటి పాదాలవంక చూసుకుంది. ఏ గాజుపెంకో గుచ్చుకుని వుంటుంది. ప్రతి రోజూ జోళ్ళు వేసుకు నెడి. ఇవేళెందుకో తొడుక్కో లేదు. అయినా తనకెందుకీ సౌందర్యం? సింగారం? ఇతరులకు తెలీకపోయినా, లోకంలో తనకున్న స్థానం తనకు బాగా తెలుసు. రామం పరుగెత్తుకుంటూ వచ్చి ఆమెనందుకున్నాడు.

'అమ్మా!...నా కోసమేనా ఆగిపోయావు?... అరె!...ఏమిటిది? అరికాలిలో రక్తం!'

లలిత అప్పుడే పరీక్షగా చూసుకుంది. తెల్లగా వున్న చర్మాన్ని చీల్చుకుంటూ, రక్తపుజీర తొంగి చూస్తోంది.

రామం అర్థమైనట్టు తల నిలువునా ఆడించాడు.

'అవునమ్మా!...జాగ్రత్తగా చూసి నడవకపోతే అంతే—అలా నడవలేనప్పుడు జోళ్ళైనా వేసుకుని మనను మనం రక్షించుకోవాలి.'

లలిత ఆశ్చర్యంలో అతనివంక చూసింది. రామం మనసు ఇంకా వికసించలేదు. కాని జీవితంలో ఎలా నడుచుకోవాలో రెండే వాక్యాల్లో చెప్పేశాడు! నిజం! తను జాగ్రత్తగా డాలు పట్టుకుని యుద్ధం చేయక, నిరాయుధురాలుగా వుండి ఓడిపోయింది! కొందరు మనుష్యులు అందర్నీ ధిక్కరించి తమ తమ మనస్తత్వాల కనుగుణంగా జీవించగలరు. మరికొందరు ప్రతి చిన్న విషయానికీ భయపడుతూ, అందరికీ వంగి వంగి సలాములు చేస్తూ జీవిస్తారు. ఈ రెండు తరగతుల వ్యక్తుల్లోను 'ఆనందా'న్ని అంది పట్టుకుని అనుభవించేదెవరు? మొదటిరకం మనుష్యులు, పూర్వ కాలపు వీరులవలె, ఆపదలకోసం, విమర్శల కోసం, కళ్లు తెరచుకుని, నిద్రాహారాలు మానుకుని ఎదురు చూస్తూంటారేమో!

'ఛీ!...ఇంక ఆలోచించకూడ'దనుకుంది.

దూరంగా వినపడ్డ అడుగులచప్పుడు చరచరా పాకుతూ దగ్గరగా వచ్చేసింది. కంగారుగా వెనక్కి తిరిగిచూసింది. హమ్మయ్య!...గురుమూర్తే ననుకుంది!...అతను రాకపోతే యేం? అతని చూపులు చంద్రలోకందాకా వెళ్ళగలవు.

'ఏస్ లలితా!...మీరు నన్ను క్షమించాలి. నా అభిప్రాయం మీకు ఏనాడో అర్థమై వుంటుంది. రెండు మూడుసార్లు మొహమాటం లేకుండా స్పష్టంగా చెప్పేశాను కూడా. అయినా మీ కెందుకో నామీద దయ కలగటంలేదు. ఒకసారి మనసు విరిగిందంటే నేనేం చేస్తానో నాకే తెలియదు. స్వాతివానకోసం ముత్యపుచిప్పలా కాసుక్కూచున్నాను. నిజం చెప్పండి-ఇలా నన్ను వేధించకండి!' గురుమూర్తి అంత వుద్రేకంగా ఎన్నడూ మాట్లాడలేదు. అతను సహజంగా ఓడిపోయే వ్యక్తి. అతని మాటల్లో మలీన్యం లేకపోవచ్చు. అయినా గతాగతాలు ఆలోచించే శక్తి అతనికి లేదు. పీకదాకా బురదలో వున్నాడట. కొద్ది రోజుల్లో అట్టకుక్కి వెళ్ళిపోతాడుట-అతన్ని తను పైకి లేవదీయాలట-అంతేకాదు బలవంతంగా ఆమెను కూడా బురదలో కీడుస్తానని భయపెడుతున్నాడు. ఎందరు బురదలోపడి చావటంలేదు? అలాగే అతనూ చస్తాడు. అంతేగా!

రామం కేడీలా చిలిపి చూపులు చూస్తూ లలితకు ఇంకొంచెం దగ్గరగా జరిగాడు.

'పాపం! నాక్కలిగిన ఆశాభంగంలో వళ్ళు మరచి రామాన్ని కొట్టాను. ఏమీ అనుకోవద్దు. ఇలాంటి మనస్పర్థలు వాటంతటవే సర్దుకుంటాయి. ఆటంకాల్ని తొలగించుకోవాలి.'

'ఇంతకూ అతనేం తప్పుచేశాడు?...చూడండి! మూర్తిగారూ! మీ తత్వం నాకు బాగా అర్థమైంది. చిన్నపిల్లల్ని ఎలాంటి పద్ధతుల్లో చదివించాలన్నది ట్రైనింగ్ చదివిన మీకు తెలియనిది కాదు. మీరతని మనస్సులో విషపు మొక్కల్ని నాటుతున్నారు. అగ్నిజ్వాలలు సృష్టిస్తున్నారు. దయచేసి మీ కర్తవ్యాన్ని మరవకండి-అదే నేను కోరేది. మీ మాటలు విని విని విసుగెత్తిపోయాను.'

మంచుగడ్డ ఒక్కసారిగా విస్ఫుటమైంది.

'అంతేకాదు-నా చుట్టూ కొండలు, గోడలు, అడవులు-ఎటూ వెళ్లలేను. మృత్యు పాముల బుసలు-నా కాలిధూళితీసి పౌడరుగా రాసుకున్నా మీ కోరిక యీడేరదు. నేను రత్నంగార్నే కోరుకున్నాను.' అంటూ చకచకా వచ్చేసింది.

మనుష్యులు ఉద్రేకంతో మాట్లాడేటప్పుడు, సవాళ్ళుపసవాళ్ళు కాని, సందర్భాసందర్భాలు గమనించలేరు. తుఫాను తరువాత సముద్రం శాంతించినట్టు ఆ ఉద్రేకం తగ్గాక, 'అరెరె! ఎందుకిలా మాట్లాడాం' అన్న పశ్చాత్తాపం కలుగుతుంది. లలిత నాలిక్కరచుకుంది. అతని మొహంమీద పెద్దపెద్ద రాళ్లు విసిరింది. రత్నంగారి ప్రస్తావన తీసుకురావటం పెద్ద పొరపాటు. అది తన భావిజీవితాన్ని కూల్చివేస్తుంది. గురుమూర్తి విషసర్పంలాంటివాడు. తన విషం ఎంత దారుణమైందో కొద్దిగా రుచి చూపించాడు. ఇంక కాటు వేస్తాడు.

లలిత నిట్టూర్చింది. ఇంత రభస జరిగాక గురుమూర్తి పరుగెత్తుకు వస్తాడనుకోటం వెర్రితనం-ఇద్దరూ వడిరోడ్డు మీద కొచ్చారు. 'అమ్మా!...మేష్టారిదగ్గర అంత కోపంగా మాట్లాడావు కదా! రేపు మళ్ళీ వీపు విమానం మోతెత్తుతుందేమో!' అన్నాడు వీపు తడుముకుంటూ.

లలిత గులాబీమొగ్గ విచ్చినట్టు నవ్వింది—

'భయపడకు—ప్రపంచాన్ని చిటికెన వేలుమీద ఆడించగలను' అంది ఏదో ఆలోచిస్తూ.

అప్పటికే చీకటి వ్యాపించింది. చల్లగాలి కోసం వచ్చిన జంటలు తిరిగిపోతున్నాయి. రామం నడక వేగం హెచ్చింపబోయేసరికి లలిత అతని భుజాలుపట్టుకుని ఆపివేసింది.

'నెమ్మదిగా నడు. అక్కడ మనకోసం ఎవరూ కాసుకుని వుండరు.' ఇల్లు చేరుకుంటే మాత్రం ఏం సుఖంవుంది? బయటే కాస్తనయం.

ఈ పద్మవ్యూహంలో తను ఒక్కసారి చిక్కుకోలేదు. అభిమన్యుడికి మల్లే ఎదిరించిన వారి నందర్నీ హతమారుస్తూ ప్రవేశించలేదు అందర్నీ బతిమాలుకుంటూ లోపలకు వచ్చేసింది. అలా బతిమాలుకుని బయటకు వెళ్లటం సాధ్యం కాదు. కనికరం చూపినవారంతా కళ్ళెర్రజేసి 'ఇందుకేనా నిన్ను లోపలకు రానిస్త? మేమంత నిస్వార్థ పరులం కాము' అంటారు.

ఏడాది క్రితం లలిత ట్రెయినింగు పాసయింది. ప్రపంచం చేతులుచాచి ఆహ్వానించింది. పదిగంటలకు ఇంటర్వ్యూ. తొమ్మిదిన్నరకే వచ్చి కూర్చుంది. గురుమూర్తి ఆమెకేసి చూస్తూనే లోపలకు వెళ్లాడు. మొదటిసారిగా అది అతన్ని చూడటం—అమాయకత్వం పూసుకున్న ముఖం. కనపడని వస్తువుకోసం వెదుకుతూన్న కళ్ళు సహజంగా జనించే సంకోచంతో కళ్ళు సంకోచించి అందంగా తయారయ్యాయి. గురుమూర్తి బయటకు వచ్చాడు.

చేతిలో వున్న పుస్తకంలో పేజీలు తిరగవేస్తున్నట్టు, ఏదో చదువుతూన్నట్టు నటిస్తూ ఆమెకేసి దొంగచూపులు చూడసాగాడు. అతనెవరో ఆమెకు తెలియదు.

'నమస్కారం మేష్టారూ!' అంటూ ఒకరిద్దరు కుర్రాళ్ళు అనటంతో అతని స్థానం ఆమె కర్థమైంది.

'మీరు — మీరేనా ఇంటర్వ్యూకి వస్త?' అనడిగాడు.

'అవును...హెడ్మాష్టారు ఎప్పుడు వస్తారు?' అనడిగింది.

'వచ్చే వేళైంది.'

గురుమూర్తి గడియారం వంక చూశాడు. ఇంకా పదికి పదినిమిషా లుంది. ఉపాధ్యాయుల జీవితంలో

వుండే సాంఘిక బాధకాల్ని గురించి, వాటిని ధైర్యంగా ఎదుర్కోవలసిన విధానాల్ని గురించి ఆమె అడక్కుండానే ఉపన్యాసం మొదలుపెట్టాడు. లలిత గౌరవ శ్రద్ధలతో వింది.

ఆమె ఆ స్కూల్లో ఉపాధ్యాయినిగా నియమింపబడింది. ఆర్డరు పుచ్చుకున్నాక తెలుసుకుంది హెడ్మాస్టారి పేరు వెంకటరత్నమని. గురుమూర్తి ఏ క్లాసు ఎక్కడ వున్నదీ ఆమెకు చూపించాడు.

'చూడండి, మిస్ లలితా! మీ కే సందేహం వచ్చినా నన్నడగండి. ఈ కుర్ర నాగమ్మలంతా వానర సంతతి కనక, మీరు జాగ్రత్తగా వుండాలి. మీరు క్లాసులో ఎప్పుడూ నవ్వకండి. పాఠాలు బోధించటం తప్పించి ఒక్క అక్షరం కూడా ఎక్కువ మాట్లాడకండి — ముందు నెలరోజులదాకా జాగ్రత్తగా వుండండి. తరువాత అందరూ మీ చెప్పుచేతల్లో వుంటారు.

లలిత అతన్ని కృతజ్ఞతతో చూసింది. కొత్తగా వచ్చినవారికి ఈ రకం సలహా లిచ్చేవారు చాలా తక్కువ-

'అన్నట్టు అడగటం మర్చిపోయాను. మీ రెక్కడుంటున్నారు?'

లలిత వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. ఇంక అనేకమైన ప్రశ్నలామెను ఎదుర్కొంటాయి. మీ స్వస్థలం ఏ వూరు? ఎక్కడ చదువుకున్నారు? తల్లీ-తండ్రీ-వున్నారా? వివాహం అయిందా? వయస్సెంత? ఏమైనా పిల్లలా?...అలా ప్రవాహంలో నీటిచుక్కల్లా దొర్లిపోతాయి. వీటన్నిటికీ సమాధానం చెప్పటమంటే రెండు రంగాలమధ్య దించివేసిన నల్లటి తెరను ఎత్తేసి ఏముందో చూపటంలాంటిది. ఒక ఘనపు టంగుళపు చీకటిలో ఎన్ని అణువులున్నాయని లెక్కపెట్టటం లాంటిది.

'ప్రస్తుతం హోటల్లో ఓ గది తీసుకున్నానండి. ఇక్కడ నా అన్నవాళ్ళెవరూ లేరు. ఉద్యోగం స్థిరపడింది కనక ఇంక గది కోసం వెదకాలి.'

గురుమూర్తి అర్థమైనట్టు తల నిలువునా ఆడించాడు. లలిత అద్దె గదికోసం వెదికితే మాత్రం దొరక వద్దూ? ఆమెకు పెళ్ళికాలేదు. తల్లిదండ్రులు లేరు. మొహంచూస్తే దైవభక్తి వున్నదానిలా కనపడదు. విశేషం అక్కడేవుంది. మగవాడు ఒంటరిగా వుండగలడట- ఆడదానికి తోడువుండాలట. 'మీ రేం భయపడకండి- నా ఎరికలో ఓ యిల్లు ఖాళీగా వుంది. అద్దె ఇరవై రూపాయలైనా ఫరవా లేదు. రండి. చూపిస్తాను. కొంచెం వూరికి దూరంగా వుంటుంది. సగం రోజు సెలవు తీసుకుని వస్తాను' అంటూ ఆమె సమాధానంకోసం నిరీక్షించకుండా సెలవు అడగటానికి వెళ్లాడు.

నాలుగు రోజులు గడిచాక ఓ ఆదివారం నాడు గురుమూర్తి లలిత ఇంటికి వచ్చాడు. ఈ నాలుగు రోజుల్లో అతని ముఖంలో చాలామంది సూర్యులు ఉదయించారు. ముందుగా అతను చూసింది అరుగుమీద కూర్చుని పుస్తకం చదువుతూన్న రామాన్ని. లలితకూ, అతనికీ వున్న సంబంధం ఎలాంటిదో అతనికి తెలీదు.

నమస్కారాలు ఇచ్చిపుచ్చుకోటం అయింది.

'ఆ అబ్బాయి ఎవరండీ?' అడిగాడు.

లలిత వెంటనే సమాధానం చెప్పక అతనివంక చూసింది. ఆకాశం గర్జించగానే పిడుగు పడుతుందన్న భయంతో అతను కంగారుపడ్డాడు. కొంపతీసి రామం లలిత కొడుకేమోనని- 'మా తమ్ముడు' అనటం, రామం లోపలకు పరుగెత్తుకు రావటం ఒక్కసారే జరిగాయి.

'అమ్మ!...బుర్ర బద్దలుకొట్టుకున్నా, నాకీ పాఠం అర్థంకావటంలేదు' అన్నాడు.

గురుమూర్తి కళ్లల్లో వేలకువేలు ఆశ్చర్యార్థకాలు ఉదయించాయి.

'గాభరాపడకండి! మా అమ్మ-నాన్న చిన్నతనంలోనే పోయారు. మావయ్య మమ్మల్ని పెంచి పెద్దవాళ్ళను చేశాడు. అప్పటికి రామం చిన్నపిల్లాడు. అందుకని నన్నే అమ్మని పిలిచేవాడు. పెద్దయ్యాక కూడా ఆ అలవాటు పోలేదు. ఇందులో వచ్చిన ప్రమాదమేమీ లేదని నేనూ వూరుకున్నాను. అతన్నిప్పుడు ఫస్టుఫారంలో చేర్పించాలి. స్టాండర్డ్ చాలా తక్కువ. ఎలా చెప్పండి?'

'మీరు రొంతమాత్రం బాధపడనక్కర్లేదు. అంతా నేను చూసుకుంటాను. నేను తల్చుకుంటే ఈ పాటికి మెట్రిక్‌లో చేర్పించి ఉందును.'

అలా ప్రారంభమైన పరిచయం ప్రమాదములో చిక్కుకోక తప్పదు. సంఘం అనుమతి లేకుండా ఎవరూ ఏ పనీ చెయ్యలేరు. అది విమర్శిస్తుంది కాని

బుజువు చూపించదు. ఎవరయినా ధైర్యంచేసి రుజువు చెయ్యమంటే వికటంగా నవ్వేరూ 'కళ్ళ కెదురుగా కనిపించే దానికి రుజువెందుకయ్యా? ఏ పనీ లేకుండా అతను ఆ అమ్మాయి యింటికి తిరుగు వెళుతున్నా డంటావా?' అంటుంది. లలిత వుంటే వాతా వరణం అలాంటిది. ఆమె చుట్టూవున్న వ్యక్తులు నీతినియమాలతో నిష్ఠగా బతికేవారు. ఒకామె భర్తను దైవంకంటె ఎక్కువగా పూజిస్తుంది. మరొకావిడ పరపురుషుణ్ణి గురించి కలలోనైనా తలపెట్టదు. మరొ కావిడ వుదయం నాలుగంటలకే లేచి స్నానంచేసి, శుచిగాపూజచేసి, భర్తభోజనంచేసేదాకా మంచి నీళ్ళైనా ముట్టదు. అమ్మో! వాళ్ళంతా అగ్గిలాంటి మనుష్యులు—వాళ్ళకూ, భగవంతుడికీ మధ్య ఓ పల్చటి తెరమాత్రం అడ్డం—అంతే. లలితలో ఇలాంటి లక్షణా లేవీ లేవు. పూజిద్దామంటే, పాపం, ఆమెకు భర్తే లేడు.

లలిత ఓనాడు కూర్చుని తనివితీర ఏడ్చింది. గురు మూర్తి తరచు వొస్తూండేవాడు. అతనికి లోకవ్యవహా రాలు బాగా తెలుసు. ఎన్నో కొత్త విషయాలు చెప్పే వాడు. ఎన్నో వుత్తమ గ్రంథాల్ని ఆమె చేత చది వించాడు. సముద్రంలో మునిగిపోటానికి సిద్ధంగా వున్న ఆమెను ఒడ్డుకు చేర్చాడు. అంతటితో ఆగితే బాగుండును. గాలివీచినకొద్దీ కిటికీ లావిక్కుతూన్న తెలూను ఒక్కసారిగా తెలిపోయినట్లు అతని హృదయం ద్వారాన్ని వెలిగిక్కింది. అతను లలితను ప్రేమిస్తున్నాడట—అంటే పెళ్ళిచేసుకుంటానన్నే అభి ప్రాయమై వుండాలి.

అది పవిత్రమైన బంధం కాదు. అదో జాడ్యం లాంటిది. నరబలి కోరుతున్న పిశాచం లాంటిది. దాని జీవితం మూడు యుగాలు కావచ్చు లేక మూడు క్షణాలు కావచ్చు. నీతి నియమాలతో సంబంధంలేదు. నిరాకరిస్తే పగతీర్చుకుంటుం. అయినా తను పెళ్లి చేసుకుంటే తప్పేముంది? పెళ్లి!...అమ్మో! ఆ మాటల్లో అక్షరాలు రెండూ రెండు శూలాలుగా మారి హృదయాన్ని లోతులు పరిశీలిస్తాయి. అది అమంగళ కరంగా ధ్వనించింది......గురుమూర్తి చరిత్రకూడా సామాన్యమైనది కాదు. అతనికి అయిదేళ్ళక్రితం వివాహమైంది ప్రతి రోజూ ఇల్లాలితో జగడం—క్షణం మనస్థిమితం వుండేదికాదట—దీని కంతకూ మూలకారణంమాత్రం ఎవరికీ తెలియదు. ఏడాదిలో ఇద్దరికీ తెగతెంపు లయ్యాయి. గురుమూర్తి తనకు పెళ్ళైందన్న సంగతి మర్చిపోయి మొదటి పెళ్ళాం బతికుండగానే మారెక్క టులో ధైర్యంగా బేరానికి బయలుదేరాడు.

'అమ్మా! వర్షం వచ్చేట్టుగావుందే!.. చలిగాలి వీస్తోంది. త్వరగా నడుద్దాంపదవే! నాకు భయంగా వుందికూడా. మరో పావుగంటలో రోడ్డుమీద జనం వుండరు...అమ్మా! అదుగో! జానకి మనల్నిచూసి నట్టు మొహం తిప్పేసుకుని వెళ్ళిపోతోంది. ఇదివరలో ఎంతయిదిగా మాట్లాడేది! మొన్న ఒళ్లోదాంతో ఏదో మాట్లాడబోతే 'శకమండు వాళ్ళతో మాట్లాడకు' అంటూ కసిరి కొట్టింది. అదేమిటమ్మా? దానికేమైనా పిచ్చెత్తిందా? దెయ్యం పట్టిందా?...దెయ్యాలంటే నాకు మహాచెడ్డ భయం. చీకట్లో ఆ చెట్టు దగ్గర దెయ్యా లుంటాయికదూ?'

రామం చెప్పుకుంటూ పోతున్నాడు. లలిత పరధ్యానంగా వూకొడుతూ మెల్లిగా అడుగులు వేస్తోంది. కంటికి కనపడని దెయ్యాలకోసం ఎక్కడో దాగివున్నాయని వెదుక్కుంటూ వెళ్ళటం ఎంత తెలివితక్కువ! ఈ మనుష్యుల్లో నూటికి తొంభైమంది దెయ్యాలతో సమానం—మంచితనం ప్రవేశించటానికి వీలులేకుండా హృదయాలమీద కాంక్రీటు పూత వుంటుందిగామోలు! సుబ్బారావు దెయ్యం కాక మనిషా యేమిటి?

జానకి ఫిఫ్తుఫారం చదువుతోంది. శ్రావ్యమైనకంఠం. ఎవరో సంగీతం నేర్పేవారు ఆమెకు కీర్తనలవరకూ నేర్పి మనస్పర్థల కారణంగా మానుకున్నాడు. సరిగా అదే సమయానికి లలితకూడా వచ్చింది. రెండు సంవత్స రాలపాటు శాస్త్రీయ సంగీతం నేర్చుకుంది. ఆమె నేర్చుకున్నదానికంటె పాకం ఎక్కువ. అందుకే ఆమెపాటలో ప్రతిఅణువూ తేనె చిందుతుంది. ఈ సంగతి మొదట్లో కనుక్కున్నది గురుమూర్తి. అతనే జానకికి ఆమె దగ్గర ప్రైవేటు ఏర్పాటుచేశాడు. సాయంత్రంపూట వచ్చి సంగీతం చెప్పించుకునేది.

సుబ్బారావు జానకి అన్నయ్య—అతను స్థితి మంతుడు. ఇంటర్మీడియట్ పరీక్షకు మూడుసార్లు వెళ్ళి, తన కాపంథా సరైంది కాదని విసుగెత్తి ఇంట్లో కూర్చుని తాత ముత్తాతలు గడించిన ఆస్తిని కరగబెట్ట

టానికి మార్గాలు వెతకసాగాడు. ఒక్కగా నొక్క కొడుకు కావటంమూలాన తల్లి మందలించలేదు. ఓ నాడతను లలిత ఇంటికి వచ్చి ఆమె కళను ప్రశంసించాడు. జానకి ఎదిగిన పిల్లకనక, సంగీత శిక్షణ పూర్తయ్యాక రాత్రి ఏడుగంటలకు ఇంటికి తిరిగి రావటం అంత మంచిది కాదని, కనుక లలిత జానకి ఇంటికే స్కూలు విడిచిపెట్టగానే రావటం న్యాయమని ఒప్పించాడు.

నెలరోజులవరకూ అలాగే జరిగింది.

చంద్రలోకయాత్ర — కైలాసారోహణం — ఇవి కావు ప్రపంచంలో ఘనకార్యాలు. ఎదుటివారి మనసును చదవగలగటం—సుబ్బారావును అర్థంచేసుకొనే పరిస్థితులు ఆనాడు ఏర్పడ్డాయి. లలిత వచ్చేసరికి ఆరుదాటింది: చీకటి తొంగిచూస్తూవుంది. త్రిపుర సుందరిగుళ్లో హరికథాకాలక్షేపం వుండటంవలన ఇంటో సుబ్బారావు తప్పించి ఎవరూ లేరు.

'జానకి ఇంట్లో వుందా?' అనడిగింది లలిత.

'వుంది— లోపలకు వెళ్ళండి.'

లోపల జానకి మాత్రం లేదు. అర్థంకాని విస్మయం చుట్టివేసింది. వెనక ఎవరో తలుపు వేసిన చప్పుడు. ఆ గదిలో సుబ్బారావూ, ఆమె తప్పించి ఎవరూ లేరు. సుబ్బారావూ ఆమె ఏమీ అడక్కుండానే మొదలు పెట్టాడు.

'చూడండి!... నేను మృగాన్ని కాను. మనిషి నే—కాని ఒక్కొక్కప్పుడు మనిషి మృగంగామారతాడు. నేను మిమ్మల్నేమీ చెయ్యను. భయపడకండి. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను పెళ్ళిచేసుకుంటానని మాటివ్వండి ముందు. ఇది సరైన అవకాశం. ఇంట్లో ఎవరూ లేరు...నమ్మించి మోసంచేశారంటే మాత్రం పగతీర్చుకుంటాను. నేను త్రాచుపామనుకోండి.'

లలిత కంగారుపడలేదు. నిత్యజీవితంలో ఆమె ఇలాంటి సంఘటనలు ఎన్నో చెప్పుకోగా వింది. ఇప్పుడు కళ్ళారా చూస్తోంది. ఈ రకం వ్యక్తులు సమాజంలో లేరనే ఆమె నమ్మింది.

'చూడండి సుబ్బారావుగారూ!...మీరు కొద్దో గొప్పో చదువుకున్నవారు. ప్రతివిషయం మనం జాగ్రత్తగా ఆలోచించాలి. తొందరపడకూడదు. కనక నాకు గడువివ్వండి.'

ఆ మాటలు సుబ్బారావు మీద ఎలాంటి పరివర్తన తీసుకువస్తాయో పరిశీలించే అవకాశం ఆమెకు కలగకుండానే ఎవరో తలుపుతట్టారు. గుళ్లో హరికథాకాలక్షేపం లేనందున తల్లీ, కూతురూ తిరిగి వచ్చేశారు.

ఆమర్నాటినుండి ఆయింటికి వెళ్లడంమానుకుంది. సుబ్బారావుకు తిరితిరగడం తప్పించి మరోపని లేదు. చేతికందిన ప్రతిపుస్తకం చదువుతూంటాడు. అందులో చిత్రమైనదృశ్యాలు సంఘటనలు వర్ణింపబడివుంటాయి. వాటిని నిత్యజీవితంలో ప్రయోగిద్దామని చూస్తున్నాడు. సుబ్బారావుకు అంతటి అవకాశం, తెలివితేటలు లేవు. తనకు జరిగిన ఈ అవమానానికి శాస్తి చేయాలనుకుంది. కాని ఎలా?

అయిదారురోజులు గడిచాక సుబ్బారావు తల్లి లలితను నడిరోడ్డుమీద నిలిపి కేకేసింది.

'చూడమ్మా! నువ్వు అందాలరాశివి. అందులో సందేహం లేదు. కాని దయుంచి మావాడి జోలికి పోకు. వాడు నిన్నే చేసుకోవాలని ఒకటే పట్టుదలగా వున్నాడు. ఒక్కగా నొక్క కొడుకు. వాణ్ణో యింటివాణ్ణి చేసి మురిసిపోదామనుకుంటే నువ్వు పానకంలో పుడకలా అడ్డుపడుతున్నావు!' అంటూ నిష్ఠూరాలాడింది లలిత ఏమీ అనలేకపోయింది. ఆమె గాలిలో నిరాధారంగా వేలాడుతూవుంది. ఏమైనా అంటే ఆమె గట్టిగా అరుస్తుంది. నలుగురూ పోగవుతారు. తలవంచుకుని కదిలిపోయింది.

అమ్మ యిలా మతిసుళ్ళుగా నడవటం రామానికి మహా చెడ్డ చికాకుగావుంది ఇంక పదినిమిషాల్లో ఇల్లు చేరుకుంటారు. ఉన్నటుండి గాలి వేగం హెచ్చింది. ఏ మాత్రం అశ్రద్ధగా వున్నా ఎగిరిపోతారు. చీకట్లో ఏమీ కనిపించటంలేదు. ఏదో మరమ్మతు వుండటంవలన దీపాలు వెలగలేదు. ఎవరో వెనకనుండి పరుగెత్తుకు వస్తున్నారు. దూరంగా బయలుదేరిన సముద్రపు అలల ధ్వని క్రమంగా ఎక్కువై ఒక్కను ధీర్ఘోగానే అల పోయినట్టు అడుగుల చప్పుడు ఆమెదగ్గరకు వచ్చి ఆగిపోయింది. ఇంకెవరు? సుబ్బారావే అయివుంటాడు. ఆతనికి చివరికి పిచ్చెత్తుతుంది. దాని కొక మెట్టుక్రింద వున్నాడింతే-ఆచీకట్లో అతనిముఖం గుర్తుపట్టటానికి లలిత విఫలప్రయత్నం చేసింది.

'చూడండమ్మాయిగారూ!' అన్నదా మొరటు గొంతు.

కాదు. అతను లేవనుకున్న వ్యక్తి కాదు.

'మీరు చాలా పిరికివాళ్లే — మూడురోజులుగా ఇంటిల్లిపాదీ పస్తు—హనుమంతుడితోకలా పెరుగుతున్న సంసారం...మీతో నా బాధలు చెప్పుకుని ఏడవాలనే వుంది కాని తీరిక లేదు. దయచేసి మర్యాదగా మెళ్ళో వున్న ఆ గొలుసు ఇలా యిస్తారా? వృథాగా అరవటం కాని, పరుగెత్తటం కాని చేశారంటే, ఇదుగో, దీనికి పని చెప్పవలసి వస్తుంది.' అంటూ ఏదో చూపించాడు. అది చీకట్లో తళతళ మని మెరిసింది.

లలితకు ఏమీ తోచలేదు. రామం గజగజ వణికి పోతున్నాడు.

'కాని ఇది బంగారు గొలుసు కాదు. ఇమిటేషన్' అంది భయంతో—'కట్టి పెట్టు నీ కబుర్లు—' అంటూ గొలుసు పుటుక్కున తెంపి తీసుకుని పారిపోయాడు. అతను ఏ దిశగా పరుగెత్తాడో ఆమెకు తెలియదు. అడుగుల చప్పుడు మాత్రం కేవలమై నిశీథిలో కలిసిపోయింది.

'అమ్మా...పిల్చిపోయావూ? నా కేగనక తెగువంతీ బలంవుంటే వాడిపని పిసికేద్దును' అన్నాడు రామం

లలితకు నవ్వురాక తప్పింది కాదు.

'నన్నడిగితే ఈ దొంగ కృష్ణమూర్తికంటె — సుబ్బారావుకంటె—నయమంటాను.'

రామం 'ఎలా?' అని ప్రశ్నించాడు కాని సమాధానంకోసం వుత్సాహం చూపలేదు. కాని లలిత మాత్రం తన మాటలు సమర్థించుకోటానికి కారణాలు కల్పించుకుంది. ఆ ఇద్దరు మనుష్యులు తమ వాంఛలు తీర్చుకుందామనుకున్నారు. కాని దొంగ కనక్కర్లేదు. అతనికి కావలసింది డబ్బు. ఆ చీకటిలో తన్ని తను ఏం చేసినా అడిగేవారు లేరు. అది ఇమిటేషన్ అని చెప్పినా అతను నమ్మలేదు. ఏడాదిక్రితం తను పదిహేనురూపాయలకు కొంది. నిజం తెలుసుకున్నాక అది తన మొహాన గిరవాటు పెట్టి 'అందరికళ్ళు కప్పి మోసంచేశావు. నన్నూ మోసగిస్తున్నావా?' అనరు కదేమో! తన పిచ్చిపూహలకు నవ్వుకుంది.

ఇలు చేరుకున్నారు. తలుపుతీసి అడుగుపెట్టగానే పువ్వులపొట్లం కాళ్ళకు తగిలింది. పెద్దగా గాలివీస్తూండటంవలన ఇరుగుపొరుగువాళ్ళు తలుపులు వేసుకుని లోపలే వున్నారు. దీపం వెలిగించి పువ్వులపొట్లం తీసింది. ప్రతి శుక్రవారం దైవాలంకరణకోసం పువ్వులమ్మేవాడు పొట్లంపసవేసి పోతూంటాడు. రామం అన్నంతినేసి నిద్రకుపక్రమించేసరికి ఎనిమిదైంది

నిద్ర రావటంలేదు. అసలు ఏనాడైనా వేళకు వచ్చేడిసింది కనకనా - నిలువుటద్దంముందు నిలబడింది. జుట్టు చెదిరిపోయింది. బట్టలు నలిగిపోయాయి. కొద్దిగా వికారంగానే కనపడింది మొహం. నుదుటిమీద తిలకం వుండే చోటు శూన్యంగా వుంది. లలిత రెండు నిమిషాలపాటు ఏదో దీర్ఘంగా ఆలోచించింది. గబగబా వెళ్లి కిటికీ తలుపు లన్నీ బిగించింది.

ట్రంకుపెట్టె తెరిచింది దీపపువెలుగులో బట్టలు తళతళమన్నాయి గులాబీరంగు క్రేప్ చీర బయటకు తీసి కట్టుకుంది. తెల్లటి సిల్కు జాకెట్టు తొడుక్కుంది. బంగారంతో చేయబడి నిద్రపోతున్న నెక్లెసు మెడ నలంకరించింది. రెండుజడలు వేసుకుంది నుదుటిమీద అర్ధచంద్రాకారంగా తిలకం దిద్దింది. ఎందుకో వేళ్లు వణికాయి. రెండుమూడుసార్లు ప్రయత్నించాక కాని అది సరిగా అమరలేదు. ఆ బొట్టును చూస్తూంటే శరీరములో ప్రతి అణువూ వణికిపోయింది. కనురెప్పలు రెండుసార్లు కదుపుకున్నాక కాని, కాటుక పెట్టుకోవాలన్న ఆలోచన కలగలేదు. బల్లమీదున్న మల్లెపూల సువాసన గదంతా గస్తీ తిరుగుతోంది. ఆరోజు దేవుడు పుణ్యం చేసుకోలేదు పూలవంత తల్లో అమరింది. మళ్లీ నిలువుటద్దం ముందు నిలబడింది.

ఆహా!

కళ్లు మోసగిస్తున్నాయి. తనలో ఇంతటి సౌందర్యం అంతర్లీనమై వుందని ఆమెకు తెలియదు. కళ్ళు రెండూ నీటితో నిండిపోయాయి. ఎందుకు? కాటుక మూలంగానా?... కాదు...మరి? ఏమో! ఆ కళ్ల వెనక ఎలాంటి లోయలు దాగివున్నాయో! తలుపు బిగించకుండా ఎవరూ ఈ విపరీత దర్శనం చూడటం లేదు కదా! నెమ్మదిగా మంచంమీద వాలింది—ఒక్క రోజైనా తనిలా వుండకూడదా?

రెండు నిమిషాలు గడిచాయి. ఎవరో తలుపు తట్టారు.

ఈ వేళప్పుడెవరు వచ్చారు? అంతా తనభ్రమ.

మళ్ళీ అదే చప్పుడు—

ఎలాగ...ఇరుగుపొరుగు వారెవరైనా వస్తే తనగతి ఏమవుతుంది.? ఆలోచించి ఏదో నిర్ణయానికి వచ్చే

వరకూ కాలం ఆగదు. నెమ్మదిగా తలుపు తీసింది. లోపలకు వచ్చిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది. వెంకటరత్నంగారు! లలిత సిగ్గుపడిపోయింది. ఆకాశం ఎక్కడో దూరంగా గర్జించింది.

అందర్నీ స్మృతిపథంలోకి రప్పించిన లలిత ఎందుకో రత్నంగార్ని మర్చిపోయింది. వయసు ముప్పైకిమించకపోయినా, ఆయనకేసి చూస్తుంటే ఆ అభిప్రాయం కలుగదు.

'ఇంతరాత్రి ఇలా వచ్చారేమిటి?' అనడిగింది లలిత.

'మర్చిపోయారుగాబోలు!...పొద్దున్న మీ జీతం లోంచి కొంత పైకం ఎడ్వాన్సుగా కావాలన్నారు. సాయంత్రం కబురంపితే మీరు వెళ్ళిపోయారని తెలిసింది. అసలు మనవాళ్ళల్లో ఎవరికీ అడ్వాన్సుయిచ్చే అలవాటులేదు. అందుకు మేనేజిమెంటు సమ్మతించదు. మీరు యిబ్బంది పడతారేమోనని నేనే తీసుకు వచ్చాను. తీసుకోండి! అంటూ అయిదు పదిరూపాయల కాగితాలు అందించారు. లలిత కొంతసేపు ఆలోచించి తీసుకుంది.

'వచ్చే ఆదివారం రామానికి పుట్టినరోజు. అందుకేమైనా బట్టలు కుట్టిద్దామని!

'చంపేశారు! మీ పుట్టినరోజేమోననుకున్నాను.' అంటూ ఆమెకేసి పరీక్షగా చూశారు. లలితమటుకు సిగ్గుతో పాతాళానికి చొచ్చుకుపోయింది.

'అది సరేకాని వర్షంవచ్చే సూచన లుండగా ఈ రాత్రివేళ ఎందుకు బయలుదేరారు? తిరిగి వెళ్ళట మంటే ఈ వర్షంలో మహాయాతన మీ యిల్లు సరిగ్గా మైలుదూరం వుంటుంది.'

'మరేం ఫరవాలేదు.' అంటూ నవ్వేశారు.

తరువాత రత్నంగారు ఏవో స్కూలు విషయాలు, మధ్య మధ్య తన స్వంతవిషయాలు చెప్పుకుంటూ పోయారు. ఆయన భార్య చనిపోయి దాదాపు ఆరు సంవత్సరాలు కావస్తోంది. ఆయనే వండుకు తింటున్నాడు. అవూళ్ళోనే కొంత పొలంవుంది. రత్నంగారి హృదయం సముద్రమంత విశాలమైనదని వినికిడి. కాని లలిత విషయంలో ఆయన సింహ స్వప్నంగానే వున్నాడు. మూడు నాలుగుసార్లు లలిత టీచింగు తృప్తికరంగా లేదని రిమార్కులు వ్రాశారు.

చిలికి చిలికి గాలివానైంది. ఉరుములతో వర్షం ప్రారంభమైంది. కిటికీ తలుపు సందుగుండా జల్లు కొట్టింది. ప్రపంచమంతా తల్లకిందు లవుతూన్న అనుభూతి. కత్తులు ఝుళిపించినట్టు మెరపులు.

'మేష్టారూ! ఈ రాత్రికింక ఇంటికి వెళ్లలేరు. అయినా మీకోసం కాసుక్కూచునేవా రెవరూ లేరు. ఇవేళిక్కడే పడుకోండి.' అంది లలిత. ఆ పరిస్థితుల్లో అది తప్పని సరైంది.

గడియారం పది కొట్టింది.

లలిత మేలుకునేవుంది. రత్నంగారి అభిప్రాయం ఆమెకు తెలుసు. ఈ అర్ధరాత్రి ఒంటరిగావున్న తనింటికి వూరికే వచ్చేటంత పిచ్చివాడు కాడాయన. తను ఏదో వొకటి నిశ్చయించుకోకపోతే ఈ ప్రపంచంలో ప్రతి వ్యక్తీ తనకు శత్రువుగా మారతారు. రత్నంగారు తనకు కలిగిస్తున్న అడ్డంకులు చాలా వున్నాయి. రామానికి సంగీతం చెప్పమని బతిమాలితే వల్లకాదన్నారు. తను రాత్రంతా మేలుకుని పాఠాలు చదివి అర్థంచేసుకుని బోధించినా అది తృప్తికరంగావుండదు.

బయట కుంభపోతగా వర్షం కురుస్తోంది. రత్నంగారి కళ్ళు మూతలుపడివున్నాయి కనక ఆయన నిద్ర పోతున్నాడనే అనుకోవాలి. ఇంతకూ ఈ పోరాటం దేనికి? అందరూ తనమీద శత్రుత్వం వహించటం దేనికి? తను సాధించిన దేమిటి?...'పతివ్రత' అనిపించు కోటానికా? సుశీలని అందరూ మెచ్చుకోటానికా? పిడికెడు ఇసుకకోసం భూప్రదక్షిణం కాలినడకతో పూర్తి చెయ్యాలంటే ఆ ఇసుక తన కక్కర్లేదు... తన్ను ఎవరూ నమ్మరుకూడా—చాలామంది ప్రియు లున్నారనే వార్త ప్రచారంలోవుంది—సుబ్బారావు, గురుమూర్తి, రత్నం-ఇంకా-ఇంకా-ఎంతమందో! వీళ్ళందరూ తనకోసం ఒంటికాలిమీద యుగాలుగా తపస్సు చేస్తున్నారు పాపం! తిరస్కరిస్తే పగ తీర్చు కుంటారు—ముళ్ళపొదలోకి నిర్దాక్షిణ్యంగా విసిరి వేస్తారు. జీవితం ఖరీదు రూపాయైతే శీలం ఖరీదు వెయ్యి రూపాయలు. ఏ అభిప్రాయాన్ని అణచి వుంచాలని ప్రయత్నిస్తానో, అదే రెట్టించిన బలంతో ఎదిరిస్తుంది. రత్నంగారి కోర్కెను అంగీకరిస్తే తనకే బాధా వుండదు. మహారాణీలా బతకవచ్చు—రామం అసలు జీతమే లేకుండా చదువుకోవచ్చు. ఏదో

అందని, కనిపించని వస్తువుకోసం వరకొన్ని చూడాలట. అందులో దంపేనలు అనుభవించాలట—వస్తు—ఆ వేదాంతం—సంఘం యివ్వబోయే బిరుదాలు తనకు వద్దు—జీవితం పొడవు బహుస్వల్పం-ఇందులో ఒకరి విమర్శలను వినటానికి, బాధపడటానికి తీరిక వుండదు. మనిషికి ఒక్కటే ఆశయం వుండాలి. ఇతరులకు బాధ కలిగించనివిధంగా సుఖపడటం—ఏ మార్గం అవలంబించినాసరే—

రామం అవతల గదిలో మత్తుమందు తాగిన వాడిలా చలనరహితంగా నిద్రపోతున్నాడు.

నేను పుచ్చిపోయిన కాయగూరలు అమ్ముతాను. కొనుక్కునేవాడికి అవి పుచ్చిపోయినవని, కొనకూడదని తెలియవద్దూ! అలా తెలియక కొన్నాడంటే అది నా తప్పుకాదు. జీవితంలో ఆచరించవలసిన నియమాలు ఈ మాత్రాల హద్దువరకూ ఎగబ్రాకవచ్చు—వ్యాపించవచ్చు—లలిత నిర్ణయించుకుంది—ఈ ఆదర్శజీవితం తనకు వద్దు—దాంతో తను ఏకీభవించదు—దాని కర్థం లేదు...ఆత్మసుఖం—అది మొదలవుతే దానికంతం వుండదు. హాలాహలం లోంచి అమృతం జనించకూడదూ?
గడియారం పదకొండు కొట్టింది.

ఆకాశం భయంకరంగా గర్జించింది. ఎక్కడో పిడుగుపడే వుంటుంది. ఇలాంటి పరిస్థితులు ఏదో వైపరీత్యం జరగటానికే ఏర్పడతాయి. ఒక్కసారిగా గొళ్ళెంవూడి కిటికీ రెక్కలు తెరచుకున్నాయి. రత్నంగారి ముఖంమీద జల్లుకొట్టింది. ఆయన లేచి కూర్చున్నాడు. ఒక్కసారిగా మెరుపు మెరిసింది. ప్రపంచంలోవుండే కాంతి కిరణాల సముదాయమంతా దాని గర్భంలో యిమిడివుంది. కళ్లు చీకట్లు కమ్మాయి. లలిత పరుగెత్తుకెళ్ళి తలుపు వేయటానికి ప్రయత్నించి అర నిమిషంలో తడిసిపోయింది. గాలి వేగానికి వెనక్కి తోసివేయబడి, ఆమెకు సాయం చేయటానికి వచ్చిన రత్నంగారిమీద వాలిపోయింది.

అంతే- ఇద్దరి ఆశయం ఒక్కటే- ఎవర్నీ ఎవరూ ఎదిరించలేరు. గాలివాన తనపనైనట్టు కొంతసేపు ప్రళయనృత్యం చేసి విశ్రమించింది.

* * * *

రెండు సంవత్సరాలుగా ఎదుర్కొంటున్న అజ్ఞాత శక్తులన్నీ ఒకచోట కేంద్రీకృతమై, ముందుకు సాగలేక తెల్ల మొహాలువేసి ఆకాశంలోకి అంతరించి పోయాయి. వేడికి కరిగి అదిరిగా స్థిరమైన రూపం లేకుండా గాలిలో కలిసిపోయాయి.

ఈసారి సుప్పున పొగలా వ్యాపించిన వార్త పుకారుకాదు. రత్నంగారు లలితను వివాహం చేసుకోబోతున్నారు. ఆయన ఆ వార్త నిజమని ఒప్పుకున్నారు.

నాలుగు రోజులు గడిచాక లలిత ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయిన సంగతి ఆమె వెళ్ళాక కాని అందరికీ తెలిసిందికాదు. ఉద్యోగానికి రాజీనామా, రత్నంగారి పేరిట ఉత్తరం ఒకే టపాలో వచ్చాయి.

ఆయన ఉత్తరం చదువుకున్నాడు.

"కొత్తగా జీవితంలో అడుగుపెట్టిన వారికి తెల్లనన్నీ పాలు, నల్లనన్నీ నీళ్ళు అనిపిస్తాయి. ఎండమావుల్ని నమ్ముకుని, బంగారు గనులు లభిస్తాయని పరుగులు తీస్తారు. కాని ఈ నగ్నసత్యం కూడా అనుభవం మీదకాని తెలియదు. నాకు తెలిసిన ఓ కథ చెప్తే మీకర్థమవుతుంది

నాలుగేళ్ళక్రితం గుంటూరులో ఓ యాభైఏళ్ళ వ్యక్తి ఓ అమ్మాయిని రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఆయనకు మొదటి భార్యవలన కలిగిన సంతానంలో ఓ ఎనిమిదేళ్ళ అబ్బాయి మాత్రం దక్కాడు. నిజానికి ఆ కుర్రవాడి జీవితాన్ని ఓ దిశలో నడిపించటానికే ఆయన రెండో పెళ్ళి చేసుకున్నాడు. కాని వున్నట్టుండి ఆయన కన్నుమూశాడు. అప్పటికాని ఆ అమ్మాయికి తన నిజస్థితి తెలిసివచ్చిందికాదు. ఉన్న డబ్బంతా అప్పుల వాళ్ళు ఎగేసుకుపోయారు. కాస్తో కూస్తో మిగిలితే దూరంగావున్న బంధువులు దగ్గరగా వచ్చి ఫలహారం చేసి ఆమెను నడిసముద్రంలో వదిలేశారు.

ఇప్పుడు చెప్పండి. ఆ కుర్రవాణ్ణి పెంచవలసిన బాధ్యత ఆమెకు వుందా లేదా?...ఆ ప్రశ్నతోనె ఆ అమ్మాయి పోరాటం సాగించి చివరకు తెగించి ఓ నిర్ణయానికి వచ్చింది.

జీవితంలో ఓ మార్గాన్ని అవలంబించిన వెనుక ఆమె తను అవివాహితనని, ఆ కుర్రవాడు తన తమ్ముడని చెప్పుకుంది. మీ కా అమ్మాయీ, కుర్రవాడూ ఎవరో ఈ పాటికి అర్థమయ్యే వుంటుంది.

నేను చేసిన పొరపాటు అక్కడే వుంది. వివాహమైందని చెప్పకుండా దాచివుంచినందుకు అనేక శిక్షల్ని ఎదుర్కోవలసి వచ్చింది. చివరకు నేను చేసుకున్న నిర్ణయం యిది. ఒక స్త్రీ ఒంటరిగా సమాజంలో బతకటం చాలా కష్టం—దొంగల భయం—ఇరుగు పొరుగువారి విమర్శలు—కాముకుల చూపులు—వీటి మధ్య ఆమె స్వాభిమానం హారతి కర్పూరంలా హరించిపోతుంది. అంటే పరాశ్రయం తప్పదన్న మాట.

రెండో విషయం—కొన్ని నిశ్చితమైన సూత్రాలకు కట్టుబడి ఎవరూ జీవించలేరు. అలా జీవిస్తున్నవారిని బతికున్నంత కాలం సంఘం గౌరవించదు. చచ్చినవాడి కళ్లు చేరెడన్నట్టు, చనిపోయాక గౌరవిస్తుందేమో! పరిస్థితుల కనుగుణంగా జీవిత విధానాలను మార్చుకోవాలి. చివరి గడియల్లో, మీరు వచ్చేదాకా నాకో కనువిప్పు కలగలేదు.

నేను వివాహితనని చెప్పుకున్నా ఈ బాధలు తప్పవు. తమ కోర్కెలు తీరేవరకూ వెంట తిరిగి పాపంలో ముంచివేసి మొహం తిప్పించేస్తారు. పెళ్లి చేసుకోటానికి ఎవరూ ముందంజ వెయ్యరు. అందుకే ముందు జాగ్రత్త పడ్డాను.

అయితే నేం? ఓడిపోయాను.

అంతా తెలుసుకున్నాక ఎందుకు వెళ్ళిపోతున్నానని అడుగుతారేమో! దానికి సమాధానం చెప్పలేను. నేను చేస్తున్నది తెలివితక్కువ పని నాకు తెలుసు. చేతులారా కట్టిన కట్టడాన్ని కూల్చివేసినట్టు—అయినా తప్పదు—చివరిసారిగా మీ సాయాలకు కృతజ్ఞత—గతాన్ని మర్చిపొండి—నా జాడ తెలుసుకోటానికి మాత్రం దయవుంచి ప్రయత్నించకండి.'

రత్నంగారు నిట్టూర్చారు.

లలిత సుఖంగా వుంచా లనుకున్న కారణం అర్థమైనట్టు ఆయన తల నిలువునా ఆడించాడు.

# యాజ్ఞవల్క్యము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

* గత సంచిక తరువాయి *

ఒక్కతఱిన్ మహోగ్ర పవనోద్ధృత వహ్ని చెలంగి ప్రాంతముల్
పక్కణముల్ దహించి వెసఁబర్విన — నా మిథిలాపురంబునుం
జిక్కి యపూర్వశోకమునఁ జేష్టడఁ జేయఁ దదీయ పౌరులం
దొక్కఁడు స్వాస్థ్యముం బడయనోపఁడు దైవవిధాన మెట్టిదో!

తివ్వన వార్త నల్దెసలు రేఁగియు మింటికినంటి యాపయిన్
దవ్వుల మౌని యాశ్రమముదాఁకను బ్రాఁకఁగ — బెగ్గడిల్లి దా
దవ్వులఁ బాఱి రందఱో యథాయథలైన మొసందలోపలన్
నెవ్వగఁగూరి తత్త్వము గణింపని తత్తఱపాటు మీఱియున్

అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు మహర్షిగణంబున కేదొ బోధగాఁ
జెప్పుచునుండ దానిఁ బరిశీలన సేయుచుఁ దత్త్వదృష్టిలోఁ
జిప్పిలు పారవశ్యమునఁ జిన్మయుఁడౌ జనకర్షి, మైకమున్
గప్పిన నాగుఁబాము వలెఁ గన్పడెఁ దన్మునివర్యు సన్నిధిన్

ఈవల — వాండ్రు పీండ్రు భరియింపఁగ నైతియుఁగాని భీతిమై
నావురుమంచు బిక్కమొగమై తమయాస్తులు నేఁడు దగ్ధమై
పోవక తప్పదేమొ యని బోరున నేడ్చుచు గోఁచిగుడ్డలే
వో వెలలేని వస్తువుల నోపిక మూటలుగట్టి రయ్యెడన్

అందనుకన్ విచిత్రమగు నాస్థను జూపినవారు కొందలం
బంది యమూల్యమైన తమయాస్తికి నేగియు మూఁడెఁబై గమే
మందఱు మిందు మ్రందుట యథార్థమటంచును బెద్దనమ్మి ము
న్మందుగఁ బాఱి; రిట్టిది తపోవనజాతికి ఖ్యాతిగూర్చునే?

జనకమహర్షి యత్తఱి విచారపరిస్థితి బ్రుంగిక్రుంగు త
న్మని జనసంఘముం గనియు బుద్ధి మఱల్పఁడు; తాను దీక్షగా
ననుకొను తత్త్వచింతకు రవంతయు మార్పును సైఁపఁడేదియున్
దనకిఁకఁ బట్టనట్టులు మనంబున నెంచుననేమి చిత్రమో!

అది గుఱుతించి యబ్బురమునంది మహాత్ముఁడు యాజ్ఞవల్క్యుఁడ
య్యదనున నూరకుండెఁ; బిలయాగ్నిని బోలెడి కాఱుచిచ్చు నె
మ్మదిగ సమస్త వస్తువులు 'మారణహోమ' మొనర్చి శాంతమున్
బ్రిదులఁగఁ జేసి రొక్కుమొగి బీతునుగూర్చె విచిత్ర వృత్తిపై

దొరకినదాఁకఁ దీవ్రమగు ధోరణి నాహుతిసేసి భస్మమున్
దెసవునఁబోసి—దైవము విధించిన యట్టులు శాంతి మంత్రమున్
గఱపెను జిచ్చు; పిమ్మట—వికావికలైన మనస్సు లూఱటం
దొఱఁగియు హానులేదియును దోఁపక యూఁగిరి పర్ణశాలలో

స్తిమితము కూర్పఁగాఁ దగిన తీరు ప్రబోధ మొనర్చ—హాని వ
ర్గము నొకచోటఁ జేర్చియు భరంబగు భీతిని బాఱఁద్రోలి శాం
తము శివమైన తత్త్వము నిదానముగాఁ గఱపంగఁ బూనె ను
త్తమ గురుదేవుఁ డత్తఱి హితంబు మితంబగు వాక్యధోరణిన్

ఓ మునివర్యులార, వినమో కనమో యిటువంటి చిచ్చు లె
న్నోమును ? దానికింత బెగడొందియు వందుర నేల ? యీ యహం
తామమతా పురస్కృత పథంబది గైకొని యిట్లు మీరు మీ
సేమము మాపుచేసికొని సేగిని బెల్లుగఁ బొందియుందురే!

ఆపద మూఁడునాఁడె యెవఁడైన నిజస్థితి సాటివారిలోఁ
జూపకతప్పు; దిట్టి పరిశోధన దైవమె సేయుచుండు—మీ
చూపిన నిన్న మొన్నటి పశుత్వముఁ గూరిచి మందలింపఁగా
నోపనుగాని యిందవసరోక్తిగఁ గొంత వచింతు విందురేన్

జనకుని శీల మెట్టిదో విచారణ సేయఁగలట్టి శక్తి యొ
క్కనికిని గల్గునే ? యతఁడు క్షత్త్రియ మాత్రుఁడె ? వాని జీవితం
బునఁ బొడసూపు జ్ఞానధనమున్ గుఱుతింపఁగనైన మీకు నె
వ్వనికిని సాధ్యమే ? యిటు వివాదము లేదు పరీక్ష చేసినన్

యోగము లేని యోగుల ప్రయోగము లిట్టివి కావా ? వాని నే
లా గణుతింతు రార్యులు ? రవంతయు స్వాస్థ్యము లేని జన్మముల్
సేగిని గూర్పవో ? తపముచే నరులొందఁగలట్టి భాగ్య మే
దో గుఱుతింతురే ? తగిన యోపిక మీ కనలేది చూడఁగా ?

వాఁడొకఁడేఁడు; మేను మునివర్యుల మంచును విఱ్ఱవీఁగి పో
రాడుటలో దోసంగు కలదంచు నెఱుంగని మందభాగ్యులే
నాఁడు దరింప; రిట్టిది మనంబున నెంచియె మున్న నేను మా
ఱాడకయుంటి, నిందలి రహస్యము నేఁటికి గోచరించెనా ?

చతురంభోధిపరీత భూవలయ రక్షాదక్షుఁడై సర్వ దు
ర్మతులన్ దిద్దఁగలట్టిఁడయ్యుఁగడు సామాన్యుండుగాఁ దోఁచు నీ
క్షితిపున్ గూరిచి యిట్టులెంతురె ? పరీక్షింపంగమీరాయున్న దు
ర్గతి యేమైన నొనర్చు శాశ్వత తిరస్కారంబుగా మీ కిఁకన్

ఈతఁడు శ్రద్ధధానుఁడయి యే తపముం బొనరించి విశ్వ వి
ఖ్యాతి గడించెనో యెఱుఁగఁ గా వలదే మునులార ! వీని ప్ర
ఖ్యాతికి మూలమైన విషయంబు రవంత యెఱింగి రేని యీ
రీతిగ సంచరింతురె హా ! యిఁక నెట్లు తరింతురో గదా !

అవధానంబది శూన్యమాయె నకటా ! యీవత్ప్రపంచంబు మీ
యవివేకంబును లెస్సఁ జూచెఁ బయిగా—నధ్యాత్మ విద్యాధికం
బు వృథా యయ్యెఁగదా ! సపంక్తి పతనంబుల్ తప్పఁగాఁ దోఁచెఁ బా
యువు దుశ్చింతలు మిమ్ము; మీ మనుగడల్ హాస్యంబులై పోవవే !

అన్నియు సక్రమంబుగ సమన్వయ ధోరణి బోధసేయఁగా
నెన్నికమైన విద్య యది యేదియు నేర్వని మీరు కుట్రలన్
బన్నుచు వక్రబుద్ధులయి పాడఱి పోవుటలో విచిత్ర మే
మున్నది ? చేసికొన్న దెటు లూరకపోవును గర్మభూమిలో ?

ప్రకృతియు మీ విచిత్రమగు వాలకముం గుఱుతించి చక్కఁగా
సకలము బోధసేసెఁ; జవిసారము లేని ప్రవర్తనంబు మీ
ఱిఁక విడువంగఁ బూనుటొకఁడే పరమార్థముగాన దాని నిం
చుక గమనింతురేని శివసుందరమూర్తులరౌదు రిద్ధరన్

మీ సౌభాగ్య మెఱుంగమే ? యడవిలో మీరున్న యీ వైఖరుల్
గాసిం గూర్పకపోవునే ? పయికి నే కారాకులో మేయఁగా
దోసంబుల్ హతమాఱునే ? హృదయమున్ దోరించు కాలుష్యముల్
హీనంబైనను మాయునే ? యరయఁగా విజ్ఞుల్ మిమున్ నవ్వరే ?

పెద్దతికమ్ము పూసికొని పేరికి హానులమంచుఁ బల్కు మీ
సుద్దులతోఁ బనేమి? గడుసుం దనమున్ వెలయించు వృత్తి మీ
కొద్దిక గూర్చునే? విలువయుం గలిగించునె? చిత్తశుద్ధిలోఁ
బెద్దగ శ్రద్ధ చూపని వివేకము లోకము సమ్మతించునే?

కరచరణాదులే సలు మొగంబుల యాస్తిగ నున్న మీరు త
త్తఱపడి పాశముల్ వదలి దవ్వుగఁబోవఁగ నేల? ధారుణీ
శ్వరుఁడు మహామహుండు గుణవంతుఁడు ప్రాజ్ఞుఁడు బద్ధదీక్షుగా
నరయుచుఁ గూరుచుండెఁ బరమార్థ మదేమొ యెఱుంగఁబోలదే!

విలువగలట్టి యీ మిథిల వేయివిధాల భయంకరాగ్ని లో
పల నుడుకెత్తువార్త యొకవంక వినంబడుచుండ దానికై
కలఁగఁడు జేఁడు; మిక్కుటముగాఁ దనధ్యానములో మునింగి వై
దొలఁగఁడు; వాని వైఖరి సుదూరము చూచిన బుద్ధికాదొకో!

వైదిక లౌకిక క్రియల వైఖరి లెస్సయెఱింగి—యందు ను
న్మాదముగూర్చు వానిని వినా యఖిలంబు గ్రహించుతేని నే
గాదనిపల్కు మీకు సరిగా భగవంతుఁడు శిక్షయిచ్చె; మీ
వాదము లన్నియున్ దెగినవా? యిఁకనైనను సత్యమెంతురా?

ఆయన కాలిగోటికి రవంతయు సాటియనంగరాని మీ
రే యిటు సంచరింపఁ బ్రజ కెట్టులు తోఁచును? మందభాగ్యులా
రా! యిఁకనైన బుద్ధిని థిరంబగు దారికిఁ దెచ్చి యిట్టి యీ
గాయము మాన్పుకోవలె సుఖంపడుకోరికి మీకు నున్నచో

శ్రీశుకులే యొకప్పుడు విశిష్ట గుణాత్మునిగా నెఱింగి ధా
త్రీశుని వీని డగ్గఱి గ్రహింతురు ధర్మ్యములైన సవ్య ది
వ్యాశయముల్ సమంజసములైనవి; యట్టి మహాత్ముఁ గూర్చియే
కోశమునందు మీరెఱుఁగఁ గోరరు మీ యవివేక మెట్టిదో?

అని కూతుంబుగ యాజ్ఞవల్క్య మునివర్యు యజ్ఞానులన్ మందలిం
చిన సహాత్ములు మానుఁలైరి; దుదికా చేష్టాటు మాయింపఁగా
నసువౌ శ్రోవను జూపి వారలకు దివ్యంబైన తత్త్వంబు మిం
చిన వేడ్కన్ దెలియంగ నేర్పెను జగచ్ఛ్రేయంబు గాంక్షించుటన్.

# భవిష్యత్కవిత

కుందుర్తి

తెనుగులోనే కాదు, ఏ భాషలోనైనా, స్థూలంగా శాస్త్ర, కవితా స్రవంతి మూడు పాయలుగా చీలి ప్రవహిస్తున్నట్లు కనిపిస్తుంది. కవి స్వయంగా కథ చెప్పుకుపోవటం ఒకటి, దీనిని కథాకథన మందాం. రమణీయమైన వర్ణనలు చేయటం రెండు, దీనిని కల్పన అందాం. పాత్రలచేత సహజ గంభీరమైన సంభాషణలు పలికించటం మూడు, దీనిని శిల్పం అందాం. కవిత్రయంలో ఒక్కొక్కరు, వీటిలో ఒక్కొక్కదానికి ప్రతినిధి. అందుకే భారతానికి అంత గౌరవం వచ్చింది.

తరువాత కాలక్రమేణా సాహిత్యపు విలువలు మారిపోవటం మనం గమనిస్తూనే వున్నాం. ఈనాడు నవ్యుల దృష్టిలో భావనాశక్తికీ, కల్పనా చమత్కృతికీ ఎక్కువ ప్రాముఖ్యం ఏర్పడింది. అంబుధి లోతుల్లోకి అతడు ఎంతదూరం తొంగిచూడగలడు. ఆకాశపు టంచుల్లోకి ఎంత ఎత్తుగా ఎగరగలడు అనేదే నేడు మనకు ముఖ్యం. అంటే మిగిలిన రెండు పద్ధతులకంటే, ఊహకు, కల్పనకూ ఎక్కువ ప్రాధాన్యం లభించిందన్నమాట. ఈ శతాబ్ద ప్రథమార్థంలో వచ్చిన తెనుగు కవిత్వమంతా దాదాపు ఈ కోవకు చెందినదే. నిజానికి యీ మార్పు ప్రబంధయుగంలోనే ప్రారంభమైంది,

అతి నవ్యమైన భావచిత్రాలను గీయటంలో అధునిక కవిది అందె వేసిన చేయి. "ఆమె కన్నులలో అనంతాంబరపు నీలి నీడలు కలవు", ఇటువంటి సున్నితమైన, ఉన్నతమైన భావచిత్రణ నవ్యకవుల సొమ్ము. ఒక ప్రేయసీ ప్రియుల మనోహర ప్రేమగాథతో నడచిన నవల చెప్పగలిగినంత, ఒక్క వాక్యం చెప్పగలదు. అలాగే "మనసు గుర్రము రోరి మనిషీ—మనసు కళ్లెము లాగు మనిషీ" అనేభావం ఒక వేదాంత వ్యాసమంత విషయం వివరణచేస్తుంది. కవిత్వానికీ వచనానికీ ఉన్న తేడా ఇక్కడే. కవి వాడే శబ్దాలు కేవలం శబ్దాలుగా కాకుండా, అందులో కొన్ని కలిసి ఒక రంగు రంగుల బొమ్మగా తయారై నీ మనోనేత్రం ముందు కనిపించేసరికి హృదయం ఉప్పొంగుతూ వుంటుంది. ఆ శబ్దాల వెనకాల ఛాయామాత్రంగా అనేక విశేషార్థాలు ముసుగులు కప్పుకొని కూచొని వుంటై. శబ్దసమూహంవల్ల ఏర్పడిన రంగుల చిత్రం చూస్తుంటే, దానిలో నుండా అవతలి వేపుకు తెరుచుకున్న కిటికీ ద్వారా నీ మనోనేత్రం విశేషార్థవంతమైన ఆకాశంలోకి చొచ్చుకుపోతుంది. విశేషార్థాలు కప్పుకున్న ముసుగులు క్రమ క్రమంగా తొలగిపోతూ వుండగా, ఎంతదూరం చూశావో ఎరుక లేని స్థితిలో ఉండీ లేని స్మృతితో ఒక తెలిసీ తెలియని ఆనందానుభూతి నీకు కలుగుతుంది కన్నులరమోడ్చి నీలోకి నీవు ఒక్క క్షణంపాటు చూసుకుంటావు. ఈమాత్రం చేయగలిగితే కవితాప్రయోజనం సిద్ధించినట్లే

సాహిత్యంలో కవిత స్థానం చర్చించటానికి ముందు అసలు కవిత్వం ఎందుకు? అది లేకపోతే మానవుడు సుఖంగా బ్రతకలేడా? కవులు లేకుంటే లోకం నడవదా? అనే ప్రశ్నలు వేసుకుందాం. కవిత్వం వల్లగానీ, యితర కళలవల్లగానీ, మానవునికి కలుగుతున్న ప్రయోజనం యిది అని రూపాయలు, అణాలు, పైసలలో లెక్కకట్టి చూపటం అంతసులభం కాదు. అయినప్పటికీ కళలు మానవ జీవితానికి వుండే ఒక ముఖ్యమైన అవసరాన్ని తీర్చగలుగుతున్న వనటం నిస్సందేహం. మనిషి ఏ స్థాయికి చెందినవాడైనా ఏదో ఒక సమయంలో కళలను ఆశ్రయిస్తున్నాడు. కొంత కాలం వాటితో సంబంధం వదులుకుంటే, ఏదో పోగొట్టుకున్న వాడిలా గిజగిజ లాడుతూ వెదుక్కుంటాడు. నిత్య జీవితాన్ని ఎంతగా ప్రతిబింబించినా, కళే జీవితం కాదుగదా. అది జీవితంకంటే భిన్నమైనది. ఆ లోకంలోకి ఒకసారి వెళ్ళిరావటం మానవుడికి అన్నవస్త్రాల తర్వాత అతి ముఖ్యమైనఅవసరం. నడి ఎండలో రోడ్డుమీద మనిషి నడుస్తున్నాడు. రోడ్డు

ప్రక్క విశాలమైన మర్రిచెట్టు, కొమ్మల చేతులు సాచి రమ్మని పిలుస్తోంది. అతను ఆ ఆహ్వానాన్ని తిరస్కరించలేడు. కొంచెంసేపు చల్లని నీడలో విశ్రాంతి తీసుకొని మళ్లీ తన ప్రయాణం సాగిస్తాడు. రోడ్డు ప్రయాణం జీవయాత్ర అనుకుంటే, ప్రక్కనే మర్రిచెట్టు కళ. ఆ కళా లోకంలో చూసిన కొన్ని పరమ సత్యాలవల్ల మానవుడు నిత్యజీవితంలో ఉత్తేజితుడై, కార్యోన్ముఖుడవుతాడు. 'ఆయువు నూరు వత్సరములందు సగంబు గతించె నిద్రచే" అనే పద్యం మనసులో మెదలినప్పుడల్లా "అయ్యో, కాలం పరుగెత్తిపోతున్నది ఇప్పటివరకు మనం చేసింది ఇంతేనా!" అనిపిస్తుంది. ఆ కఠోర సత్యం చెప్పబడిన పద్ధతివల్ల, దానిభావం మన మనస్సులమీద సుత్తి దెబ్బలా తగులుతుంది. ఈ వేదనవల్ల మనం ఎక్కువ కృషిచేసి, ఎక్కువ సాధిస్తామేమో ఎవరు చెప్పగలరు?

ఈనాటి సాహిత్యంలో నవలలు, కథలు వగైరా వచన కావ్యాలకు బాగా ప్రచారం వుండటంవల్ల కవిత్వంయొక్క భవిష్యత్తు ఏమిటి, సాహిత్యంలో దీనిస్థానం క్రమంగా క్షీణిస్తుందా, పెరుగుతుందా? అనే విషయం చర్చించవలసి వచ్చింది. కాని వచన కావ్యరీతులనూ, నాటక రీతులనూకూడా తనలో ఇముడ్చుకోగలిగిన సమగ్రమైన సాహిత్యరూపం కవిత. అందులోని ప్రసన్న కథా కథనం వచన కావ్యానికీ, సంభాషణల శిల్పం నాటకీయతకూ ప్రతినిధులు. ఈ లోకంలో ఏరి కూర్చిన ముత్యాలహారం వచనమైతే, ఏదో తెలియని సౌందర్య లోకంలోనుండి విసిరివేసి వచ్చిన శకలాల సముదాయం కవిత. కవితలోని ఉక్తి విశేష ప్రత్యేకత, దానిలో అంతర్లీనమై వున్న ఇతర సాహిత్య రూపాలకు మెరుగులు దిద్దుతుంది. అందువల్ల సమస్త సాహిత్య రూపాలకంటె విశిష్టమైనది కవిత. సాహిత్యంలో దాని స్థానం క్షీణించటం అంటూ జరుగదు.

అసలు కవిత్వం ఈనాడు కాదు గదా, ఏనాడైనా నేరుగా సామాన్య ప్రజల్లోకి పోవాలని ఉద్దేశించి వ్రాయబడటం లేదు. ఎందుకంటే ప్రజలు కవితలోని ఔన్నత్యాలను వెంటనే అందుకోలేరు. అందుకనే కవితయొక్క మంచిచెడులను నిర్ణయించటంలో సామాన్య ప్రజానీకానికి పాత్ర లేదు. ఆ మాటకొస్తే, ఆ కాలపు విమర్శకుల కూడా ఆ పని సాధ్యం కాదు. దానిని నిర్ణయించేది కాలమే. అంటే కాలక్రమేణా గాని ప్రజలు తమ కవిత్వంలోని మహార్థాల చేత ప్రభావితులు కారు. చెప్పదలచిన విషయాలను, వెంటనే ప్రజల దగ్గరకు నేరుగా తీసుకువెళ్లే సాహిత్య రూపాలు వేరుగా వున్నాయి. అయినా ప్రజల దగ్గరకు వెళ్లేటప్పుడు ఎంత ఎక్కువ కవితను మోసుకు వెళ్లగలిగితే, ప్రజల స్థాయి అంత ఎత్తుగా పెరిగినట్లు. కాళిదాసు, షేక్స్పియర్ నాటకాల్లోని కవిత ఇందుకు చక్కని ఉదాహరణ.

కవిత్వం ప్రాచీనమనీ, అధునాతనమనీ అనటం కేవలం వ్యవహార సౌలభ్యంకోసమే కాని యీ విభాగం వాస్తవమైందికాదు. భారత కాలంనుంచి నేటిదాక వచ్చిన తెలుగు కవితను పరిశీలిస్తే, అది తనంతటతాను, కాలపరిస్థితులకూ, ప్రజల అభిరుచులకూ మారుతున్న సాహిత్యపు విలువలకూ అనుగుణంగా కొన్ని సర్దుబాట్లు చేసుకుంటున్నట్లు కనిపిస్తుంది. రూపభేద మాత్రమైన ఈ మార్పులు తప్ప, అసలు వస్తుగుణంలో కాని ప్రపంచం దృష్ట్యా కవిత్వ ప్రయోజనంలో గానీ మార్పు వచ్చినట్లు లేదు. కవిత్వానికి ఎన్నిరకాలైన నిర్వచనాలు చెప్పబూనుకున్నా, అవన్నీ ఒక కేంద్ర బిందువు దగ్గరకు వెళ్లుతూనే వున్నాయి.

తెలుగు కవిత్వానికి యిది ప్రయోగాల యుగం. గురజాడనుండి నేటివరకు రకరకాల ప్రయోగాలు జరుగుతూనే వున్నవి. వీటిలో ప్రధానమైన మార్పు సంప్రదాయ సిద్ధమైన ఛందస్సులను వదలివేయటం. తత్ఫలితంగా తెలుగుకవిత్వంలో 'ఫ్రీవర్స్' అనే కొత్త పద్ధతి రూపొందింది. దీనిని గురించి ఎక్కువగా చెప్పబూనటం ప్రస్తుతానికి సాహసమనిపించుకుంటుంది. ఎందుకంటే, యిప్పటికే అనేకమంది రసజ్ఞుల దృష్టిని యిది ఆకర్షించినా, యింకా శైశవావస్థలోనే వున్నదని చెప్పాలి. ఛందస్సులను వదలివేయటంవల్ల సాధించిన ప్రయోజనమేమిటో యింకా స్పష్టంగా ప్రపంచానికి రుజువు చేయవలసిన బాధ్యత యీ పద్ధతిని అభిమానించే కవులమీద వుంది. అంతేకాక యీ స్వేచ్ఛాగీతిని కథాకథనానికీ, కల్పనకూ, కావ్య శిల్పసాధనకూ ఉపయోగపడేవిధంగా మలచుకొని దానిని సమగ్రం

ప్రదర్శింపబడలేకపోవున్నది. ఇప్పటి సూచనలనుబట్టిచూస్తే, భవిష్యత్తులో తెనుగు కవిత్వంలో యిదొక ప్రధాన భాగంగా రూపొందగలదని విశ్వసించే వాళ్లలో నేనూ ఒకణ్ణి.

పోతే కథావస్తువు విషయంలో ఏమంత పేచీ ఉండదు. వాల్మీకి రాముణ్ణి చిత్రించినట్టు మనం మహాత్ముణ్ణి చిత్రించదలచుకుంటే ఎవరూ అభ్యంతర పెట్టరు. 18 రోజుల భారత యుద్ధంలాగ, 60 ఏండ్ల స్వాతంత్ర్య సమరాన్ని మనం చిత్రించగలిగితే ఎవరూ వద్దనరు. ఇంతకూ మహా ప్రతిభావంతుడైన కవి ఎవరైనా చేపట్టితేగాని యీ వర్తమాన కథావస్తువులకు కావ్యస్థాయి రాదు. చేతనయినంతలో, ఇటువంటి నవ కాలపు కథలను కవితా వస్తువులుగా స్వీకరించటంవల్ల తెలుగు కవిత్వానికి మంచి భవిష్యత్తు వుంటుందని నా విశ్వాసం. ప్రాచీన తెలుగు కవులెవరూ యీ విషయం అంతగా పట్టించుకోలేదు. మనమైనా పట్టించుకుందాం.

కవిత్వం మానవహృదయాలను దూరగొనాలంటే, అది మానవ జీవితానికి సన్నిహితంగావుంటడం అత్యవసరం. అతనిలో నిద్రిస్తున్న మంచినీ, దేవత్వాన్నీ మేల్కొలిపేదిగా వుండాలి. అప్పుడే కవిత్వానికి మనం అనుకుంటున్న విశిష్టత లభిస్తుంది. అది మానవునికి ఒక ముఖ్యావసరం అవుతుంది

[ఆలిండియా రేడియో (హైదరాబాదు) సౌజన్యంతో]

# ముగింపు లేదు

శ్రీ వి. కృష్ణరావు

నేను అప్పుడే భోజనానికి కూర్చున్నాను. దూరాన వావిలాలవారి ఇల్లు అంటుకున్నంతగా, ఆ ఇంటివారంతా ఒక్కమాటు కెవ్వుమన్నారు. "ఆయనకు మళ్లీ" అందో లేదో శకుంతలం, నేను భోజనం చేయకుండానే వడ్డించిన విస్తరి వదిలివెళ్ళాను.

నేను వెళ్లాను. వెళ్ళి నువ్వు చేసిందేమిటి? అంటే ఏమీ చెప్పలేను. వావిలాల తాతగార్ని వీధిలో ఉంచారు. నేను ఆయన ముఖం చూశాను. ఇంకా ఆయన శాంతంగా, ప్రసన్నంగా మౌనంగా ఉన్నారు. నాకళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. నేను నమస్కరించాను మనస్సులో. నాకంఠం నాకు తెలియకుండా పూడిపోయింది. మాటలురావు అయినా ఏం మాట్లాడాలి? ఎవరితో మాట్లాడాలి? నన్ను పలుకరించే వారెవ్వరు? చిన్నా, పెద్దా పిల్లపిట్టలు రోదిస్తున్నారు. నేను ఆయన ఆత్మీయుణ్ణి అని, నాకోసం ఆయన బాధపడ్డారని, ఆ రోదించే వారికేం తెలుసు? ఆయనకు, నాకు గల సంబంధం ఆయనకు తెలుసు. నాకు తెలుసు.

నేను తిరిగి ఇంటికి వచ్చేశాను. ఆరుబయట పడక కుర్చీమీద కూర్చున్నాను. శకుంతలం వచ్చింది నా ప్రక్కకు-శకుంతలం కూడా విందికాబోలు. "పాపం ఎంతమంచివారు..." శకుంతలం ముఖంలోకి చూశాను. ఆమెలో కూడా విషాదచ్ఛాయలు అలుముకున్నాయి. శకుంతలం ముఖం చూడలేకపోయాను.

నేను నాలో గొణుక్కున్నాను. "నన్ను ఆదరించి పలుకరించేవారు మీరు కూడా వెళ్లిపోయారా?" ఈ మాటలు నేనుఅనుకుంటూంటే, ఉన్న కాస్త, అండా ప్రక్కకు తప్పుకుందనుకున్నాను. నాలో ఉన్న కొద్దిధైర్యం పోయిందనుకున్నాను.

ఇక నాకు ఎవరు? వెంటనే వేదాంత ఒరవడిని నేను ఎవరు? శకుంతలంఎవరు? ఏమిటీ సంబంధం? ఎందుకు ఈ సంబంధం ఏర్పడింది? ఏమిటి వింత ఆత్మీయత?

నా పదో ఏటే, నేను ఏకాకినైనాను. నన్ను చేరదీసి, ఆదరించిన పినతల్లికూడా పోవడంతోటే, అంతా ఒక్కటై, పదిహేనేళ్ళ కుర్రాణ్ణి ఎలా బ్రతుకుతాడో పరిశోధించి పరిశీలించాలన్నట్లు ప్రపంచంలో విసిరి వేయబడినటయింది! ఈ ఈడులో... నన్ను చూసి జాలిపడ్డారు. ఎందుకో ఆజాలి తెలియదు. నాకు నేను రాజాగా బ్రతికాను. దిక్కులేనివాడు నిజంగా తుఫానంటే భయపడుతుంది. తుఫానులో ఇరుక్కున్న దాని పరిస్థితిమాస్తే నిజంగా జాలిపడవలసి వస్తుంది మానవులకు! కాని చిత్రంగా, తుఫానునే లెక్కచేయకపోతే, ఆ జాలి పూర్తిగా అనవసరం. జాలిపడేవారి అమాయకతకు జాలిపడవలసివస్తుంది అతి చిత్రంగా!

కట్టుకళ్ళలో ఉండవలసిన వయసు కుర్రాడికి విచ్చలవిడి వచ్చింది. నా ఇష్టం వచ్చినట్లు తిరిగాను. అంతా చెడ్డఅలవాట్లు అంటారు—అవి అన్నీ అలవడ్డాయి. నన్ను అంతా చీదరించుకున్నారు. అసహ్యించుకునేవారు. తిట్టేవారికేమో కూడా! ఎదురుగా తిడితే పళ్లు విరిచేవాడినే. ఒకమాట...

విన్నగాను, వెధవ! ఆడినంతసేపూ, నాతో గుడివెనకాల పేకాట, ఆడి, తిరిగివస్తూంటే, నాతో అంటాడు. 'నువ్వా పంచులోంచి ఫోం! అమ్మా, నాన్నా తింటారు: నీతోకలిస్తే!' అన్నాడు. నాకు భలేకోపం వచ్చింది. రొమ్ము విరిచి, చేయిపాచి ఒక్కటందుకున్నాను. క్రిందపడ్డాడు. పైకి లేవదీశాను. వెధవముఖం! దుమ్మంతా దట్టంగాపట్టి మరీ అసహ్యంగా ఉన్నాడు. 'పరికిపందా!' అనిఒక్కతోపు త్రోశాను. వాడు ఆ గెంటును ఆపుకున్నాడు కనక సరిపోయింది. లేకపోతే వావిలాలవారి పెద్దగోతిలో పడాల్సింది. దద్దున్నా! ఏడుపుమొహం పెట్టి ఏడుస్తూ అన్నాడు. "నాన్నతో చెప్పి తన్నిస్తానుండు" అని, నాకు నవ్వుముంచింది. అసహ్యం వేసింది వాణ్ణి

చూస్తుంటే. "ఒరేబక్క విస్సీ. అగోతిలో పడాల్సిందిరా. మీ నాన్నతో కాదు, మా నాన్నతో చెప్పి ఉంటే వాడివి."

పకపక నవ్వడం విని అటు తిరిగాను. అరుగుమీద వావిలాల తాతగారు! ఆయన ఇదంతా చూస్తూనే ఉన్నారు. నేనెంతో అభిమాన పడ్డాను. చివరన, "తప్పుకదూ! అలా కొట్టచ్చా!" అన్నారు. నిజమే. వాణ్ణి చావగొట్టినంత పనిచేసాను.

నాకు పద్దెనిమిదవ ఏడు వచ్చింది. ఇప్పుడు నేను వయోజనుడను అన్నమాట. నా ఇల్లు అమ్మచూపాను. ఎప్పుడూ నాతో మాట్లాడి ఎరగనిమూక, నన్ను అసహ్యించుకొనే జనం, ఎడతెరిపి లేకుండా వస్తూ, పోతూ ఉన్నారు. నాతో, ఎంతో తియ్యగా మాట్లాడారు. ఎప్పుడూ జ్ఞప్తికిరాని, నాతల్లిదండ్రులు వారి గుర్తుకువచ్చారు. ఇంకా, మంచివాళ్ళగా కూడాను. నన్ను చూసి జాలిపడ్డారు పాపం! నేనంటే ఎంత ఇష్టం. నేను పాడయిపోవడం ఇంకా మరీ ఎంత ఇష్టమో తర్వాత తర్వాత తెలిసింది. వారణాసాయన మరీ విచిత్రంగా మాట్లాడతాడు.

"అదికాదు అబ్బీ! పదిమందీ పదిమాటలంటారు. ఇదంతా చూసి మోసపోతావు. నామాట విను. కుఱ్ఱ వయ్యాసివి. నీకు తెలియదు. ఇల్లును అమ్మడం ఏమంత మంచిపనికాదు. ఏదైనా, నీ అదృష్టం మంచిదైతే, ఓ ఇంటివాడవు అవుతావు. ఇంటిదాన్ని వీధిలో పెడతావేమిటిరా అప్పుడు? (నవ్వారాయన!) అంచేత ఇల్లు అమ్మకు. పైగా, అమ్మావే అనుకో!... ఏదో రెండువేలో, మూడువేలో వస్తుంది. (నాగుండె చెరువయ్యింది. లంకంత ఇల్లు మూడువేలా? అమ్మ! ఆశ!!) అది హారతి కర్పూరం లా హరించుకు పోవడం తప్ప, నువ్వు నిర్వాకం నిప్పెడతావన్నది అబద్ధం."

పకపక నవ్వాను, ఆయన విచిత్రంగా చూసారు. నేను విచిత్రంగా కనపడ్డట్టుంది నా నవ్వులో! అందుకే ఆయన విచిత్రంగా కనపడుతూ, విచిత్రంగా చూసారు!

"నేనా తాతగారు? ఇంటివాణ్ణి అవ్వడం!... నాకా అదృష్టం పండేదీ? అన్నాను.

వారణాసి తాతగారికి, నేను దారిని పడుతున్నట్లనిపించిందేమో, ఆయన అందుకొన్నారు.

"అదేమిట్రా అలా అంటావు. వీధినిబోయే దానయ్యలు రాజ్యాలు ఏలినకథలు అనేకం ఉన్నాయి. కొసుకు పనికిరాని కామరాజు ఇప్పుడు నైసే ప్రసిడెంటు మన వెంకటాయిపాలెం శివారుకు. అంచేత, ఏమో! ఎవరు చెప్పగలరు? ఎవరిదే రేఖో? నేమాట నేమో గాని తర్వాతయినా విధిగా అనుకుంటావురా ఫలానా అప్పుడు వారణాసి తాతగారు ఇల్లు నిలబెట్టాడని!"

నాకు ఆయన చెప్పేతీరు వింటూంటే, ఏదో నూతన ఆవేశం కలిగింది నాలో! నేను మైకంలో పడ్డట్టు అనిపించింది. ఆశ ఎంత మంచి వస్తువ! నేను, కళకళలాడే కొంపలో, భార్య, పిల్లలతో సరదాగా ఉన్నట్లు 'ఫీల్' య్యాను. ఆ 'ఫీలింగు' ఎంతో బరువుగా, తియ్యగా ఉన్నట్లు కూడా అనిపించింది. ఆ 'ఫీలింగు' ఆట్టేకాలం ఉండలేదు. దానివెనక కారుమేఘాలు తరుముకొచ్చాయి. ఆ నల్లటి మేఘాలు పూర్తిగా కప్పినాయి నన్ను. వెంటనే ఆ 'ఫీలింగు' పోయింది. మామూలు నేను అయ్యాను. నేను అనుకొన్నాను. అంత అదృష్టమా?

వారణాసాయన సారాంశం చెప్పారు. "అందుచేత అబ్బీ! ఇల్లు అమ్మచూపడం మంచిదికాదు. వస్తాను." వారణాసాయన ఎంతో మంచిగా కనబడ్డారు అప్పుడు. ఇంత మంచివారా? నిజంగా? నాకు ఆయనమీద విపరీతంగా గౌరవం పెరిగింది. నేను అడిగాను.

"మరి తాతగారూ! నన్ను ఏం చెయ్యమంటారు? నాకు డబ్బు అవసరంగా కావాలి?"

"ఎంత?"

"ఐదువందలు"

"నేను ఇస్తాను. సరేనా." అని లేచి వెళ్ళిపోతూ... "రేపుదయానే వచ్చి పట్టుకెళ్ళు" అన్నారు.

ఆరాత్రి నేను పేకాటనుంచి ఇంటికి తిరిగి వస్తున్నాను. నాకు, సంతోషం, లోలోపలనుంచి ఉబుకుతోంది. నేను కూడా మామూలు మనిషిని అవుతానేమో! నేను, అందరిలాంటి మనిషిని కావాలన్నా, విపరీత పరిస్థితుల్లో ఉంటూ విపరీతంగా బతకాలన్నా, నాకు నేను చేసుకోవలసిందే గాని నన్ను

అటుగాని, ఇటుగాని, చేసేందుకు ఎవ్వరూ లేరని, నేను మంచిగాని, చెడ్డగాని నేనే ఊహించుకోవలసి ఉంటుందని, నా ఊహల ఫలితానికి నేనే బాధ్యుణ్ణీ, కర్తను అవుతానని నాకు అప్పుడు తెలియదు. అయినా ...ఏ ఆశకూడా ఊహించడానికే వీలుకాని పరిస్థితుల్లో ఉంటూకూడా, ఎందుకో, వారణాసి తాతగారు చెప్పినప్పటినుంచీ, నాకూ అనిపిస్తోంది... నేనూ అందరిలాంటి మనిషిని అవుతానని! ఏదో ఒక మాయశక్తి అలా చేస్తుందని నేను భ్రమించలేదు. కాని అవగలను అనే నమ్మకను గట్టిగా నమ్మినమాట మాత్రం వాస్తవం. ఆ వేళ చాలా మంచిరోజు అని అనుకున్నాను.

ఆశతో మానవుడు జీవించగలడు. ఆశ అనేది మానవుడిని కొద్దిక్షణాలుపాటైనా, స్వర్గంలో విహరింప చేయగలదు. అందుకనే, నిస్పృహంగా జీవితాన్ని గడుపుతున్న వారు కూడా ఆశను వదలరు. నామటుకు నాకు... నాకు అంతవరకు నాకీఅనుభూతి లేదు. ఆశే లేదు అసలు. మురికిపరిస్థితులకు అలవాటుపడిన నేను, వాటి నుండి ఎప్పుడూ దూరంగా ఆలోచించలేదు. ఆ మురికి వాతావరణమే నాకుఎంతో ఉత్సాహాన్ని సంతోషమును కూడాఇచ్చింది. ఒకమాటు, అవాతావరణానికిదూరంగా ఆలోచించగనే, ఆ మురికిపరిస్థితులు ఎంతో మరీ మురికిగా, అసహ్యంగా కనపడ్డాయి. ఎప్పుడు బయటపడి పోదామా అనికూడా అనిపించింది. నేను ఆ రోజు మంచిగా భావించాను. నేను పేకాటనుంచి ఏ రోజూ అంత 'జేబుఎత్తు'లో రాలేదు. జేబులోని చిల్లరడబ్బులు జంత్రిసంగీతాన్ని వినిపిస్తున్నట్లనిపించింది. నేను ఉషారుగా అరుగుమెట్లెక్కుతోంటే, అరుగుమీద ఎవరో దగ్గుతున్నారు. మెట్లెక్కుతోంటే నేల గరగరలాడింది. ఎప్పుడూ గరగరలాడుతునే ఉందిగాని, ఈ వేళ నాకా గరగరకనపడింది. మట్టిదట్టంగా పట్టింది. పిడిగోడలకు తెల్లరంగు వేశో శానాలేక మట్టికొట్టుకుతున్నట్లు చారికలు కట్టింది. ఇల్లు పాడుపడినట్లుంది గాని...ఎక్కడా...? ఎప్పుడూ ఇంటినిగురించి ఆలోచించనే లేదు. రాత్రి పొద్దుపోయి రావడం. దీపంవెలిగిస్తే వెలిగించడం. లేక పోతే...అగిపుల్ల గీసి, ఆ గప్పు గప్పువెలుతురులో మంచం వాల్చి పడుకోవడం. ఇంతే...

"ఎవరు?" అన్నాను.

"నేను."

గొంతునుబట్టి పోల్చాను. ఆశ్చర్యపోయాను రాత్రిపూట వావిలాల తాతగారు వచ్చారేమిటని నిర్ఘాంత పోయాను. ఒక్కక్షణంఉండి. "వెంటనే వస్తాను ఉండండి" అని ఇంటితాళంతీసి దీపంకోసం అగ్గిపుల్లగీసి చూశాను. ఒకమూల పడిఉంది. దాన్ని పరిఅయినస్థితిలో పెట్టి అటు,ఇటు కదిపిచూశాను దమురు ఉందా అనేదియుంతో! ఎక్కడా చుక్కకూడలేదు. ఓటికుండ! నిండుకుండ తొణకదు! అంతస్థితిపరుడు వావిలాల తాతగారు వచ్చి కాంతిలేని నాకొంప అరుగు మీద తొణకకుండా కూర్చున్నారు. నేనూ తొణక లేదు. ఆయన వెలుగుతున్న దేదీప్యమానమైన జ్యోతి. నేను తైలంలేని మసి మట్టికొట్టుకుతున్న హరికేన్‌లాంతరను. ఇదేమా ఇద్దరికీ తేడా!

"నా:వకొంప" అని గొణుక్కున్నాను. నిజంగా నేను అన్నదాంట్లో అబద్ధమేమీలేదు. దానిఅర్థం తెలుసుకోలేని అయోమయంలో ఉన్నానప్పుడు. వావిలాల తాతగారు ముక్కారు. చిరునవ్వు కూడా నవ్వి ఉంటారేమో! ఆ చీకటిలో నాకుకనపడలేదు తెలియలేదుకూడా. ఆయనఅన్నారు. "ఫరవాలేదు రా! కాస్త వెలుతురుగానేఉంది ఇవతల." ఆయన ఆదరణ, అభిమానం, మరీ బాధపెట్టింది అప్పుడు. గిలగిలా కొట్టుకున్నాను. నా హృదయాన్ని పీకుతున్నట్లనిపించింది. మానసికబాధ ఎప్పుడూ ఎరగను నేను. ఆయన ఇంకా ఇలా అన్నారు: "ఆడదిక్కులేని కొంప అలాగే ఉంటుంది. అయినా జాగ్రత్తగా ఉండాలి." నేను సిగ్గుపడ్డాను. నిజమే అనిపించింది. ఇంతవరకు నా ఇంటికి పెద్దలురాలేదు. కనుక నాఇల్లు ఎలాఉంచినా, లాంతరుకు తుడుపుమాపించకపోయినా, ఫరవాలేకపోయింది. సిగ్గుగానే ఇవతలకువచ్చి ఆయనదగ్గరగా కూర్చున్నాను. చీకటిలో ఆయన మొహం చూడగలిగాను. కాని అదే వెలుతురులో చేయలేనేమో అనిపించింది. వావిలాల తాతగారు అన్నారు అతినింపాదిగా.

"అదిసరేగాని అబ్బాయి! ఇల్లు బేరం పెట్టావుట. ఎంతవరకూ వచ్చింది?"

నేను మొదట కొద్దిగా సిగ్గుపడ్డాను. చీకటిని ఆసరాచేసుకొని నేను చెప్పదలచిన దేమిటో ఆయనకు చెప్పగలిగాను. ఎందుకో...ఇతరులదగ్గర మాట్లాడ గలిగినంత చనువుగా ఆయనతో మాటాడలేను. ఎవరో ...నా శ్రేయస్సు కాంక్షించే దగ్గరివారి దగ్గరి మాట్లా

డ్డానికి కలిగే తిడబాటు వస్తుంది నాకు ఆయన దగ్గర.

"అసలు ఇల్లు అమ్ముదా మనుకున్నాను ఉన్న ఆ ఎకరం నేల అమ్ముతే, చేసే దేమీ ఉండదని... ఈ ఇల్లు అమ్ముతే వంటూరా, ఎల్లాగో అల్లాగ ఉండొచ్చు అనిపించింది. కాని, ఇప్పుడు ఇల్లు అమ్ముదా మని కూడా లేదు. ఆ ఉద్దేశాన్ని మానుకున్నాను."

"ఏం?"

"వారణాసి శాస్త్రిగారు వచ్చి వద్దన్నారు."

"ఊ" అని బాగా గట్టిగా దీర్ఘం తీశారు. ఆ దీర్ఘం తీయడంలో వారణాసి శాస్త్రిగారంటే ఆయన కంత హితవు లేదన్నట్లనిపించింది. అసలు వారణాసి శాస్త్రి గారంటే నాకు మంచి అభిప్రాయం లేదు; ఊరిప్రజకూ ఉన్నట్లే. "లౌకికుడం"టారు. కాని ఆయన లౌకికం నా కర్థంకాలేదు. కాని తర్వాత వావిలాల శాస్త్రిగారు ఆ వదరంగపు ఎత్తును బోధపరిచేసరికి... ఎంతలౌకికం అని ఆశ్చర్యపోయాను.

"ఆయన ఇల్లుఅమ్మి డబ్బు తగలెయ్యమన్నారు." అన్నాను. కాని ఆయనచెప్పిన అదృష్టం సంగతి చెప్పలేదు.

"అస లెందుకమ్ముదా మనుకున్నావు?" అన్నారు.

"డబ్బుకే అనుకోండి. ఆయన కావలిస్తే డబ్బు ఇస్తానన్నారు. ఐదువందలు అడిగాను. రేపు ఇస్తానన్నారు."

"ఊరికే ఇస్తాడా ఆవారణాసాయన?" వావిలాల ప్రశ్నకు తికమకపడ్డాను.

నేను పళ్ళు ఇకిలించి "ఊరికే ఇస్తారటండీ... అంతడబ్బు?"

"అప్పుకే కదూ?...అప్పు మరి...ఎలాతీరుద్దా మనుకుంటున్నావ్?" అవును. ఎలా తీరుద్దామని? అనిపించింది నాకు.

"అందుకే అప్పుఇస్తుంట. నువ్వెలాగూ తీర్చ లేవు గనకనే, ఐదువందలు ఇస్తుంట. ఐదు వేలు ఖరీదు చేసేకొంప ఐదువందలకు 'కా' చేద్దామనుకున్నాడు. చిన్నవాడివి. ఈరోజుల్లో కాని లేనివాణ్ణి చిల్లిగవ్వకు కూడా మార్చలేరు. ఇది చెప్పిపోదామని వచ్చాను."

నాకు వావిలాల శాస్త్రిగారిమీద భక్తి గౌరవం ప్రతిఫలానికి పెరిగి 'మేక్సిమమ్'ను అందుకోవడానికి తహతహ లాడుతున్నాయి. నేను మనస్సులో సంతృప్తిగా నమస్కరించాను ఆయనకు. వారణాసాయనిది ఎంతపెద్దఎత్తు! ఎంతటికొంపలు తీసే లౌక్యం!!

"అసలు ఐదువందలు నీకెందుకు అబ్బాయీ!" ఏమీ మాటాడలేదు నేను.

"పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నావా?"

సిగ్గుతో "కాదండీ......పెళ్ళి కాదూ... నా మొహమూ కాదు. ఒక ఆరునెలలు ఊరు విడిచిపోదా మనుకుంటున్నాను."

"ఎందుకు?"

"ఊరికే... ఎందుకో... నాకు తిరగాలని ఉంది. అంతే."

"పోనీలే. అలాగే తిరిగిరా. తిరిగివచ్చి బాగు పడిన వాళ్ళు చాలామంది ఉన్నారు. నీవు అప్పుతీసు కోవడం నీ పరిస్థితికి మంచిది కాదు. పిలుపుబట్టి ఇల్లును అమ్మి వేయడమే ఉత్తమమయినపద్ధతి...నీకు కావలసిన ఐదువందలూ తీసుకొని ఏదో రెండెకరాలు కొనుక్కొని జీవనాధారం ఆయ్యాక కాలక్షేపం చేయొచ్చు దాంతో. అది మంచి పద్ధతిలా కనపడు తోంది."

ఆ రాత్రి అంతా వావిలాల శాస్త్రిగారు చెప్పిన సంగతులే ఆలోచించాను. వావిలాల శాస్త్రిగారే బేరాలు తీసుకువచ్చారు. ఐదు వేలు లోపుకు ఇల్లు అమ్మించారు. నా ఎకరం పొలానికి ప్రక్కనే రెండెకరాలు కొనిపించారు. అన్ని ఏర్పాట్లు అయిపోయాయి.

నేను ఆ నెల ఊళ్లు తిరిగాను. తిరిగినంత తిరిగాను. నా ప్రదక్షిణంలో నే శాకుంతలంతో పరిచయ మయ్యింది. అది ఒక వింతగా మా ఇద్దరికీ మైత్రి... కాదు ఒప్పందం ఏర్పడింది.

నేను ద్రాక్షారామాలయం దర్శించి రోడ్డుమీదకు వచ్చాను. పన్నెండు దాటింది. కాకినాడ బస్సు ఇంకా రాలేదు. నకనకలాడుతోంది. ప్రక్కనే బ్రాహ్మణుల భోజనహోటలు అని చిన్న బోర్డు కనిపించి లోనికి వెళ్ళాను. అది హోటలులా లేదు. ఏదో చిన్న కొంపలా ఉంది. పొరపడలేదు కదా అనుకున్నాను. ఒకముసలావిడ వచ్చి "కాళ్ళుకడుక్కో నాయనా!" అంది. ఎంత ఆప్యాయత! కాళ్ళు కడుక్కొని ప్రక్క వసారాలోకి

వెళ్ళాను. ముసలావిడ పనులు చేసుకొంటోంది. భోజనం విస్తరిలో వడ్డించి ఉంది క్షణంలో! ముసలావిడ అసాధ్యురాలనుకున్నాను. క్షణంలో వచ్చి క్షణంలో వడ్డించింది అని విస్తరి చూస్తూ అనుకుంటూంటే "కూర్చోండి" అని ఒక కంఠం, వసారాను అంటిపెట్టుకొన్న చిన్న గదినుండి సన్నగా వినవచ్చింది. నేను పరిషేచనం పట్టి కూర్చోవడానికి ప్రయత్నిస్తుంటే... గాజులు గలగల!.... పైకి చూశాను. పల్చగా, తెల్లగా పదిహేను లేక పదహేడేళ్ళ అమ్మాయి. ముసలావిడ కూతురనుకున్నాను.

"మీ అమ్మాయా...బామ్మగారూ" అన్నాను. బామ్మగారు సరిగా కూర్చుంటూ, "లేదు నాయనా, ఇదో పాట అయిపోయింది. భోజనం పెట్టి వ్రతం కథ చెప్పినట్లు చెప్పవలసివస్తోంది." నేను నవ్వుకున్నాను. "ఈ బామ్మగారు గట్టిదే" అనుకున్నాను. నేను నవ్వుతూనే "అదేమిటి బామ్మగారూ, అలా అంటున్నారు. అసలు జరిగిన కథేమిటి?" అన్నాను.

"అది కాదు నాయనా! నాకు అలవాటు అయిపోయిందిలే! ఇది మామూలే. నేను వండి పారెయ్యడం శాకుంతలం వడ్డించడం. వచ్చినవాళ్ళు తింటూ ఈ అమ్మాయి ఎవరంటే నేను కథ చెప్పడం. ఇదీ సంగతి." శాకుంతలం ఆ అమ్మాయి పేరని తెలిసింది. శాకుంతలం నవ్వింది. గవ్వలు తిరగబడినట్టు స్వచ్ఛంగా తెల్లగా నవ్వింది. శాకుంతలం నవ్వినప్పుడు చాలా బాగుంటుందన్నమాట! నాకు నవ్వు అంటే చాలా సరదా! ఎప్పుడూ ఓడిపోయిన జీవాల్లా పడివుండడం నాకు బాధ! నాకు ఎదుటివాళ్ళు నవ్వుతుంటే చూడాలని బుద్ధిపుడుతుంది. అసలు నవ్వు విషయం వస్తే వానిలాల తాతగారు ఎంతో ఆరోగ్యంగా నవ్వుతారు. ఎదుటివారి బాధలను మరిపించేటట్లు నవ్వుతారు. ఆ నవ్వు సుడులు తిరిగేది. ఫక్కున నోరు పెద్దది చేసుకొని నవ్వగలరు. ఫకాలున నవ్వుతారు, నవ్వు ఆరోగ్యమైందే. అది నేర్చుకుంటే వచ్చేది కాదు. అది స్వతహాగా రావలసిందే. కొందరు నవ్వుతూ పెద్ద గొడవ చెయ్యరు. సుడులు, మెలికలూ తిరిగిపోరు. కొందరు నవ్వుతారు. అబ్బ! వాళ్ళ నవ్వు యమ రోతగా ఉంటుంది. వాళ్లు మెలికలు తిరగడమే కాకుండా ఎదుటవాళ్ళను కూడా మెలికలు తిప్పుతారు. అది భరించడం చాలా కష్టం. కొందరు చాలా నిశ్శబ్దంగా నవ్వుతారు. ఆ నవ్వు ఎదుటి వాళ్ళకు మూగ ముద్రవేస్తుంది. తేనెలా ఉంటుంది. వెన్నెలకంటె మెత్తగా వుంది. వెన్నెలకంటె హాయి. ఏమీ తెలీని పాపకు నవ్వే - నవ్వు అది. అనుభవించగల సమర్థులకే తెలుస్తుంది. శాకుంతలం అట్లాంటి నవ్వు నవ్వింది. అందుకే, ఎందుకో నాకూ అనిపించింది. బామ్మగారు కథ వినకుండానే నేను అనుకున్నాను. శాకుంతలం, శాకుంతలంగా గాక, నా శాకుంతలం అయితే...! ఈ ఆలోచనలో పచ్చడి అన్నంలో కూర కలిపాను. శాకుంతలం ఫెళ్ళున నవ్వింది. తల ఎత్తి చూశాను. ఏమిటి కొంగు నోట్లో కుక్కుకుంది. చెమట బిందువులు చెదరి అతికించినట్లు ముత్యాల్లా వేళ్లాడుతున్నాయి, ముంగురులు అద్దంమీద పడిన మరకల్లా చిందరవందరగా, ఆ గాలి లేనికొంపలో, అలా నిశ్శబ్దంగా పడివున్నాయి. ఆ ఫెళ్ళున నవ్విన శాకుంతలం నవ్వు పాటపాడినట్టుంది. అది నవ్వు అనిపించలేదు. చిన్నప్పటినుంచీ ఏకాకిగా, దుర్భర వాతావరణంలో పెరిగిన నాకు, ఇల్లాంటి నవ్వు కావాలి అది నాకు స్వర్గంకంటె ప్రియమైంది. మధురమైంది. వెంటనే కారణం తెలుసుకున్నాను. శాకుంతలం నవ్వడానికి గల కారణం. వెంటనే నేనూ పక పక నవ్వాను. నేను, నా నవ్వును, శాకుంతలంలా ఒక్కమాటు ఆపుచేయలేకపోయాను. బామ్మగారు విస్తుపోయి, చూస్తూ కూర్చొంది. విషయం తెలుసుకొన్న బామ్మగారు బోసి నోరు విప్పి నవ్వారు. ఆవిడ నవ్వు కిసకిసలాడింది. శాకుంతలం కళ్లు కిలకిల మెరిశాయి. విషయం ఏమంత పెద్దది కాకపోయినా, నా పొరపాటుకే అయినా, ఇంత ప్రళయం తెచ్చిపెట్టిన ఆ చిట్టి సంఘటన ఎంతో విలువైనది. ఈ నవ్వుకు భాష్యాలు ఎవరూ అని తర్కిస్తే ఎవరూ కారు. ఇందులో! శాకుంతలం నవ్వకపోతే నేను ఆ పొరపాటు చేసిఉండేవాడిని కాను. బామ్మగారు చెప్పే తీరుకు శాకుంతలంకు నవ్వు రావడం ఆశ్చర్యంకాదు. నేను అడక్కపోతే బామ్మగారు కథ మొదలెట్టరు. శాకుంతలంను చూసినవారు, ఈ అమ్మాయి ఎవరూ? కథేమిటి? అని అడక్కుండా ఉండలేరు.

"ఏమయింది బామ్మగారూ" అని విషయం తిరగతోడాను. నా కలుపుగోలుతనంతో బామ్మగారికి నా మీద ఒక మంచి అభిప్రాయం ఏర్పడ్డది అనుకున్నాను. ఆవిడ నాతో మాట్లాడేవిధం చూస్తే నే

వంటే ఆమెకు ఇష్టంలాగే కనపడింది. అదీ తిరిగి మొదలుపెట్టింది... "అదికాదు అబ్బాయీ అంటూ!"

"అసలేం జరిగిందనుకున్నావు. ఒకమాటు... ఆయన పోయిన కొత్త... ఆయన...! ఆయనకేం మహారాజు! వెళ్ళిపోయారు. పదిమందిచేత ఔను అనిపించుకున్నారేగాని వేలెత్తి చూపించుకోలేదు. నేను ఒక్క ముండని నాకు ఎవ్వరూ లేరు ఇరుపొరుగు వాళ్ళు! ఏదో ఎదురున్నవాళ్ళకి సలుకరకు వచ్చిస్తే నాపాట్లు ఇక్కడ చూడరు. ఒకమాటు ఇప్పటికి నాలుగా... కాదు మూడేళ్లు అవుతుంది. బాగా మధ్యాహ్నం అయ్యింది. నా భోజనం అయిపోయింది. వీధితలుపు వేసి పడుకుందామని లేచాను. ఇంతలో ఈ అమ్మాయి వీధిలో నిలబడ్డది. తిండితిని ఎన్నాళ్లయిందో. చిక్కి సగమయ్యింది. వీళ్లది కృష్ణాజిల్లాట. ఎక్కడికెళ్లో చూడు. "ఏంపిల్లా!" అన్నాను. 'దాహం' అని నీరసంగా అంది. లోపలకు రమ్మన్నాను. లోపలకు వచ్చింది. ఇంత మజ్జిగ పల్చగా చేసి ఇచ్చాను. ఏ ఊరు మీది, ఏమిటన్నాను. వాళ్లూ మనవాళ్లే గోత్రానికి...శాఖకి. ఏ మొక్కు, పాడు... వైష్ణవులకు భోజనం పెట్టడం లేదా? ఆకులు ఎత్తడంలేదా? ఏ వెధవో బ్రాహ్మడని వస్తే చేసేదేమిటి? అవన్నీ పట్టించుకుంటే ఎలా? ఎవాడు ఏ పూజ చేసాడో... అన్నం అమ్మకోని బ్రతికవలసి వచ్చింది. వెధవ బ్రతుకు. ఎవరికీవద్దూ ఈ బ్రతుకు. ఆ వేళ ఇంత అన్నంపెట్టి రెండురోజులుండమన్నాను. రెండు రోజులు తర్వాత తన కథ చెప్పింది. ఏముంది, వెధవకథ!... చిన్నప్పుడే భర్త పోయి... తోబుట్టువులింట్లో ఉండలేక... దేశదేశాలు ఈ చిన్నవయస్సులో ఇలా తిరిగింది."

"ఏమిటే. పెళ్లయిందా?"

"ఆ...అన్నీ అయ్యాయి. నిప్పులు!" నేను ఏమీ, మాట్లాడలేదు. బామ్మగారు చెప్పింది వింటున్నాను.

"రెండు రోజులయ్యింది. శాకుంతలం అంటే నాకూ జాలే. కాని ఏంచేయను. ఈ దిక్కుమాలిన రోజుల్లో... నా పొట్టేగడవడం కష్టమయితే... చేవంటావా... ఏదో మడినా... దచ్చినా... ముసలిముండను. ఇదో బ్రహ్మత్తి, నా కెందుకని... అమ్మా! నీ దారి నీవు చూసుకో... అన్నాను. శాకుంతలం కళ్లు చెమ్మగిల్లాయి. వెర్రిపిల్ల! బావురుమంటూ చూసింది. ఆ చూపు భరించలేకపోయాను. ఇంకా నాకు జ్ఞాపకం. ఏం చేయను? చుట్టు పక్కల వాళ్లంతా అన్నారు. "మీకూ పిల్లా, పాపా లేరు. ఏదో చేరదియ్యండి" అన్నారు. ఎందుకన్నారో అన్నారు. ఉండమన్నాను నేను కూడా. ఎంత సంబరపడిపోయిందో! క్షణంలో అడ్డెడు గిన్నె దింపింది. అదేమిటో, ఆవేళ అంతా పాడు చేసింది. అన్నం చిమిడ్పింది. పులుసు తగలబెట్టింది పచ్చడి నలగలేదు. కూరలో ఉప్పెక్కువ. వెర్రిపిల్ల అంత సంబరపడింది."

"కాని నాయనా! ఇవి విచిత్ర రోజులు. పుణ్యానికి పోతే పాపం ఎదురౌతుంది. కాలం మనదికాదు. ఏ వాడూ ఎవరిచేతా ఇంతమాట పడలేదు. కాని... అల్లాటిది... నాది వెధవజన్మ నాయనా!" భోరుమంది. శాకుంతలంకూడా దిగాలుపడింది కళ్ళనీళ్ళు పెట్టుకుంది. నేను చేయికడుక్కొని సావిడిలోకి వచ్చాను. శాకుంతలం వెంటనే విస్తరితీస్తోంది.

"అదేమిటి బామ్మగారు. అంత ఇదవుతున్నారు" అన్నాను చేయి తుడుచుకుంటూ.

"అదికాదు నాయనా, అన్నా చెల్లెళ్ళ అనుమానించే రోజులివి. నన్ను అపార్థం చేసుకొన్నారు. నా వామాటలూ విన్నాను రామ రామ! ఈ ముసలిముండ ఎంతపనైనా చేస్తుందన్నారు దీన్ని వ్యాపారానికి తీసుకొచ్చావన్నారు. అవసరమేమిటే నన్ను... పలుకరు, ముగ్గురు అడిగారు. "బామ్మగారి కంఠం క్రమంగా జీర అవుతోంది" వాళ్ళని చివాట్లు వేసాను అనుకో. శాకుంతలం మంచిపిల్ల. నన్ను అంటేఅన్నారు. ఏమీ తెలియని అమాయకురాలైన శాకుంతలను అనడం నిజంగా దురంతమే. కాలం తగలబడుతోంది అంటే అందుకే. రుచిలేని నోరుకు ఓరికాక మరేమిటి? పాపం పండుతోంది. అందుకే ఆ భీమేశ్వరతండ్రి మౌనంగా సహిస్తున్నాడు. దాన్ని కూడా ఆవేశం అన్నారు. చెడు తిరుగుళ్ళు తిరిగి వచ్చిందన్నారు. సహించాను ఓర్చాను. అది చెడిపోయినా... కులం తక్కువయినా... ఏమయినా ఇప్పుడు దాన్ని పొమ్మన లేను. ఇంతవరకూ ఉంచుకోలేదా? తెలిసో, తెలియకో ఎందుకో ఒప్పుకున్నాను. అంతే నా గొంతులో ప్రాణం ఉన్నంతవరకూ అదినాతోటే ఉంటుంది. అది అమాయకురాలు. లోకం గుడ్డిదైనా, ఆ భీమేశ్వరుని కంతా తెలుసు." బామ్మగారు చెపుతోంటే వింత

కథ వింటున్నట్టనిపించింది. ఆవిడ సహనానికీ, ధైర్యానికీ విస్తుపోయాను. ఎందరో దేశసేవకులూ... త్యాగధనులూ ఉన్నారంటారు. ఈ మూలన ఉన్న ముసలమ్మ వాళ్ళ సేవకంటే, త్యాగంకంటే గొప్పది. ఆమెకు మనస్సులో నమస్కరించాను ఇంకా ఆవిడఅంది...

"ఒకరోజు రాత్రి శాకుంతలం లేపింది నన్ను. ఇదేమిటని చూస్తునకదా...ఏడుస్తోంది. ఎంతసేపటి నుంచి ఏడుస్తోందో! "నాకు తెలిసినంతవరకూ నేనే తప్పూ చేయలేదు. నన్ను అన్యాయం చేయకండి" అంది. పిచ్చితల్లి! నాకు నిజంగా దుఃఖంవచ్చింది. సముదాయించడానికి తాతలు దిగివచ్చారు. మరో మాటు వెళ్ళిపోతానంది. అదేమంటే నేను అనవసరంగా బాధపడుతున్నానట. బాగానే ఉంది. అదెక్కడ బాధపడుతుందోనని నేను బాధపడుతోంటే, నేనెక్కడ బాధపడుతున్నానో అని అది బాధపడుతోంది. ఇదీ కథ నాయనా! మా బ్రతుకులు దుఃఖమయం. చిన్నవాళ్ళుకూడా మనసులు పాడుచేసుకుంటారు" నేనుకూడా విచారించాను. "శాకుంతలం ఎంతమంచిది!" అనుకున్నాను.

మధ్యాహ్నం మూడుగంటలదాకా, ఆ కబురూ, ఈ కబురూ చెప్తూ అక్కడే ఉన్నాను. సరే మధ్యాహ్నం మూడు గంటలకు బస్సుస్టాండ్‌కు వెళ్ళి బస్సులో కూర్చున్నాక జ్ఞాపకం వచ్చింది, తిండికి డబ్బు లివ్వలేదన్న సంగతి. వెంటనే కారుదిగి ఆ ఇంటికి వచ్చాను. బామ్మగారు లేరు. శాకుంతలం ఉంది. నన్ను చూసి కందగడ్డ చేసుకొంది మొహం. అభిమానపడింది. ఖంగారుపడి:

"మీరా!" అంది.

"అవును. డబ్బు లివ్వడం మరిచాను. బామ్మగారేరి?"

"అలా మార్కెట్టుకు వెళ్లారు." అబ్బా! ఇంగ్లీషు మాటలు వదులుతోంది!

"ఇంగ్లీషు కూడా చదివావా?"

నవ్వింది. బుగ్గలు సొట్టలు పడ్డాయి. చక్కగా ఉంది మొహం నవ్వుతూ.

"ఏవో హోటలుమాటలు వస్తాయి. అంతే."

"బామ్మగారు ఏమనుకున్నారు?"

"ఏ విషయం?"

"డబ్బులు విషయం!"

"నిజం చెప్పకపోవడమే. నేనేమీ అనుకో లేదు నాయనా! శాకుంతలమే అనుకొంది. ఇల్లాగే ఉంటారు మనుష్యులంది. ఎంతో జాలిగా కనపడుతున్నట్టుంటారు. లోపల అంతా మారు ఎత్తులే అంది. నిన్ను తప్పుగా అర్థం చేసుకొంది" అంటూ వెనకనుంచి బామ్మగారు వచ్చారు. వెనక కూరల బుట్టవాడికి కూలి ఇచ్చి పంపించివేసింది. శాకుంతలం పశ్చాత్తాప పడుతున్నట్టు చూసింది. ఇంతలో బస్సు "హారన్" కొట్టుకుంటూ తుర్రుమంది.

"అరే ... బస్సుపోయిందే" అనుకున్నాను. "ఇంకో బస్సు ఎన్నింటికో?"

"ఇక సాయంత్రమే. లాస్ట్ బస్" అంది శాకుంతలం.

"అయితే చచ్చామే. ఎలాగ ఇప్పుడు?"

"పోనీ తెల్లారకట్ల బస్సులో పోదువుగానిలే" అంది బామ్మగారు. అంతే చేయండన్నట్లు చూసింది శాకుంతలం. అంతే చేసాను.

బామ్మగారు చెరువుకు వెళ్లారు. శాకుంతలం సావిడిలో ఉంది. నేను చొక్కా తీసి తగిలిస్తుండగా వెనకనుంచి ఆమె అంది "నన్ను క్షమించండి."

విస్తుపోయాను. అమాయక శాకుంతలం! నేను వంగి ఆమె తలను చూస్తూ అన్నాను. "ఇందులో క్షమించడానికేముంది శాకుంతలం. నువ్వు చక్కటి ప్రొప్రయిటర్‌వి. నేను మెచ్చుకుంటున్నాను."

అంతవరకు తదేకదీక్షగా నేలను చూస్తున్న శాకుంతలం ఈ మాటలువిని తలెత్తి నాకళ్ళను చూసింది. నా కళ్ళు ఎందుకో చెమ్మగిలాయి. శాకుంతలం అంది. "మీరు మంచివారు." నేను ఉప్పొంగిపోయాను. శాకుంతల పరాయిపిల్ల అనే భావనపోయింది. ఇదివరకటినుంచీ శాకుంతలంకు నాకు బాంధవ్యం వుందనిపించినట్లనిపించింది. నా కళ్ళు నాకు తెలియకుండా అశ్రుపూరితాలయ్యాయి. నాలో నేను ఆవేశపడ్డాను. శరీరమంతా దడగా తొట్రుపాటుతో నిండిపోయింది.

"నిజంగా; శాకుంతలం! నేను నీకు కృతజ్ఞుణ్ణి" అంటూ తల నిమిరాను. ఇంత సన్నిహితం ఏర్పడు

ఉండవని నేను ఊహించలేకపోయాను. శాకుంతలం చారికలు కట్టిన కన్నీళ్ళతో అంది...

"మీ పేరు తెలియదు. ఊరు తెలియదు. ఎవరు మీరు... ఏమో... నన్ను అపార్థం చేయకండి." కరిగిపోయాను. ఆ మాటలు, కరుణకై పలికిన తీరు, నన్ను పూర్తిగా కదలించివేసినై. నేను పూర్తిగా ఆమెకై పరితపించాను. చెడుభావన నాకు ఆమె యెడ కలుగలేదని ఎప్పుడూ చెప్పగలను. ఆమె అమాయికత నన్ను గిలగిల్లాడించింది. ఏమీ చెప్పలేక "శాకుంతలం.." అని కాస్సేపాగి, "అందుకు నీకు హామీ ఇస్తున్నాను." అన్నాను. శాకుంతలం మరి మాట్లాడలేదు. నా జీవితం కొత్త పుటలు ప్రారంభించింది.

ఆరాత్రి ఆరుబయట మంచంమీద పడుకున్నాను. ఆలోచించాను. వెంటనే, మెరుపులా... శాకుంతలం విధవ! ఈ తలంపు నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది! సదమదమయ్యాను. మంచంమీదనుంచి లేచి చొక్కా తొడుక్కొని రోడ్డుమీదపడ్డాను. విశాలమైన ఆ చెరువుకట్టకు వచ్చి కూర్చున్నాను. వెన్నెల కిలకిల్లాడుతోంది. ఆ చెరువులోని తెల్లటి నీళ్ళపై ప్రసరించి. తామరలు ధగధగ మంటున్నాయి. ఎదురుగా భీమేశ్వరుని ధ్వజస్తంభం గంటలు గణగణలాడుతున్నాయి. ఊరు ప్రశాంతంగా నిద్రపోతోంది. నేను ఒక్కణ్ణి! ఏకాకిగా...నిర్మలాకాశం క్రింద....ఈశ్వరాలయం ఎదుట ఆలోచిస్తున్నాను...నా జీవిత సమస్యను ఈ విషయం తేల్చుకోవడం ఎలా? ఆమె విధవ! విధవనా పెళ్ళాడ్డం? విధవనా? అనుకున్నాను. వెనక ప్రజ గొంతెత్తి పకపకమంటోంది. వావిలాల తాతగారి కంఠం ఖంగుమంది. వారణాసాయన ఓరగా వెక్కిరిస్తున్నట్లు కనపడ్డాడు. మరికొంగా బతికిన నేను మరికొని గాక జవాబని పులుముకుంటానని హేళనగా, నిష్కర్షగా, కఠినంగా, చెవులుపగిలేటట్లు హృదయం గాయపడేలా, అభిమానంతో చచ్చేలా, వెక్కిరింతగా పదేపదే అంటున్నారు. నిశ్చలంగా, నిర్మలంగా ఉన్న నీటిని చూచి అసూయపడ్డాను. వెంటనే ప్రక్కనున్న చిన్న రాతిముక్కను విసిరాను. అది తుఫానును లేవదీసింది. ఇలానే ఏమో శాకుంతలం నిర్మల జీవితాన్ని కలిచివేస్త అనుకున్నాను. అంతవరకు నిర్మలంగా, ఏదో సాక్షిగా వెడుతున్న ఆమె జీవితాన్ని కలచి వెళ్ళిపోవడం మంచిదా? శాకుంతలాన్ని మోసపుచ్చడం చేనా? దగాకోరు అనుకోదు? మాట ఇచ్చానే పెద్ద ఉదారుడిలా! అంత మంచి అమ్మాయిని మోసపుచ్చ చేనా? ఆమె జీవితాన్ని గిలిగింతలు పెట్టి బాధపెట్టి గాయంచేయడానికా నేను వచ్చి ఇక్కడికి? బామ్మగారి పాటి ఇంగితం నాకు లేదా? చెరువు మళ్ళీ తన ప్రశాంతతను తను తెచ్చుకొన్నది. మంచో, చెడో... ఒకసారి మాట ఇచ్చాక వాపసు చేసుకోవడం శాకుంతలం అన్న "మంచివారి" లక్షణం కాదు. నా పేరు తెలియదు. ఊరు తెలియదు. కనీసం ఎవరినో తెలియదు. అన్నీ తెలిసి, మాట యిచ్చి, మోసగాడిలా అపార్థం చేయడం మంచిది కాదనుకున్నాను. ఈశ్వరునికి నమస్కరించి వెనక్కు మరలాను సంతృప్తిగా!

బామ్మగారు ప్రశాంతంగా నిద్రపోతున్నారు. అరుగు మీద. ఆమెకు సుఖం అంటే తెలుసా? అనిపించింది! ఇతరుల కోసం పుట్టినట్టుగా ఆమె పుట్టి ఇతరులను మేపి తను ఇంత ముట్టే కావలసినదేనా? కొందరి జీవితాలు అంతేనేమో! అదె! శాకుంతలం అలానే కూర్చుంది ఇంకా! నేను మంచం చేరగనే ఆమె లేచి నుంచోంది. తెల్ల చీరకట్టిన శాకుంతలం ఆ వెన్నెల్లో లీనమైంది.

"ఇంకా నిద్రపోలా!" అన్నాను.

"లేదు పంతీ మరిచి వెళ్ళిపోయారేమో! అనుకున్నాను" అంది. శాకుంతలం మాటకారి కూడాను. నేను నవ్వాను. వెంటనే కోపం వచ్చింది. "ప్రతి దానికీ ఇలా అనుమానిస్తే కష్టం" అనుకున్నాను. కాని కొంచెం ఆలోచించాక శాకుంతలం అనుమానపడడంలో తప్పేమీ అగుపడ లేదు నిజంగా! నేను అనుకొన్నాను కాదా? వెంటనే స్థిమితపడి "ప్రతి చిన్న విషయాన్ని అనుమానిస్తావేం శాకుంతలం? అంత దగాకోరునా?" శాకుంతలం మాట్లాడలేదు. దగాకోరో కాదో, ఒక్క పూటలో ఆమెకేం తెలుస్తుంది? ఇంతలో బామ్మగారు లేచారు "ఏం కావాలంటూ" "ఏమీ అక్కరలేదు పడుకోండి" అన్నాను.

తెల్లారకట్ల బస్సులు అరుస్తున్నాయి. లేచాను. బామ్మగారు లేచి అప్పుడే పనీపాట చూసుకుంటున్నారు. పావిడిలో శాకుంతలం ఇంకా బద్ధకంగా అటూ ఇటూ దొర్లుతోంది. ఆ దీపం గుడ్డివెలుగులో ఆమెను చూశాను నిర్మలంగా ఉంది. ముంగురులు చెదరినముఖాన అద్ది

దిద్దంగాపడి మరీ అందంగా ఉంది. అమాయికపు పిల్ల! నా శాకుంతలం!! నాలో ఏదో ప్రభావం ప్రకోపించింది. నేను పెదవులతో... శా! ఆమెను లేపాను. శాకుంతలం అదిరిపడి లేచింది. 'ఏరా!' అంది. బుఱ్ఱ ఊపాను. శాకుంతలం కోపంగా చూసింది. ఫరవాలేదన్నట్లు సమాధాన పరచబోయాను. వెంటనే "క్షమించు రా! తెలియక చేశాను" శాకుంతలం తెల్లగా నవ్వింది. "మనకున్నదేగా'' అంది వత్తిగిలి. నేను ఉప్పొంగిపోయాను ఆమాట విని. ఎన్నాళ్ళనుంచో మైత్రి ఉన్నట్లుంది...పిచ్చి రా!,

"ఏం శాకుంతలం...మరి నే పోయి వచ్చేదా!" అన్న వెంటనే అమాంతం లేచికూర్చొంది. బెంగగా చూసింది. అనుమానంగా చూసింది. జాలిగా చూసింది. వింతగా చూసింది. చీదరింపుగా చూసింది. కోపంగా చూసింది!

"అది కాదు శాకుంతలం...నాలుగు రోజుల్లో వస్తాను. వచ్చి నిన్ను తీసుకువెళతాను."

ఎక్కడికీ అనలేదు. నా పేరు అడగలేదు. మాటాడలేదు. ఇంతలో బామ్మగారు వచ్చారు. వస్తానని చెప్పి వీధినిబడ్డాను. నన్ను చూస్తూ దిగాలుగా నిలబడ్డది శాకుంతలం నేవెళ్ళిపోబోతున్నాను. నామతి మఱుపు తిరిగి మరొక్కసారి ప్రదర్శించాను.

"డబ్బులు" అంది శాకుంతలం. బామ్మగారు కిసకిసలాడారు.

"తగదానికే. ఆ అబ్బాయికి!" అంది బామ్మగారు. అనాలని అనలేదు ఆవిడ. అప్రయత్నంగా అంది. నేను పకపక నవ్వాను. శాకుంతలం ముసిముసిగా నవ్వింది. డబ్బు లిస్తూ "బామ్మగారూ...బుధవారం వస్తాను తిరిగి" అన్నాను శాకుంతలంకు తెలిసే ఉద్దేశ్యంతో. "పోయిరా నాయనా!" అంది. వెళ్ళిపోతున్నాను. "ఇదో...చూడండీ...గొడుగు మరిచిపోయారు." అంది. అవును. తిరిగి గొడుగు పుచ్చుకొన్నాను. గొడుగుతో బాటు రంగులమతి విసనకర్ర నిచ్చింది చిన్నగా బామ్మగారికి కనపడకుండా నాకంటె తెలివైందనుకున్నాను. శాకుంతలంకు ఏమి తిరిగి ఇవ్వాలో తెలిసిందికాదు నాకు. వెంటనే నా పెదవులను చూపించాను నీకు మొదటే ఇచ్చానన్నట్లు. శాకుంతలం నవ్వింది. ఆ విసనకర్రనైనా మరిచిపోగలను గాని ఆనవ్వును మరువలేను. శాకుంతలం మొహం ఇంత చేసుకొని పవిట కొంగు నోట్లోకి తెచ్చుకొంది!

కార్లోకూర్చొని ఏదో ఆలోచిస్తూ విసనకర్ర విప్పాను. దాన్నిండా బొమ్మలు—రంగు రంగులలో గజిబిజిగా ఉన్నాయి. కండక్టరు నాపై ఛలోక్తి కూడా విసిరాడు. "పంతులుగారికి ప్రొద్దున్నే ఉక్కగా ఉందిలా ఉంది" కార్లోని జనం పకపకమన్నారు. బుఱ్ఱ ఊపాను సమాధానంగా. వాళ్ళకి ఇష్టమయిన జవాబు అవుతుంది అది! ఒకమూల చిన్నగా వ్రాసి ఉంది. "శాకుంతలం—ద్రాక్షారామ" నాలో నేను నవ్వుకున్నాను. అన్నవరం అది తిరిగి బుధవారం మధ్యాహ్నానికే ద్రాక్షారాము తిరిగి వచ్చాను. శాకుంతలం ఎదురుచూస్తోంది. నన్ను చూసి నవ్వింది. నేనుకూడా నవ్వాను హాయిగా!

ఆ వేళ మధ్యాహ్నం భోజనంచేసి సావిడిలో మేనువాల్చాను. బామ్మగారు కూడా మగతగా నిద్రపోతున్నారు. నేను మెల్లిగా వసారాలోకి వెళ్ళాను. శాకుంతలం పనిచేసుకుంటోంది. నన్ను చూసి ఏమిటేది?" అంది. దానికి అర్థం బామ్మగారు చూస్తారు. ఏమిటా సాహసం అని.

"ఏమీ లేదు ... బామ్మగారికి చెప్పుతాను" అన్నాను.

"ఏమని?" శాకుంతలం వెర్రిగా ప్రశ్నించి అమాయకంగా నోరు తెరిచింది.

"నిన్ను తీసుకెళతానని!"

"నాకేం తోచకుండా ఉంది. మీ ఇష్టం..." శాకుంతలం ఎక్కడికీ కదలేదు. నా ఉద్యోగం ఏమిటి? ఊరేమిటి? ఇలాంటి ప్రశ్నలను వేయకపోవడం నాకు నిజంగా ఆశ్చర్యం కలిగించింది. నేను హాయిగా చెప్పాను. నేనూ ఆవిషయాలు ప్రస్తావించలేదు. సమయం లేక ఈ ప్రసక్తివచ్చి ఉండదనుకున్నాను.

నేను సావిడిలోకివచ్చాను. బామ్మగారు ఇంకా నిద్రపోతూనే ఉన్నారు. నేను బెంచీమీద నడుం వాల్చి ఏమని చెప్పాలో, ఎలామాట్లాడాలో ఆలోచిస్తూ కూర్చున్నాను. శాకుంతలం ఆందోళనగా ఉంటుందనుకున్నాను. ఒక గంటపోయాక బామ్మగారు లేచారు.

"బామ్మగారూ..." అన్నాను.

"ఏం నాయనా?" అంది అనిష.

"ఏంలేదండీ" అని మొదలుపెట్టాను. శాకుంతలం భయంగా, బిక్కుగా, దొంగగా తలుపుచాటునుంచుని వింటున్నదని నేను కనిపెట్టాను.

"మీ శాకుంతలంవంటివాడనే నేనూను. నాకూ, తల్లీ, తండ్రీ లేరు. నేను ఒక్కణ్ణి. నాకు మూడెకరాల ఆస్తి ఉంది. ఇందులో అబద్ధమాడవలసిన అవసరం నాకు లేదు. మనం ఒక్కొక్కప్పుడు, మనకు బుజావులు, పాశాలు, సంపన్నాలు లేకపోయినా, ఇతరులను నమ్మవలసి వస్తుంది. మీరు శాకుంతలాన్ని కన్న కూతురులా చూసుకుంటున్నారు. ఆమె స్థితిగతులు చెప్పారు. అన్నీ ఆలోచించాను. మీ అభ్యంతరం లేకపోతే..."

ఒక్క క్షణం తత్తరపడి, వెంటనే సమాధానపడి "నేను అనుకున్నదే నిజం—అయినా, ఇందులో నా ప్రమేయం ఏమీ లేదు. అంతా దానిఇష్టమే. కూతురుకూడా శాకుంతలంలా ఉండేదని నా నమ్మకం. శాకుంతలమును నేను ఎప్పుడూ పొమ్మనలేదు. పైగా నేను చెప్పనవసరములేని, పిల్ల, శాకుంతలం"

శాకుంతలం కంట తడిపెట్టింది. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా విచారమును సూచించే ఎక్కిళ్లు. ఉచ్ఛ్వాసనిశ్వాసాలుఆమెవద్దనుంచివినపడ్డాయి. ఆమె భరించలేక ఒక్క ఉదుటునవచ్చి ఆమె కాళ్ళమీద వ్రాలింది. "ఏమిటే శాకుంతలం? ఆలోచించావా? నాకూ...ఎందుకో అనిపించింది. ఈ అబ్బాయి కొంత మర్యాదస్థుడని. అయినా, ఒకటే చెప్పతున్నాను విను. నువ్వేదిచేసినా, ఆ భీమేశ్వరునిమీద నమ్మిక ఉంచి చేయి. నువ్వెక్కడున్నా, ఏ పరిస్థితిలో ఉన్నా, నీ బామ్మను చూడాలంటే, కాకితో కబురు చేయి. నీకోసం...ఎప్పుడూ బామ్మ ఆలోచిస్తుందనుకో" బామ్మగారి కళ్ళు నీళ్ళతో నిండాయి. శాకుంతలం ఏమీ మాట్లాడలేకపోయింది!

ఆ సాయంత్రం షికారుకు పోబోతున్న నన్ను ఆపింది బామ్మగారు. ఆమె చాలా తీక్షణంగా ఉంది. ఆమె వ్యవహారికంపట్ల, అవసరమయిన కటువును కలిగి ఉంటుందని నేను అప్పుడు అనుకొన్నాను.

"ఇలా రా ఒక మాట." కొద్దిగా తీక్షణంగా అంది. దగ్గరగా వెళ్ళాను. నన్ను అడిగింది నిలదీసి.

"అబ్బాయీ! పరిస్థితి ఆలోచించావా? లేక సహజమైన పురుషవ్యామోహమేనా? ఆమె వి;వ. వి;వ అని మరిచిపోకు ఆమె మొగుడు వచ్చిపోయాడు. కాపరంచేసి పోయాడో, ఆమె కన్యగా ఉన్నప్పుడు పోయాడో మనకు తెలియదు." ఈ మాటలు ఆమె అంటూంటే నాకు ములుకుల్లా తగిలాయి నేను భరించలేక పోయాను. క్షణకాలంపాటు తత్తరపడ్డాను. వెంటనే నాలో నేను సమాధానపరుచుకున్నాను. మానవ దౌర్బల్యానికి దిగుతున్న నేను ధైర్యాన్ని పుంజుకొని స్థైర్యంగా...

"బామ్మగారూ...నన్ను అనుమానిస్తున్నారా?" అన్నాను బాధగా.

"ఎందుకు కూడదు?" తార్కికంగా అడిగిన బామ్మగారికి సమాధానం చెప్పలేదు. ఆమె అంది. "నువ్వు అలా చేస్తావని కాదు నేను చెప్పేది. ఆడదానికి అన్యాయం తలపెట్టడం ఒక ఘనకార్యం కాదు. శాకుంతలం మంచిపిల్ల. శాకుంతలంను నమ్ము. ఆమెకు అన్యాయం తలపెట్టకు. బాగుపడతావు. నేనా...! రోజు రోజుకూ నా దారుఢ్యంకూడా సన్నగిల్లుతోంది. నేపోయిన తర్వాతయినా ఎవరో ఒకరు చూడవలసిందే కదా. పైగా...ఇది అప్రయత్నంగా ఏర్పడిన సంఘటన. ఇది పూర్తిగా ఆ భీమేశ్వరుని కరుణ. అంచేత కాదనకూడదనుకున్నాను పైగా, నువ్వు మంచివాడివే నని రుజువుపరచుకొన్న రోజున, నా జీవితంలో ఒక మంచిపనైనా చేయగలిగాను అనే సంతృప్తి నాకు ఉంటుంది!" అంది బామ్మగారు. అబ్బ! ఆమెహృదయం ఎంత విశాలమైంది! ఏమి చదువులు చదివిందావిడ! మానవ ఔన్నత్యపు పరిధులను తాకడానికి; ఆమెతో నేను అవగలిగాను.

"బామ్మగారూ! ఈ విషయంలో నేను మీకు కృతజ్ఞణ్ణి; ఆధారంలేక చిక్కటి చీకటిలో గుడ్డిగా మసలుతున్న నాకు చిన్న దీపపుకణికను ఇచ్చారు. మీరు నిశ్చింతగా ఉండమ్మా. నేను మీ శాకుంతలానికి అన్యాయంచేయను. నాకు చేతనయినంతవరకు నా ధర్మాన్ని నేను నిర్వర్తిస్తాను."

బామ్మగారికళ్ళు నీళ్ళతో నిండాయి. ఆ భీమేశ్వరుని ఉద్దేశించి, రెండుచేతులూ ఎత్తి నమస్కరించి "పరమశివా! అంతా నీ దయ!" అంది. ఇంకా

అనిచి..."భగవంతుడు అనుగ్రహిస్తే, మీరే బాగుపడతారు. దానిరాత బాగుండాలికదా! అబ్బాయీ! ఎప్పుడైనా, ఎక్కడున్నా, మీకు ఆసరా లేకపోతే, సహాయం కావలసివస్తే బామ్మగారు ఉన్నారని మర్చిపోకు. నీవు అన్యాయపడి, అన్యాయం చేసి, అన్యాయంగా జీవిస్తే నే క్షోభిస్తాను. ఇంతే చెప్పేది!"

ఆరాత్రి అడిగింది నన్ను కాపురం మొదలు గాగల విషయాలు. నేను ఏదో ఫరవా లేదన్నట్లు చెప్పాను. కావలసివస్తే సాయమూ, అదీ పట్టుకొస్తుంది. శాకుంతలం గుడ్లనీళ్ళు పెట్టుకొంది. నేను ఆమె ఆదరణకు కరిగి ఊగిసలాడిపోయాను. కసాయివాడుకూడా పారాడ వలసిందేనని అనుకున్నాను; ఆమె ఎదుట! అచీకటిలో "ఇప్పుడే వస్తానని" వెళ్ళిపోయిం దావిడ. శాకుంతలం ఆమెకు సహాయంగా వస్తానంది. "ఈ వేళ వస్తావు... మరి రేపు?" ఆమె నవ్వుతో అన్నా, శాకుంతలం బాగా గిలగిలలాడింది. భోరుమని ఏడిచింది. ఆ ఏడుపును ఆపుకోలేక, "అమ్మా!" అనికూడా అందిగట్టిగా. బామ్మగారు విన్నారు. ఆమెకు పెంచిన ప్రేమ, మమకారం ఉవ్వెత్తుగా పుట్టుకొచ్చింది. ఆమె విసురుగా శాకుంతలంను సమీపించి, కౌగిలించి, తలనిమిరింది. శాకుంతల వలవల ఏడ్చింది. బామ్మగారి ముడతలుపడిన శరీరం వణికింది. కంఠం జీరపోయింది. బామ్మగారు కూడా కన్నీళ్ళు పెట్టుకున్నారు. శాకుంతలం అంది... "నేను విడిచివెళ్ళను!" బామ్మగారు అదిరిపడింది! నాకు కూడా కళ్ళనీళ్ళు వచ్చాయి! "బామ్మగారూ, పోనీ, తర్వాత తీసుకువెళతాను!" అన్నాను నేను. బామ్మగారు తలపంకించి..."నేను ఎప్పుడూ వెళ్ళమని చెప్పలేను. కాని, నాకోసం, మీ సన్నాహాలు మానకండి!" నేను మాట్లాడలేదు. శాకుంతలం మాట్లాడలేకపోయింది. బామ్మగారు వీధిలోకి వెళ్ళిపోయారు.

"ఏం శాకుంతలం! నీకు ఇష్టమేనా నాతో రావడం?"

శాకుంతలం జవాబు చెప్పలేదు.

శాకుంతలంను తిరిగి అడిగాను. ఆమె అంగీకారమే అన్నట్లు తలఊపింది.

"మరి బామ్మగారితో అలా అన్నావేం?

"ఏమీ లేదు. ఆమెను వదలలేక!"

"నీవు ఆమెను ఎప్పుడు చూడాలంటే అప్పుడు చూద్దువుగాని. సరేనా!"

ఆమె ఒప్పుకుంది. ఆమెను మాట్లాడనీయకుండా చేయగలిగాను గాని ఆమె కన్నీటిధారను ఆపలేకపోయాను. చాలాసేపు ఏడ్చింది. ఈ పరిస్థితిలో శాకుంతలంను ఒంటరిగా కాస్సేపయినా విడిచిపెట్టడం మంచిదనుకున్నాను. నేను చెరువుకట్టకు వచ్చాను. చీకటిపోయి ఇంకా వెన్నెల రాలేదు. చెరువులోని నీళ్ళు నల్లగా నిగనిగలాడుతున్నాయి. ధ్వజస్తంభం ఆకాశదీపం దూరాన కనపడుతోంది. అది ఆకాశంలో నిల్చిన జ్యోతిలా ఉంది...దాని త్రాడు ఆధారం కనపడలేదు. భీమేశ్వరునికి నమస్కరించాను. ఇంకా రోడ్డుమీద జనం తగ్గలేదు. నేను అలా కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చొని వెనక్కు మరలాను.

శాకుంతలం, బామ్మగారూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు. శాకుంతలం ఏదో పొట్లంతో ఉంది. శాకుంతలం కిలకిల నవ్వింది. చీకటి పోయి వెన్నెల రాబోతోంది శాకుంతలం నవ్వుతో! నన్ను చూచి అంత నవ్వు నవ్విందనుకున్నాను. కాదు. అది బామ్మగారి చక్కిలిగింత! తర్వాత నాకు చెప్పింది శాకుంతలం.

నేను బల్లమీద కూర్చున్నాక చెప్పింది; దగ్గరకు వచ్చింది శాకుంతలం.

"ఎందుకు చెప్పండి, బామ్మగారి చాదస్తం కాకపోతే. ఈ చీర, జాకెట్టు ఎందుకు?" చూపించింది చీరను, జాకెట్టును. లేతగులాబీ చీర! ఎప్పుడూ రంగు చీర కట్టగా చూడలేదు నేను ఉన్న ఆ నాలుగు రోజులూ! బామ్మగారు అసాధ్యురాలు! నేను శాకుంతలంతో నవ్వుతూ అన్నాను.

"ఏం శాకుంతలం...? ఇంకా అప్పుడే...తిలకానికి రాణింపు లేదా?" వెంటనే శాకుంతలం మొహం నల్లబడింది. పూర్వపు విషయాలు ఒక్కమాటు ఆమె ముందు కనపడిఉంటాయి. వస్తున్న వెన్నెలకు మేఘాలు అడ్డు తగిలాయి. నొచ్చుకున్నాను. చీర ఇంకా, అలానే, నా చేతుల్లో ఉండిపోయింది. ఆమె లోపలికి పోయి భోరునఏడ్చింది. బామ్మగారు విషయం అర్థం చేసుకొని శాకుంతలను సున్నితంగా మందలించడం నాకు వినపడుతూనే ఉంది.

"అవును. తప్పు. అతను చెప్పింది నిజం." ఆరాత్రి వెన్నెలలేని కటికచీకటిమయంఅయిన జీవితానికి వెలుగు నిచ్చారు. ఆరాత్రే, శాకుంతలం బొట్టు పెట్టుకుంది!!

నా హృదయం ఎందుకో గిలిగింతలు పెట్టినట్లు తొట్రుపడింది. శాకుంతలం బొట్టు తెగనిబొమ్మై నన్ను బాధపడుతుందనుకున్నాను; అతీరుమాస్తే ఆరాత్రి, అసలు, బామ్మగారూ, శాకుంతలం నిద్రపోనే లేదు, ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు.

తెల్లవారకట్ల మమ్మల్ని బస్సు ఎక్కించింది బామ్మగారు. బామ్మగారికి నమస్కరించాను. నోట్లో నుడ్డికుక్కుకుని పదపదమవుతోంది కన్నీళ్ళనో ఎక్కుతోంది శాకుంతలం నమస్కరించింది శాకుంతలం. బామ్మగారు శాంతంగా, సహనంగా, మౌనంగా ఆశీర్వదించారు శాకుంతలాన్ని. బామ్మగారు బాగా శూన్యంలోకి చూసిపాగింది. ఆమె శాకుంతలాన్ని చూడలేకపోయింది. శాకుంతలంకూడా బామ్మగార్ని చూడలేకపోయింది. ఇద్దరికీ కడుపుపట్టని దుఃఖంతో అల్లాడుతున్నారు. శాకుంతలం బస్సు కదిలినా ఏడుస్తూనే ఉంది. బామ్మగారు బస్సు రేపిన దుమ్ములో అదృశ్యులైనారు. నేనే బాగా గిలగిలలాడాను. ఆకస పడని బామ్మగారికి నమస్కరించాను. నాలో ఆమె యెడ కృతజ్ఞతాభావం మెదిలింది. హోరనుకొంటూ, కొండమీద దూసుకుపోతోంది బస్సు. భీమేశ్వరాలయం ఆ చెరువు ఆవలి నిశ్చలంగా, ఠీవిగా నిల్చుని ఉంది. క్షణంలో మా నుండి వెనక్కు జరిగిపోయింది. ఆ క్షణంలో నే చేతులు జోడించి నమస్కరించాను. (దాక్షారామఅంటే, నాకే విషయమూ గుర్తులేదుకాని, భీమేశ్వరుని ఆలయంమాత్రం మరిచిపోలేను. ఆ ఆలయమే నా మనోవీధిలో ఎప్పుడూ నిశ్చలంగా ఠీవిగా, చిరుగంటలు అప్పుడప్పుడు సవ్వడి చేస్తూ ఉంటుంది!

మా ఊరు సమీపించేదాకా నేను దీన్నిగురించి ఆలోచించనే లేదు. మట్టిరోడ్డమ్మట గతుకుల్లోంచి దొర్లుకుంటూపోతోంది బండి ఎగుడుదిగుడుగా! లేత గులాబీచీరలో వగలుగా మిలమిలలాడుతోంది శాకుంతలం! అయితే నేం...? శాకుంతలం దిగులుగావుంది! ఆమె దైన్యంగా చూస్తూంటే, మరి కొంత బాగుందని, నామనస్సు అలలతో నిండినా, అనుకోలేకుండా ఉంది!

నాకు వెంటనే ఒక వింతభయం కలిగింది. నేను శాకుంతలంను ఎక్కడికి తీసుకువెడుతున్నాను? ఒక్కమాటు అదిరిన ట్లనిపించింది నాలో నాకు. నాకు ఇల్లు లేదని, ఉన్నయిల్లు అమ్మేశానని నాకు అంతవరకూ గుర్తే లేదు. శాకుంతలంను ఏధీమాతో తీసుకువస్తున్నాను? ఇది ఇలా అనుకుంటుంటే భయంకూడా వేసింది. ఏదైనా ముందు అనాలోచితంగా చేస్తాను. తర్వాత బాధపడతాను. ఇప్పుడనుకొని లాభంలేదు. జరగనున్నది జరక్కమానదు ఇప్పుడనుకొని ఏమిలాభం?

వావిలాల తాతగారిఇల్లు దాటబోతోంది బండి. వావిలాల తాతగారు అరుగుమీద కూర్చున్నారు. బండిలోకి తొంగిచూశారు ఆయన. నేను బండి ఆపుచేసి దిగాను ఆయన ఆప్యాయంగా..."రా! రా!" అని అన్నారు. "నమస్కారం" అన్నాను. తిరిగి నమస్కరించబోయి వెంటనే మానుకున్నారు. నేను వెంటనే బండిలో శాకుంతలం గుర్తుకువచ్చి "మిమ్మల్ని తర్వాత కలుసుకొని వివరాలు చెపుతాను తాతగారూ!" అన్నాను ఆయన సరేనన్నట్లు బుఱ్ఱ ఊపారు. బండిని పోనిమ్మన్నాను. ఆయన నావంకా, బండివైపూ ఆశ్చర్యంగా చూశారు!

నాకు అప్పుడెప్పుడో వారణాసాయన అన్న మాటలు గుర్తుకువచ్చాయి! "ఇల్లు అమ్మకొని ఆడదాన్ని వీధిని బెడ్తావా?" అన్న ఆయన మాటలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేసాయి. నిజంగా అంతేజరిగింది. వావిలాల తాతగారి మాటలు, వారణాసి తాతగారి మాటలు ఎదురు బదురుగా వచ్చి నిలబడ్డాయి. ఇద్దరు చెప్పినదాంట్లోనూ నిజం ఉంది. కాని క్షణంకాలం మాత్రం వావిలాల తాతగారి మాటలే నెగ్గిపోయాయి. ఆ సందర్భావస్థలో! నిజం ఎంతలేదు.!!

నాకు చాలా చికాకు అనిపించింది. అసలు నాదే తప్పనుకున్నాను. దేశ సంచారానికని ఎవరయినా ఇల్లు అమ్ముకుంటారా? వెంటనే నాకు నవ్వవచ్చింది. నాలాంటివా రెవరయినా ఉంటారా?

పంచాయితీ బోర్డు ఆఫీసుదగ్గర ఆగింది బండి. ఇవతలనుంచి "సత్యం!" అని పిలిచాను. సత్యం మా ఊరి ప్రెసిడెంటు. సత్యం, నా గొంతును పోల్చి ఉత్సాహంగా ఇవతలకు వచ్చాడు. సత్యానికి నేనంటే గౌరవం, అభిమానం. సత్యానికి నేనంటే గౌరవం, అభిమానం కంటె ఒక పాలు భయం ఎక్కువని నాకు తెలుసు. వాడు ఇవతలకు వచ్చి, బండీ, వ్యవహారం చూసి గతుక్కుమన్నాడు.

"ఏంరా! రెండు గదులు కావాలి." అన్నాను. వెంటనే తీసుకోమన్నాడు. బండిలోకి తొంగిచూసి,

అదోలా మొహం పెట్టి, కనుబొమ్మలు ఎగరవేసి "ఏమిటి కథ!" అని కసుక్కున నవ్వాడు. ఆ నవ్వులో తుచ్ఛమైనభావం. నోటితో చెప్పలేని అసహ్యభావం ఉంది. వాడి నవ్వు చాలా వెకిలిగా ఉంది. చలంగారి రసికుడు నవ్వినట్లు నవ్వాడు! వాణ్ణి అసహ్యించుకున్నాను అప్పుడు. వాడు అన్నివిధాలా మంచివాడే. కాని వాడికి ఆ దౌర్బల్యం ఉంది. అదొక్కటి కనబడితే సత్యం మరొకడు!!

"చాలా ఉందిలే కథ. తర్వాత చెపుతాను." సత్యం ఉషారుగా ఉన్నాడు. సిగరెట్టు తానొకటి ముట్టించి నాకొకటి ఇవ్వబోయాడు. ముక్తసరిగా అన్నాను—"మానేశాను."

"ఓహో" అని దెబ్బతిన్నట్లు అన్నాడు. తీరిగా నుంచున్నాడు. కాలు జరుపుకున్నాడు. జేబురుమాలుతో మొహం సవరించుకున్నాడు కళ్ళజోడు తుడుచుకున్నాడు. జేబురుమాల్ని కాలరులో దోపుకున్నాడు. ఇవన్నీ చలంగారి పురుషుని లక్షణాలు!

"దిగు శాకుంతలం!" అని లోపలకు దారిచూపించాను. సత్యం ఎగాదిగా చూశాడు శాకుంతలాన్ని, క్రింది పెదవిని పై పంటివరుసతో అదిమి ఉంచుకున్నాడు. ఆ వెకిలి ముక్కు మరీ వెకిలిదిలా కనపడింది. నాకసలు ఒళ్ళుమండింది. శాకుంతలం వీధి అరుగుగది కిటికీలోనుంచి బయటకు చూస్తోంది. సత్యం, శాకుంతలం ఏమూల ఉంటే ఆమూలకు దృష్టి మళ్లిస్తున్నట్లు నేను గమనించకపోలేదు. సత్యం దర్పంగా:

"ఆ పెట్టె దింపమనరా! అలా చూస్తావేమిటి!" అన్నాడు. శాకుంతలం ముందు, వాడి వెకిలిబుద్ధి ప్రదర్శించడమా మరి? తర్వాత ఇంకోమాటే! ఆ వీధి ఆడవాళ్ళంతా గుమ్మాల్లో నిలబడి నేను చేస్తున్న తతంగాన్ని అంతా చూస్తున్నారు. నా వెనక పిల్లలదండు ఒక చిన్న సైన్యంలా ఉంది. బండివాడికి డబ్బులిచ్చి పంపాను. సత్యంతో "పదరా!" అని లోపలికి వెళ్ళిపోయాను. సత్యం నిమేషకాలం కొయ్యబారి, తెప్పరిల్లి, నా వంక అదోలా చూశాడు. ఆ చూపు "నువ్వెంత మారిపోయావురా! స్నేహితాన్ని కూడా మరిచావ్!" అన్నట్లుంది!

మా ఇంట్లో మంచాలు, సామానూ అవీ తెప్పించాను. సరకులు పడేశాను. శాకుంతలకు అన్నీ చూపించాను. రెండు గదులూ ఊడ్చింది. వెంటనే వంటకు సిద్ధమయ్యింది; తను, నా తరువాత నీళ్ళు పోసుకొని.

నేను నేరుగా వావిలాల తాతగారింటికి వెళ్ళాను. నేను జరిగిన సంగతులు ఆయనకు చెప్పాను, ఆయన ఎంతో శ్రద్ధగా విన్నారు. విని పకపక నవ్వి... "అరసికుడుగా, మంచి గడుగ్గాయివే..." అన్నారు.

"కాని అబ్బాయీ! ఎవరికీ...ఆమె విధవ అని మాత్రం చెప్పకు." అన్నారాయన.

"ఏమీ చెప్పను."

"ఒకటి చూడు. పదిమందీ పది రకాలుగా అంటారు కాని నువ్వు నిగ్రహంగా, సహనంగా భరించాలి. శాకుంతలంకు నువ్వు నచ్చచెప్పాలి, సరే. పొద్దుపోతోంది. పోయిరా. తర్వాత మాట్లాడవచ్చు!" నేను తిరిగి వచ్చేశాను. సాయంత్రం ఆరుదాటుతుంది, పంచాయితీ ఆఫీసు రేడియో పాటలు పాడుతోంది. పాటకజనం ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెడుతున్నారు. శాకుంతలం వీధిగదిలో పాటలు వింటోంది.

నాకు నీళ్ళతోడి సిద్ధం చేసింది. నీళ్ళు పోసుకొని భోజనానికి కూర్చున్నాను. ఉల్లిపచ్చడి. చారు మజ్జిగ. అంతే వంట! అయితే నేం. ఉల్లిపచ్చడి అమృతంలా ఉంది ఆవేళ ఎంతో విశ్రాంతిగా భోజనం చేశాను. నాకింక ఏ బెంగా లేదనుకున్నాను. సౌఖ్యంగా కాలం వెళ్ళబుచ్చవచ్చు అనుకున్నాను.

శాకుంతలం భోజనం చేసి ఇవతలకు వచ్చింది. అవతల అరుగుమెట్టెక్కుతూ. "ఓరే...అబ్బాయీ!" అన్న వావిలాల తాతగారి కేక విని ఆశ్చర్యపోయి "రండి. రండి." అన్నాను. ఆయన లోపలకువచ్చారు. గదిలో కాలు పెడుతూనే...

"చూశావా. అబ్బాయీ! అప్పుడూ ఉండే వాడివి. అవునుగాని. మనదేవూరు అమ్మా!" అన్నారు శాకుంతలంను ఉద్దేశించి.

శాకుంతలం తలవంచి ఒకమూలకు ఒదిగి నుంచొని కంఠం ఒకసారి సవరించుకొని...కాస్సేపు ఆలోచించి "ద్రాక్షారామండి" అంది. "చూడు అమ్మాయీ! మా వాడు కొంత దుడుకైనవాడు. నువ్వు వాణ్ణి సరిదిద్దుతుండాలి. ఈ ఊరు ఉంది చూశావు. ప్రతీ విషయంమీదా శ్రద్ధ మా ఊరివాళ్ళకు. ఏవో...మనకు వినపడేలా అంటారు. మనం వాటిని లెక్కపెట్ట

వట్లు మసులుకోవాలి. వస్తానోయ్!" అని వెళ్ళిపోయారాయన!

నాకు తర్వాత క్రమంగా అర్థమైంది, ప్రత్యేకంగా, ఈ మూడు మాటలూ చెప్పడానికి ఎందుకు వచ్చారో!

శాకుంతలం అంది నవ్వుతూ "ఆ తాతగారెవరండీ...ఎంత మంచివారో!" నేను తల ఆడించాను. నిజంగా ఎంతమంచివారో! శాకుంతలం తెలివైంది. మాతృగ్రాహి అనుకున్నాను. అదే అన్నాను శాకుంతలంతో. శాకుంతలం నవ్వింది.

"చూడు శాకుంతలం. నువ్వెంతో అందంగా ఉంటావు నవ్వుతూంటే. ఆ స్వభావం ఎందుకు నవ్వకూడదూ?" అన్నాను నవ్వుతూ. ఈ మాటలకు నవ్వుతుందని నాకు తెలుసు. నవ్వింది!

"బాగుందండీ! ఆ స్వభావమూ నవ్వమంటారా? అది మీరు చెయ్యవలసినపని. నన్ను నవ్వించండి, నా అభ్యంతరం లేదు." నా కేమాటా తోచలేదుగాని నాకు నవ్వు వచ్చింది; శాకుంతలం మాటలకు. నేనునవ్వాను. తిరిగి నవ్వింది శాకుంతలం. నాకు ఆ చిన్న సంఘటన జ్ఞాపకానికి వచ్చింది. అడిగాను వెంటనే...

"చూడు; శాకుంతలం. నేనారోజున రాత్రి తిరిగి ఇంటికివస్తే, బామ్మగారు ఏదో అంటే కిలకిలమన్నావ్ ?"

"బాగుందీమాట! ఎప్పుడో...ఏదో...అంటే ఏదో నవ్వుతాను. అప్పుడే మరిచిపోతాను."

"అలాకాదు శాకుంతలం. నువ్వు అంతగా నవ్వావు అంటే ఏదో కారణం లేకపోదు. ఏదో ఉంటుంది. నాకు తెలుసు ఆరోజురాత్రి... అంటే బామ్మగారు చీరకొనితెచ్చారు... అప్పుడు."

శాకుంతలానికి జ్ఞాపకానికి వచ్చిందిలా ఉంది. సిగ్గుతో తలదించుకొంది. మళ్ళీ నవ్వుతో కిలకిలమంది. శాకుంతలం నవ్వుతోంటే నాకు ఆత్రుత మరీ పెచ్చు పెరిగింది.

"చెప్పు శాకుంతలం!" అన్నాను.

"బాగుంది మీ వరస."—చెప్పమని బలవంతం చేశాను. దగ్గరకు వెళ్ళి వంచిన తలను చేతుల్లోకి తీసుకున్నాను. నా వెర్రికేళ్ళను చూచి సిగ్గుపడింది అమాయకంగా! క్షణం ఆలోచించి ఫెళ్ళున నవ్వింది. ఆ నవ్వులో శాకుంతలం ఎంతో చిన్నపిల్లలా కనపడింది. నేను అదే అన్నాను.

"నువ్వు నవ్వుతోంటే మరీ చిన్నపిల్లవయిపోతున్నావ్." నవ్వింది శాకుంతలం.

"నన్ను పిచ్చివాణ్ణి చేయకు."

శాకుంతలం తలవంచి అతి నింపాదిగా, "అది కాదు... బామ్మగారు." అని, కిలకిలమంది. నవ్వు తప్పితే మాట పెగలదు. సతమతమవుతోంది. శాకుంతలం చేతులు పుచ్చుకున్నాను. ఆమెను ఒత్తిడిచేయడం కాఠిన్యమే అనిపించుకుంటుంది అయినా ఆమాట ఏమిటో, వినాలనే ఆసక్తి నన్ను దేన్నీ ఆలోచించనివ్వలేదు. ఆమె చెప్పింది.

"నేనీమాటు బామ్మగార్ని చూడ్డానికి ఒక్కర్తినీ వెళ్ళకూడదట!"

"అహా!" అన్నాను. ఇంకా చెపుతుందని చూశాను. శాకుంతలం ఇంక మాట్లాడలేదు. బుఱ్ఱ వంచుకొంది.

"చెప్పు శాకుంతలం. అంటే?" అన్నాను.

"నా మొహంలా ఉంది. ఏం చెప్పను? అందుకే నవ్వుతె!"

ఇంకా అర్థంకాలేదు. నా అయోమయానికి పిచ్చినవ్వు నవ్వి తిరిగి అంది "అమ్మగా వెళ్ళాలిట!"

నా కర్థం అయ్యింది. ఫక్కున నవ్వాను. నన్ను విచిత్రంగా చూసింది. శాకుంతలంను ఆకోలా చూశాను. నా చూపులు ఆకలి గొన్నట్టున్నాయిలా ఉంది నా చూపులను భరించలేకపోయింది. వెర్రి శాకుంతలంను చేతుల్లోకి తీసుకొన్నాను. ఆమె మాట్లాడ లేదు!

ఒకమాటు శాకుంతలం "ఏమండీ" అంటూ పిలిచింది. నా పేరు చెప్పాను. శాకుంతలం నవ్వుకొంది! నేనూ నవ్వాను. ధ్వనికూడా బాగా తెలుసన్నమాట!

"నేనలా పిలవలేను బాబూ!" ఆమాట అప్పుడు చూడాల్సిందే! ముక్కు బాగా పైకిలేచి ఒక్కమాటు క్రిందపడ్డది. ఆమె మరీ అందంగా ఉంది.

"ఏమండీ!"

"చెప్పానుగా నా పేరు!" ఈ సారి కూడా నవ్వాను.

"చెప్పానుగా అలా పిలవలేనని." రెప్పలు మూసీ మూయనట్లు పెట్టింది. ఆమెను చూచి ముగ్ధుణ్ణయి పరికించి...

"నువ్వు నన్ను మాటిమాటికి ఇలా పరవశుణ్ణి చేయడం న్యాయం కాదు శాకుంతలం". శాకుంతలం చిరునవ్వు నవ్వింది. ఆమె పెదవులను తాకాను. నా వేళ్ళు ఆమె జుట్టును చిందరవందర చేస్తున్నాయి. పూర్తిగా ఆమె నాకు స్వాధీనమయ్యింది. నేను అన్నాను "చూడగా... చూడగా... నిన్ను వదిలి వెళ్ళలేని పరిస్థితి ఏర్పడదుకదా!" శాకుంతలం పల్చగా నవ్వింది. నింపాదిగా అందికూడా; "ఎంత మంచి వారు!" నేను పరవశుణ్ణయిపోయాను.

అమర్నాథ్ ఊళ్ళో పెద్ద అలజడి బయలుదేరింది. వాడు వినిపించేలా అనేకం అన్నారు. నేను పట్టించుకోకుండా ఉందామన్నా ఉండలేక పోయేవాడిని. నేను పూర్తిగా చెడిపోయానన్నారు. బరితెగించిన వాణ్ణి చేసేదేమిటన్నారు. ఆ వేళ సాయంత్రం రావి చెట్టు దగ్గర పదిమందీ ప్రోగుబడ్డారు. వారణాసి తాతగారు పగలబడి నవ్వుతున్నారు. నన్ను నేను ఒకమాటు చూసుకున్నాను. నన్ను అపి...

"ఓరే... ఏ ఏ ఊళ్ళు తిరిగావ్ రా!" అన్నారు వారణాసి తాతగారు.

"ఏవో లెండి..."

విస్సిగాడు కూడా అక్కడే ఉన్నాడు. వాడు అన్నాడు.

"వాడికే మండి. అదృష్టవంతుడు."

"ఎదుటివాడి అదృష్టంచూసి నువ్వు ఏడిచే దురదృష్టం నీకేం పట్టిందిరా! నీకన్నానా? అన్యాయంగా కలసిన ఆస్తికి అధికారివయ్యావ్." విస్సిగాడి మొహం నల్లబడింది. ఏం మాట్లాడలేదు.

వారణాసి ఆయన అన్నాడు. "అదికాదురా! ఇది ఊరా! మాలపల్లా? ఏదో చేపారనుకో. దానికి నేను అనను. మనం మాంసం తింటున్నామని గుమ్ములు మెళ్ళోకట్టుకుంటామా? కాస్త... దాన్ని దూరంగా ఉంచితే మంచిదంటున్నాను. అంతే!"

వారణాసి తాతగారంటే నాకెంతో అసహ్యం పుట్టుకువచ్చింది. ఒకమాటు ఈయన అన్నమాటలేమిటి? రెండు నాలికలు!! అంతా వారణాసి తాతగార్ని బలంచేస్తున్న ట్లూహించాను. వళ్ళుమండిది. నాలో రక్తం మరిగింది.

"మీరు అనే దేమిటి?"

"ఏమీలేదు. ఇది సంసారులు ఉండేచోటు." అన్నాడు జోగి పంతులు.

"ఇప్పుడేం కొంప మునిగింది?"

"నీ కొంపేం మునగదు. మేం ఉండలేక చస్తున్నాం. జాతిగా చెడినదాన్ని ఊరుమధ్యకు తీసుకురావడం మంచిదికాదు." జోగిపంతులు వారణాసి తాతగార్ని చూస్తూ అన్నాడు.

"ఎవర్రా! చెడిత? మనకంటె నయమేలే. జాతిగా కనాకష్టంకాదు. నీకథ నాకు చెప్పకు. మీరేమయినా అనుకోండి. నేను అక్కడే ఉంటాను. అంతే." అనేసి వచ్చాను. తర్వాత నన్ను దుమ్మెత్తిపోసి ఉంటారు.

ఆ సాయంత్రం సత్యం నన్ను పిలిచాడు. దూరంగా తీసుకుపోయాడు. నాతో వీడికెంత రహస్యమేమిటనుకున్నాను.

"ఓరీ అబ్బీ! చూడు... నేను నలుగురితోనూ కలుపుగోలుతనంగా ఉండాలి." ఈ ఉపోద్ఘాత మేమిటనుకున్నాను.

"నేను వచ్చే ఎన్నికల్లో నిలబడదామనుకుంటున్నాను." అన్నాడు సత్యం. నేను అమాయకంగా అన్నాను. "ఎప్పటిలాగే సహాయం చేస్తాను. సరేనా?" అంటే మొన్నటి పంచాయితీ ఎన్నికల్లో వీడికై చాలా ప్రచారంచేశాను. అందుకు తిరిగి సహాయం కావాలని వచ్చాడేమో అనుకున్నాను.

"అది కాదురా నేను అనేది. నలుగురూ నాలుగుమాటలూ అంటున్నారు. నువ్వు నాకెంత ఇదో నేను చెప్పక్కర్లేదు. అంతా అంటున్నారు. పంచాయితీ ఆఫీసు, ఇల్లంటిపనికి ఇస్తావా? అని. నేను కూకలేసాను. అయినా నేం. నామాట కాదంటున్నారు నిజమే. చూడు పదిమందితోనూ నాకు అవసరం ఉంటుంది."

"అందుచేత, నా ఒక్కడి అవసరం నీకేముంటుంది? కదూ?"

సత్యం తబ్బిబ్బులుపడ్డాడు. సరిదిద్ద ప్రయత్నించాడు. "అహా! అదికాదు" అంటూ.

"ఏదీ కాదులే. తెల్లవారేలోపున ఖాళీచేస్తాను. సరే. నువ్వు వెళ్ళు." సత్యం ఆ మసక చీకటిలో లీనమైపోయాడు.

సశేషము

# మాండలికములు

శ్రీ జె. సూర్యనారాయణ

నన్నయ ఆదికవి. ఆతని కృతియగు భారతము తొలి తెలుగు గ్రంథము. కాలము 1030 ప్రాంతము. అప్పటినుండియు నన్నయకృతమగు గ్రంథము తెలుగు వారు పఠించుచునుండిరి. ఆనాడు ముద్రణ సౌకర్యము లేదు. గ్రంథప్రచారమునకు లేఖన మవసరమైనది. కావున భారతమును పలువురు వ్రాసికొనుట తటస్థించినది. ఈ గ్రంథమును వ్రాయునపుడును చదువునపుడును ఇందు మూలవిరుద్ధముగ కొన్ని మార్పులు వచ్చినవి. అందు కొన్ని పదములందలి యక్షరముల మార్పులు. కొన్ని పదముల చేర్పులు. ఈ వానిని పాఠాంతరము, పాఠభేదములు అని మనము ప్రాచీన గ్రంథములందు గణించు రూపములన్నియు నీవిధముగనే యేర్పడియుండును. ఏ కవియు తన యుద్దేశమును భావమును బోధింప వివిధములగు పాఠభేదములను గ్రహింపడు. కాలక్రమమున లేఖకులు పాఠకులు తమ తమ ప్రదేశములందు బహుళ ప్రచారమునందున్న ధ్వనులను, పదములను తమకంతగా పరిచయము లేని ధ్వనులు లేక పదములు మూలగ్రంథమునందున్నచో వానికి మారుగా నుంచుదురు. ఇట్లు జరుగుట సహజము, వాస్తవము. తిరుపతి ప్రాంతమునందలి తెలుగు మాటాడువారు తమ భాషయందలి కొన్ని ధ్వనులకు పదములకు తమకతి పరిచిత మగు తమిళ ధ్వనులను వాడుటగలరు. తమిళమునందు పదాదియందే పరుషమునుచ్చరింతురు. పదమధ్యమునందలి పరుషమును సరళముగ నుచ్చరింతురు. అనగా, వెంకట ఇత్యాదిపదములను, తమిళులు, వెంగట, అని యుచ్చరింతురు. ఈ పద్ధతిని నుచ్చరించుట తిరుపతి ప్రాంతమునం దా బాలగోపాలమునందును సుప్రసిద్ధము. దీనిని వ్రాయునపుడును పరుషమునకు మారుగ సరళమును వాడుటయే సహజముగ జరుగును. నన్నయ తరువాతి కాలము నందు లేఖకులు పాఠకులు నీవిధములగు మార్పులనే తమ గ్రంథముల వ్రాయుచో కలిగించియుందురు. 'నన్నయ ముఖ్యతిక్కన జనంబుల...' అని అప్పకవి ఈ విషయమును నే పేర్కొనినాడు. నన్నయకు అప్పకవికి మధ్యకాలము సుమారు 600 సంవత్సరములు. పాఠకాధములనగా అసమర్థులు, స్పష్టముగ నుచ్చరింపలేని వారని యర్థము. స్పష్టముగ నుచ్చరింప లేమికి తమ నిత్యవ్యవహారమునందలి ధ్వనులు గ్రంథమునందలి ధ్వనులకు భిన్నముగనుండుట యొక కారణము.

ఒక కాలమునం దొక ప్రాంతమున నిత్యవ్యవహారము నందున్న ధ్వనులు కాలాంతరమున దేశాంతరమున మారుటకు అన్యభాషాప్రభావము, మత రాజకీయాదులు కారణములు గావచ్చును. అధికారము నందున్న వారు విదేశీయులగుచో వారు వారు భాషయందున్న ధ్వనుల ఛాయకు ఆ ప్రదేశమునందలి ధ్వనులు చేరును. తెలుగునందలి 'ఫ' మహాప్రాణము పరుషాక్షరము, ఆంగ్లమునందున 'F' గ మారినది. ఈ రెంటి యుత్పత్తి స్థానములకు భేదము గలదు. సంఘమందున్న జనసమూహము వ్యక్తులను గానీ మతమును గానీ యాశ్రయించి విభిన్నములగుచో నా వ్యక్తులందును ఆ మతమునందును ప్రముఖ పాత్రవహించు వారి భాష తక్కినవారి భాషపై ప్రభావమును జూపును. తెలుగు దేశమందున్న శ్రీవైష్ణవులు ఆ మత ప్రవర్తకులకాటపట్టగు తమిళ దేశము నందలి పదములనే వాడుచుందురు. 'సాపాటు' ఇత్యాదులగు పదములీరీతిని మన భాషయందు జేరుచున్నవి. అప్పకవి యుద్దేశించిన పాఠకాధములును తమ భాషయందు తమ కాలమున తమ ప్రాంతమున గల స్వరములనే స్వీకరించి కాలాంతరమున దేశాంతరమున వెలసిన గ్రంథములందలి పదములను ధ్వనులను మార్చి పాఠభేదములను గల్పించువారని యర్థము. ఇట్టి మార్పువలననే నన్నయ తరువాత 600 సంవత్సరములకు నన్నయ గ్రంథమున కనేకములగు పాఠభేదము లేర్పడినవి. ముద్రణ సౌకర్యము వచ్చిన తరువాత వచ్చిన గ్రంథములకు పాఠభేదములు కానరావు. వ్రాసికొనవలసిన యవసరము లేదు గావున మార్పులు కలిగించుచు నెవరును వ్రాయలేదు. కావున నాధునిక గ్రంథములకు పాఠభేదములు లేవు.

దేశమునందలి యన్ని ప్రాంతముల వారికిని అన్ని సంఘముల వారికిని సులభముగ బోధపడు భాష ప్రామా

ణికమని తలఁచుచో, అందలి ధ్వనుల తగ్గించుట, హెచ్చు చేయుట, ఉన్న ధ్వనులను మరియొక విధముగ నుచ్చరించుట మాండలిక మగును. పై మార్పులతో నుచ్చరితమగు తెలుఁగుపదము గ్రామ్యమని యప్పకవి. సంస్కృతపదముల కొమార్పుచేసి తెలుఁగువారుచ్చ రించినను అది తప్పకయుఁ గ్రామ్యమే.

సంస్కృతము రానివారికి వారివారి నివాసప్రదేశములకు 'సీమ'లందు వ్యవహారమునందున్న భాషలో సంస్కృత కావ్యార్థమును నది సులభ గ్రాహ్యముగ నుండునని అప్పకవి. ఆనాఁడు 'సీమ' ఎంతటి వైశాల్య సూచకమో స్పష్టముగ చెప్పలేము. విభిన్నములగు సీమలందు వ్యవహారమున నున్న భాష కొన్ని ప్రత్యేక లక్షణములనుగలిగియున్నదనియు, మనకు తెలియును. కాని, ఒక యూరికి మరియొక యూరికి, ఒక ఇంటికి మరియొక యింటికి, ఒక వ్యక్తికి మరియొక వ్యక్తికిని భాష భేదించునని చెప్పుట సత్యము. కాని చాల సూక్ష్మపరిశీలన లేనిచో నీ భేదమును గ్రహింపజాలము.

జీవద్భాషకు నానాత్వలక్షణము. నన్నయ వాడిన భాషనే స్వీకరించి యర్వాచీనులు వాడినట్లు, ఆ మూఁడు పర్వములలో పదములవలన స్పష్టము. పాల్కురికి సోమనాథుఁడీ విషయమునందు తన స్వాతంత్ర్యమును చూపినాఁడు. తన కాలమున వివిధ సీమలందున్న పదములను తన గ్రంథమునందు వాడినాఁడు. తిక్కన ఈ విషయమున నన్నయనే యనుసరించెను. కాని తన స్వాతంత్ర్యమును కొంతవఱకు చూపినాఁడు. నన్నయకన్న విశిష్టముగ తిక్కన వాడిన మాటలు ప్రాతఁబడిపోలేదు. నాటికి తెలుఁగు పదముల సంఖ్య పెరిగియుండవచ్చును తిక్కన నివాసప్రాంతము నందా పదములన్నియు వ్యవహారమునందుండి యుండును. చిన్నయ సూరివరకు నన్నయాది కవిత్రయము వాడిన భాషకే ప్రామాణ్యత నంగీకరించిరి. ప్రదేశమును కాలమును సంఘమునుబట్టి భాష మారుననుట పరమసిద్ధాంతము. ఇట్టిమార్పులు వచ్చుటలో ఒక సీమయందు ప్రాచీనభాషా లక్షణములు కొన్నియుండ వచ్చును. ఆ లక్షణము ప్రామాణిక భాషయందు లేక పోవచ్చును. కావున ప్రామాణికభాషమాత్రమే ప్రాచీన మనియు నదియే విశిష్టమైనదనియు ననరాదు. "వాఁడు" అనుసర్వనామము ప్రామాణిక భాషయందు 'అఁడు', గా మారినది. రాయలసీమ తెలుఁగునందీపదమునందలి ప్రాచీన 'వ,'కారమందఱి యుచ్చారణయందును నిలచి యున్నది.

నన్నయ స్వీకరించినభాష పరిమితము. ఆత డంగ వలననే ఆ శికములకు సంస్కృతపదములను స్వీకరింపవలసి వచ్చినది. అష్టదిగ్గజముల కాలమునందు రాయలసీమ ప్రాంతమునందలిపదములు గ్రంథములందు ప్రవేశించి భాషకు పుష్టికూర్చినవి. నేటి తెలుఁగునందు వివిధ సీమలందలి పదములు రేడియోలమూలమున సినిమా వల్లను పత్రికాముఖమునను దేశము నలుమూలల వ్యాపించుచున్నవి. రేడియో కార్యక్రమములందును పత్రికా నిర్వహణమునందును ప్రముఖపాత్ర వహించు వారి మాండలికములు నలుమూలల వ్యాపింప నవకాశములగును. విభిన్న మాండలికముల వాడువారు ఒకచో నివసించుచో నందు అల్పసంఖ్యాకు లధిక సంఖ్యాకులందున్న ప్రత్యేకపదములనే గ్రహించి వాడుట కొంతవరకు జరుగును. కాని యల్పసంఖ్యాకుల పదములు కొన్ని అధికసంఖ్యాకుల పదములందుఁజేరుట యసహజము కాదు.

ఒక విదేశీయుఁడు మనదేశమున నివసించుచో నతఁడు మనదేశీయులకు పదములను చేర్చికొన యత్నించుట సహజము. కాని ఆ విదేశీయుని పదములను స్వదేశీయులు స్వీకరించుటయు జరుగవచ్చును. అరవవారు మనదేశము నంతట, హోటళ్ళను పెట్టి, అట్టు, గారె, మొదలగు పదములకు పర్యాయపదములగు దోశె, వడ, ఇత్యాదులనే వాడుటచేత మనమును వానినే గ్రహించితిమి. మన తెలుఁగు పదములగు 'అట్టు' గారె, పదము లీనాఁడు చాలవఱకు వ్యవహారదూరములైనవనుట సత్యము. దీనివలన తమిళులస్వాభిమానము, స్వభాషా పదములనే వాడవలయునను అభినివేశము, అన్యపదములను స్వీకరింప నిష్టము లేమియు స్పష్టము. తెలుఁగువారు మన పదములను విడుచుట, క్రొత్తను స్వీకరించుట స్వభావము గలవారనుట స్పష్టము. తెలుఁగు వారికి స్వభాషపై నభిమానము అదరము లేదన లేముగాని తక్కువ యనవచ్చును. ఇట్లే ఒకప్రాంతమునందు గల విశిష్టములగు పదములు దేశము నలుమూలల వ్యాపింప వలయునన్న స్వాభిమాన మవసరము.

మాండలికములు జీవద్భాషయందు తప్పక యుండును. ఏభాషను వాడువారు పలుప్రాంతములకు తిరుగుదురో వారిభాష ఇతరత్ర వ్యాపించును. ఆత్మాభిమానముగలవారు వాడుపదములు సర్వత్ర వ్యాపించును. అదిలేనివారు క్రొత్తను స్వీకరించుచు ప్రాతను త్రోసి రాజందురు.

# స్త్రీలకు ప్రత్యేకం

శ్రీ అంగర సూర్యారావు

**పాత్రలు: సరళాదేవి, కాంచనలత, ఉషారాణి, సునందిని, యమున, పద్మిని, రంగమ్మ.**

* * స్థలం: మహిళా మండలి కార్యాలయం. సమయం: రాత్రి 8 గంటలు.

హాలుమధ్య ఒక టేబిలు, రెండు కుర్చీలు వున్నాయి. హాలుకు యిరు వైపులా రెండు స్తంభాలు కనిపిస్తున్నాయి. కుడివైపునుంచి సరళాదేవి, కాంచనలత మాట్లాడుకుంటూ హాలు మధ్యకు వస్తారు.

సరళాదేవి: పురుషుడు-మంచీ చెడ్డ తెలుసుకోకుండా-మొండి పట్టుదలతో-పర్వతశిఖరం మీదికి యెగ బ్రాకుతున్నాడు. అలా చూస్తూ వూరుకుంటే అతడు తలక్రిందులుగా నేలమీద పడవచ్చు. ఆ సమయంలో అతని వెనుకవున్న స్త్రీ యేం చెయ్యాలి?

కాంచనలత: వెంటనే ఆ మగాణ్ణి పట్టుకుని పిచ్చాసుపత్రిలో వెయ్యాలి.

సరళా: చక్కగా చెప్పావ్. మన సమాజం స్థితి యీ రోజున సరిగా యిదే విధంగా వుంది.

కాంచన: మనం యేం చెయ్యాలో సూటిగా చెప్పండి సరళాదేవిగారూ.

సరళా: అదే చెబుతున్నాను. యీనాడు ప్రపంచాన్ని యేకచ్ఛత్రాధిపత్యంగా పాలిస్తున్న దెవరు?

కాంచన: మగవాడు.

సరళా: ప్రపంచాన్ని ఆపదలవైపు నడిపిస్తున్న దెవరు?

కాంచన: పురుషుడు.

సరళా: నేటి ప్రపంచంలోని ఉద్రేక పరిస్థితులకు కారకు డెవరు?

కాంచన: అతడే.

సరళా: (కోపంతో) అవునా? అటువంటప్పుడు మగ వాళ్ళను మనం అధికారంలోనుంచి ఎందుకు తొలగించకూడదు?

కాంచన: అవును. ఎందుకు తొలగించకూడదు?

సరళా: ప్రపంచపు జనాభాలో సగానికి పైగా వున్న స్త్రీలు—మైనారిటీ వర్గానికి చెందిన పురుషుల చేతిక్రింద యెందుకు వుండాలి? యింతకాలం నుంచీ యెందుకు వున్నారు?

కాంచన: మొగవాడు మనల్నేదో ఉద్ధరిస్తాడను కున్నాం.

సరళా: సరిగా అక్కడే మోసపోయాం మనం. రోజు రోజుకు మగవాడు తన అసమర్థతను బుజువుపరుచుకుంటున్నాడు. అధికార వ్యామోహంతో-దురాశతో - తనప్రక్కనున్న దేశంమీద మీసం దువ్వుతున్నాడు. రోషాలూ, కావేషాలూ పెంచుతున్నాడు. ఆటంబాంబులు తయారుచేసి పరీక్షచేస్తున్నాడు. పరాయిదేశం లోని పట్టణాన్ని కొట్టడంకోసం రాకెట్ తయారుచేస్తున్నాడు. తన శత్రుదేశంలోకూడా అమాయకులైన ఆడవాళ్లు, పిల్లలు వుంటారన్న జ్ఞానాన్ని పోగొట్టుకుంటున్నాడు. (ముందుకు వచ్చి) యీ పరిస్థితులలో స్త్రీలు చేతులుకట్టుకు కూర్చోవడానికి యెంతమాత్రం వీల్లేదు.

కాంచన: అవును. కొంపకు నిప్పుపెడుతూవుంటే యెలా చూస్తూ వూరుకుంటాం?

సరళా : కనక మనం యిప్పుడు చెయ్యవలసిందేమి టంటే... ముందుకు అడుగువెయ్యాలి. మొదట గ్రామాలను. పట్టణాలను ఆక్రమించాలి. తరవాత రాష్ట్రాలను మన అధికారంలోకి తీసుకురావాలి.

కాంచన : మీరు చెప్పింది బాగా నేవుంది. కాని ప్రస్తుతం మనం యేం చెయ్యడానికీ అవకాశం లేదు. మీరు పురోగమించాలనే ఆత్రుతతో మనస్థితి గుర్తించడం లేదు. మన చేతులకు యింకా సంకెళ్లు వున్న సన్న విషయం మీరు మరచిపోతున్నారు.

సరళా : సంకెళ్లు తెగిపోయే శుభముహూర్తం దగ్గరకు వస్తోంది.

కాంచన : సమాజంలో మనకు జరుగుతున్న అన్యాయాలు యింకా నిలిచిపోయే వున్నాయి.

సరళా : అవును. అది నిజమే. గత పదిసంవత్సరాల లోను మన మహిళాజగత్తు పురోగమించింది. కొన్ని హక్కులను సంపాదించింది. కొద్ది రోజులలోనే మనం పూర్తిస్వాతంత్ర్యాన్ని సంపాదించుకోగలమని ఆశిస్తాను.

కాంచన : మనస్థితి బాగుపడేవరకూ మనం యేమీ చెయ్యలేమనిపిస్తోంది.

సరళా : అటువంటి నిస్పృహకు మనలో తావు యివ్వవద్దు. మన లక్ష్యం ఒకటే. అది ప్రపంచాధిపత్యాన్ని సంపాదించడం. శాంతి సౌభాగ్యలతో ప్రపంచాన్ని పురోగమింప చెయ్యడం. అన్ని ఆటంకాలను తొలగించుకుని మన లక్ష్య సాధనకు ముందుకు పోదాం.

[కుడివైపునుంచి లోపలగా ఉషారాణి వస్తుంది. పంజాబీ డ్రెస్ వేసుకొంది. జుత్తు సుంద్రంగా ముడి వేసివుంది. అందం, చురుకుతనం కనిపిస్తున్నాయ్]

ఉషారాణి : (వస్తూనే) చూడండి సరళాదేవి గారూ! మీకు ఆ సేకపాదు 'కంప్లయింట్' చేశాను. మీరు ఒకసారి కూడా ఆ రాస్కెల్‌కు బుద్ధి చెప్పడం లేదు.

సరళా / కాంచన } : (ఆత్రుతతో) యేం? యేం జరిగింది?

ఉషా : (కోపంతో) యింకేం జరగాలి? ఆ గోడల నిండా పేర్లు రాశారా?

కాంచన : (నవ్వుతూ) అవును 'ఉషారాణి—రాణీ రాణి' అని పేర్లు వున్నాయ్. నేను వచ్చే టప్పుడు చూశాను.

సరళా : ఎవరు రాశారు?

ఉషా : ఇంకెవరూ? ఆ సుందరమ్మ కొడుకే. ఆడుగో! చూడండి. యెప్పుడూ—అక్కడే—మన ఆఫీసుకు తిన్నగా కూర్చుంటాడు. సుబ్బారావు కళ్ళు వాడూను.

సరళా : పూరుకో ఉషా! ప్రపంచజ్ఞానం లేనివాడు యెవడో యేదో బుద్ధితక్కువపని చేశాడనుకో. దానికి మనం ప్రాముఖ్యత యివ్వకూడదు వాడి అజ్ఞానానికి నవ్వుకొని—చూసీ చూడనట్లు పూరుకోవాలి.

కాంచన : అలా పూరుకోనే కొద్దీ వాళ్లు మరీ చెలరేగుతున్నారండీ.

ఉషా : సరిగా చెప్పావే కాంచనలతా! ఒకసారి యేం జరిగిందో తెలుసా? మన ఇందిరకు మెల్లకన్ను వుందని "ఏకాక్షి—ఏకాక్షి" అని అరవడం ప్రారంభించాడు. వెంటనే నేనేం చేశానో తెలిసిందా?

కాంచన : చెయ్యి చేసుకో లేదుకదా కొంపతీసి!

ఉషా : పలుగురిలోను చెప్పుతీశాను. మళ్లా వారంరోజుల వరకూ కంటికి కనిపించలేదు.

సరళా : ఉషారాణీ! నువ్వింకా చిన్నదానవు మనం యిటువంటి విషయాలను అంతగా పట్టించుకోకూడదు. మనం ఉన్నతాశయాలను సాధించుకోవడానికి ప్రయత్నించాలి.

ఉషా : ముందు—యీ దారితప్పిన యువజనాలనూ, రోమియోలను సంస్కరించాలి.

కాంచన : అది మనతరం కాదే ఉషా! అదే ఆడపిల్లలో అయితే ఇట్టే మార్పు తీసుకురాగలం. మగాడు బండరాయి లాంటివాడు.

ఉషా : మగాళ్లి బుర్రలను మరామత్తు చేసేవరకూ 'కో ఎగ్జిస్టెన్స్' పనికిరాదు. కోఎగ్జిస్టెన్సుకు తెలుగేమిటే కాంచనా?

కాంచన: సహజీవనం. దాన్ని యింకా విస్తృతంచేసి 'శాంతియుత సహజీవనం' అన్నారు మనవాళ్ళు.

ఉష: మనతో కలిసిమెలిసి తిరిగే అర్హతను మగాడు పోగొట్టుకుంటున్నాడు. మన చుట్టూ వున్న వాతావరణాన్ని పాడుచేస్తున్నాడు. తనతో కలిసి చదువుకుంటున్న అమ్మాయిలకి 'లవ్ లెటర్సు' రాస్తున్నాడు. గోడలమీద పేర్లు చెక్కుతున్నాడు

సరళా: ఇదంతా చూస్తూ వుంటే స్త్రీలకు ప్రత్యేకముగా స్కూళ్లూ, కాలేజీలు వుండాలనిపిస్తోంది.

ఉష: అదే నేను చెబుతున్నది! స్కూళ్లూ, కాలేజీలే కాదు. ఆఫీసులూ, లైబ్రరీలు, బ్యాంకులు, సినిమాలు, నాటకాలు, పాటకచ్చేరీలు— ఒకటేమిటి, అన్నీ స్త్రీలకు ప్రత్యేకంగా వుండవలసిందే!

కాంచన: అయితే మగాళ్ళను బహిష్కరించాలంటావా?

ఉష: (కోపంతో) లేకపోతే ఇంకా సహించి వూరుకోమంటావా?

కాంచన: దీనికోసం ఒక ప్రత్యేక ఉద్యమం లేవదీయవలసి వుంటుంది.

ఉష: తప్పకుండా! ఈనాడు మగవాడు చెయ్యిపెట్టిన సంస్థలన్నీ సర్వనాశనం అయిపోతున్నాయి.

సరళా: ఆ విషయం నేనూ ఒప్పుకుంటాను స్వార్థపరులయిన మగవాళ్ళు కొందరు పట్టణాలను వాళ్ళ చేతులలో పెట్టుకున్నారు. పాలించడం చేతకాక అందమయిన పట్టణాలను మురికికూపాలుగా మారుస్తున్నారు.

ఉష: ఎలక్షను రోజులలో మాత్రం చేతులు కట్టుకొని మనయిళ్ళకు వస్తారు అధికారం చేతిలోకొచ్చిన తిరవాత పలుకే బంగారమైపోతుంది.

కాంచన: అందుకే మన స్త్రీలు కొన్ని పంచాయితీలను ఆక్రమించుకున్నారు.

సరళా: ఈ మగవాళ్లు రోజురోజుకూ యిలా యెందుకు దిగజారి పోతున్నారా అని నాకు ఆశ్చర్యముగా వుంది.

ఉష: సరళాదేవిగారూ! మీకేం జాలిపడనవసరం లేదు కదా వాళ్ళమీద?

సరళా: జాలి, సానుభూతి, కరుణ మొదలైన సద్గుణాలన్నీ మనలోనే వున్నాయని మనం నిరూపించుకోవాలి. నారీ జగత్తు యావత్తు ముక్తకంఠంతో శాంతిని కాంక్షిస్తోందని లోకానికి చాటాలి.

ఉష: నేడు మగవారు చేస్తున్న పనులు లోకానికి నష్టం, దేశానికి అరిష్టం కలిగిస్తున్నాయి.

సరళా: అదే—యీ వార్షికోత్సవం రోజున—మన నూతన కార్యక్రమాన్ని స్థిరపరుచుకుందాం. (రిస్టువాచీ చూసి) టైం అయిపోతోంది. ఉషా నువ్వు లోపలికి వెళ్ళి వంటచేసి మేకప్ చేసుకో. వచ్చే అతిథులను మేం సత్కరించి కూర్చొబెడతాం.

ఉష: రెండు నిముషాలలో వేషం మార్చుకుంటాను. మగాళ్లను కూడా 'ఇన్వైట్' చేశారెందుకు?

సరళా: మన నాటకం చూస్తే—అద్దంలో చూసుకున్నట్లు—వాళ్ల ముఖం వాళ్లకే కనిపిస్తుందని— కబుర్లతో కూర్చుంటే టైం చాలదు. లోపలకు వెళ్ళు ఉషా. మన వాళ్లంతా అప్పుడే వేషాలు వేసుకూర్చున్నారు.

[ఉషారాణి ఎడమవైపు నిష్క్రమిస్తుంది.]

కాంచన: యీమధ్య నాయకుల ప్రసంగాలు చూస్తున్నారా సరళాదేవిగారూ.

సరళా: చూస్తున్నాను. వారూ కొంచెం రంగు మారుస్తున్నారు.

కాంచన: స్త్రీల పైన యెంతో జాగ్రత్త వుందట! 'ఉత్తమపౌరులు'గా పిల్లలను స్త్రీలు తీర్చిదిద్దాలట!

సరళా: ఆర్థిక పరిస్థితులు బాగుపడేవరకూ స్త్రీలు ఆ విషయంలో యేమీ చెయ్యలేరు. ఉదాహరణకు మన లక్ష్మమ్మగారిని చూడు. ఆవిడకు ఎనమండుగురు పిల్లలు. వాళ్ళ ఆయనకి ప్రభుత్వం యెనభై రూపాయలు జీతం యిస్తోంది. ఈ కరువు రోజుల్లో వాళ్ళు ఆ డబ్బుతో సంసారం యెలా గడుపుతారు? పిల్లల్ని యెలా పోషించుకుంటారు? ఆవిడ పిల్లలెప్పుడూ వూరిమీద వదిలేస్తుంది.

కాంచన: నాయకులు చేస్తున్న ప్రకటనలు చూస్తూ వుంటే స్త్రీలను కూడా వాళ్ళకు బాకాలుగా చేసుకోవడానికి చూస్తున్నట్లు కనిపిస్తోంది.

సరళా : చూస్తే మేమిటి కాంచనా! అప్పుడే కొంత మందిని చేరదీసి చిలుకపలుకులు పలికిస్తున్నారు.

[కుడివైపునుంచి రంగమ్మ చరచరా వస్తుంది. తల అక్కడక్కడ నెరిసింది. వయస్సు రమారమి 50 సంవత్సరాలు. వేషాన్నిబట్టి పూర్వసువాసిని అని తెలుస్తోంది.]

రంగ : (వస్తూనే) అయ్యయ్యో! యిదెక్కడి అన్యాయంరా దేవుడా! యీ ప్రారబ్ధం అందరికీ వచ్చిందా? నా కొంపకే వచ్చిందా?

సరళా : (ఆత్రుతతో సమీపించి) యేమండీ రంగమ్మగారు! యేమయ్యింది? యెందుకు శోకాలేస్తున్నారు?

రంగ : మీరు చేసిందేమైనా బాగుందీ? పైగా నేను శోకాలేస్తున్నానా? యెంతటి అన్యాయం వచ్చిపడిపోయిందిరా?

కాంచన : అమ్మమ్మగారూ! మీ ఉపోద్ఘాతం వినడానికి మా కిప్పుడు తీరుబడిలేదు. మీరు చెప్పదల్చుకున్న దేదో రెండు మాటల్లో చెప్పెయ్యండి.

రంగ : ఖర్మ! యేం చెప్పడానికి నోరు రాకుండా వుందికదా! బంగారంలాంటి కొంప! ఆఫీసు పెట్టుకుంటాం అంటే యిచ్చేను

సరళా : ఇప్పుడు మీ కొంపకేం వచ్చిందండీ?

రంగ : ఇంకేం రావాలే నా తల్లీ! గోడలనిండా ఆ రాతలేమిటి? ఆ కూతలేమిటి?

[ఉషారాణి తొందరగా యెడమవైపునుంచి వస్తుంది.]

ఉషా : (బిగ్గరగా) యేమిటిది?

రంగ : (ఉషారాణిని చూసి) హవ్వ! మీ ఆఫీసులో మొగాడుకూడా వున్నాడటర్రా!

కాంచన : (నవ్వుతూ) మొగాడు కాదండీ అమ్మమ్మగారూ! అది మన ఉషారాణి. పంజాబీ డ్రెస్ వేసుకొంది.

రంగ : దిక్కుమాలిన కాలం! ఆడదెవరో మగాడెవరో తెలుసుకోడానికి వీల్లేకుండా వుంది.

సరళా : ఉషా! నువ్వు వెళ్ళి పనిచూసుకో! మేం రంగమ్మగారితో మాట్లాడతాంలే.

[ఉషారాణి తిరిగి ఎడమవైపు నిష్క్రమిస్తుంది.]

కాంచన : దారినిపోయే గాడిదలకో గోడలమీద పేర్లు రాస్తే మేం యేం చెయ్యగలమండి రంగమ్మగారూ?

రంగ : మూసికపోతే మీ కీ కొంపలో వుండి యేం చేస్తున్నార్రా?

సరళా : మేం కొంపనూ, గోడల్నీ కాపలా కాచుకు కూచోడానికి కాదు యిక్కడ వున్నది. మేం చెయ్యవలసిన పనులు యెన్నో వున్నాయి — మీ గోడలకు సున్నం వేయిస్తాం లెండి. మరేం ఫరవా లేదు.

రంగమ్మ : ఇదెక్కడి కాలం వచ్చిపడిపోయిందిరా దేవుడా! ఆడది మున్నూట యిరవై రోజులా యిల్లు కాచుకునే వుండాలి. అందుకే గృహలక్ష్మి అన్నారు. 'తిరిగి ఆడది చెడిందట! తిరక్క మగాడు చెడాడట!'

కాంచన: అమ్మమ్మగారూ! అవన్నీ మీ చిన్నప్పటి సంగతులు. స్త్రీ తన చుట్టూ హద్దులు గీసుకొని కూర్చోనక్కరలేదు. ఒకవేళ స్వార్థపరులెవరైనా హద్దులు యేర్పరిస్తే వాటిని చెరిపి పారేస్తాం

రంగ: (కోపంతో) తిరగకూడదర్రా అని శాస్త్రం చెబుతోంది. తిరుగుతాం! గంగలో దూకుతాం అంటే అది మీ ఖర్మ.

సరళా: శాస్త్రాలను సృష్టించిందెవరు?

రంగ: మహా ఋషులు.

సరళా: ఆ ఋషిపుంగవులందరూ యెవరు?

కాంచన: పురుషులు.

సరళా: కనక మగవాళ్ళు రాసిన శాస్త్రాలను మేం నిషేధిస్తున్నాం. మనకు అనుకూలమైన సిద్ధాంతాలను—మన సమస్యలతో జోడించి—కొత్త శాస్త్రాలను మనమే నిర్మించుకుంటున్నాం.

రంగ: ఇదెక్కడి ఘోరకలిరా భగవంతుడా! ఋషుల నేమైనా అంటే కళ్ళుపోతాయి. ఎంత యిదైనా అంత పురుషద్వేషం కూడదర్రా!

కాంచన: తరతరాలుగా మగాడు చేస్తున్న దౌర్జన్యాలకు యీనాడు స్త్రీలు ప్రతీకారం చేసి తీరతారు. వాళ్ళు చేసిన ఘోరాలు యిన్నీ అన్నీ కావు.

రంగ: అయితే మగాళ్ళమీద కారాలు, మిరియాలు నూరుతూ కూర్చుంటారా యిక్కడ?

సరళ: వట్టి కబుర్లు చెప్పడం కాదు పనిచేసి చూపిస్తామండి.

రంగ: మీరు నూరు చెప్పండి. వెయ్యి చెప్పండి. మగవాడు మగవాడే.

కాంచన: కాదని యిప్పుడెవరన్నారూ?

రంగ: అలిగాడు చేసేపనులు వెయ్యి జన్మలెత్తినా మీరు చెయ్యలేరు.

కాంచన: (నవ్వుతూ) ఒహోహో! యేం మాట చెప్పారమ్మమ్మగారూ! మగాళ్ళని మేం యేనాడో చిత్తుగా ఓడించేశాం. పరీక్షలలో వాళ్లు దండయాత్రలు చేస్తూవుంటే మేం ఫస్టుక్లాసులో పాసయ్యాం. ఈనాడు స్త్రీలు ప్రత్యేకంగా బ్యాంకులు నడుపుతున్నారు. కాలేజీలు నిర్వహిస్తున్నారు. అన్ని ఉద్యోగాలలోను తమ శక్తి సామర్థ్యాలను చూపిస్తున్నారు.

సరళ: స్వల్పకాలంలో అన్ని రంగాలలోను అభివృద్ధి సాధించాం. ఇక కొద్దిరోజులలో దేశాన్ని పాలించే బాధ్యత కూడా మేం తీసుకోబోతున్నాం.

రంగ: ఇక మగాళ్ళ నందరినీ వంటచెయ్యమంటారా?

కాంచన: ప్రపంచాన్ని తగలబెడుతూవుంటే చూస్తూ వూరుకుంటామటండీ?

రంగ: (హేళనగా) వాళ్ళు తగలబెడుతున్నారు. ఇక మీరొచ్చి జలగ బెడతారు.

సరళ: చూడండి రంగమ్మగారూ! దూరాన్నుంచి చూస్తూవుంటే పరిస్థితి సరిగా తెలియదు. మీరు రోజూ మా సమావేశాలకు రండి. దగ్గర వుండి అన్నీ చూడండి. కొన్నిరోజుల్లో మీరుకూడా మా వాదాన్ని అంగీకరిస్తారు.

రంగ: సంతోషించాంగానీ మీరు వేగం యీ కొంప ఖాళీ చెయ్యండి. యేదో ఆఫీసు పెట్టుకుంటాం అమ్మమ్మగారూ అంటే అద్దెకిచ్చాను.

సరళ: మీ అద్దె మీకు సరిగా చేయిస్తున్నాం కదండీ!

రంగ: అయితే? నా కొంపలో యిలాంటి అప్రాచ్యపు పనులు జరుగుతూవుంటే చూస్తూ వూరుకోనా? మన శాస్త్రాలన్నీ పతిని పూజించమని ఘోషిస్తున్నాయి. మా ఆయన—దివ్యలోకంలో వున్నాడో మహారాజు—నన్ను దాకగొట్టి చెవులు మూసేవారు. మళ్లీ ఆ సాయంత్రానికే నన్ను దగ్గరికి పిలిచి చిలకపలుకులు పలికేవారు.

కాంచన: అంటే పెంపుడు కుక్కను చూసినట్లు చూసేవారన్నమాట!

రంగ: (కోపంతో) పెద్దాచిన్నా లేదూ? నోటికొచ్చినట్లు కూస్తున్నావ్. రాచ్చిప్పలా మొహం నువ్వూను!

సరళ: కోప్పడకండి అమ్మమ్మగారూ! కాంచన దురుద్దేశంతో ఆ మాట అనలేదు. మగాళ్లు మనల్ని హీనంగా చూశారని చెప్పడానికి అలా అంది.

రంగ: మా కాలంలో మేం యెప్పుడూ యిలాంటి పోకిరీ వేషాలు వేస్తూ కూర్చోలేదు. కట్టుకున్న మొగుడికీ, పిల్లలకీ యింత గంజి కాచిపోసి—రామాకృష్ణా అంటూ కాలం గడిపేవాళ్ళం.

కాంచన: అమ్మమ్మగారూ! మీరు మర్యాదగా మాట్లాడాలి. పోకిరీ వేషాలేమిటి? మేం యేం వేషాలు వేస్తున్నాం?

రంగ: రెండు కళ్ళూ సరిగ్గావున్న వాళ్ళందరికీ కనిపిస్తూనే వుంది మీ వేషం. మా కాలంలో మేం తలవెనుక కొప్పు పెట్టుకొని దానిమీద ముచ్చటగా పువ్వులు ముడుచుకొనేవాళ్ళం. యీ రోజుల్లో కుర్రాగాడి జుత్తులాగ నడినెత్తిమీద కొప్పూ మీరూను యిది సంసారి వేషమే నట్రా?

సరళ: ఏమీ అభివృద్ధిలేకుండా మీ అమ్మమ్మగారి కాలంలో వున్నట్టే వుండమంటారా మమ్మల్ని?

రంగ: యెంత నాగరికం అయినా అంత యిది పనికిరాదర్రా. పెదాలికి రంగులు! వళ్లు కనిపించే లాంటి చీరలు! గొర్రె కొమ్ముల్లాంటి జుత్తు—మగాళ్లు మీ వెనక పడ్డారంటే వుత్తినే పడతారటర్రా?

కాంచన: (కోపంతో) మీకు యీ కాలపు మొగాళ్ళ సంగతి తెలియకుండా వుంది.

రంగ: ఎందుకు తెలియదే చిట్టితల్లీ! మగమహారాజు! వాడేంచేసినా చెల్లుతుంది.

కాంచన: (కోపంతో) ఎలా చెల్లుతుందో మేమూ చూస్తాం. మగవాడు అమాయకురాలైన ఆడపిల్ల చుట్టూ వలపన్నుతున్నాడు. ఆమెను పతితం చేస్తున్నాడు. తిరిగి తనే ఆమె మీద జాలి నటిస్తున్నాడు. పతిత జనోద్ధరణ అంటున్నాడు. అనాధ శరణాలయాలు నిర్మిస్తున్నాడు.

సరళా: అమ్మమ్మగారు! మీరు తెలుసుకోకుండా వున్నారు కాని మన స్త్రీలకు ఘోరమైన అన్యాయం జరుగుతోంది.

కాంచన: పతిత జనోద్ధరణకోసం లక్షలకొద్దీ డబ్బు ఖర్చుపెడుతున్న వారికి నేనొక సలహాయిస్తాను. విచ్చలవిడిగా తిరుగుతూ సమాజానికి అపకారం చేసే మగవాళ్లనందర్నీ పట్టుకొని ప్రత్యేకశరణాలయంలో వెయ్యండి. దానితో మనసమాజంలో పతితస్త్రీలు మచ్చుకు కూడా కనిపించరు.

రంగ: బాగుందేతల్లీ బాగుంది. మొగాళ్లని శరణాలయాల్లోను, ఖైదుకొట్లల్లోను పెట్టించి-యిక మీ ఆడరాజ్యం వెలిగించండి—మగరాయిళ్లలా తయారై మగవేషాలేసుకొని అధికారాలు చెస్తారట. వాళ్లని ఆక్షేపిస్తారట! పనికటి కెవడో వెక్కిరించబోయి నెల్లకితలాపడ్డాడట!!

సరళా: రంగమ్మగారూ, (కుడివైపు చూపిస్తూ) మీరు ఆ ముందటి వరుసలో కూర్చోండి. సానుభూతితో చూడండి. మన స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను శ్రద్ధగాపరిశీలించండి. యిదుగో! యిటు చూడండి.

[హాలులో దీపాలుఆరిపోతాయి; మరోక్షణంలో రంగస్థలంమీద నీలికాంతి ప్రసరిస్తుంది. కాంచన లత కుర్చీలో కూర్చుని పేపరు చదువుతోంది. దూరాన్నుంచి వీణా రావం వినిపిస్తోంది. కుడివైపునుంచి యమునపద్మినిని తీసుకువస్తుంది. యిద్దరూ 20 సంవత్సరాలలోపు యువతులు. పద్మిని ముఖంలో విషాదచ్ఛాయలు కనిపిస్తున్నాయి. తలఎత్తిచూడలేకపోతోంది.

యమున: (వస్తూనే) కాంచనలత గారూ!

కాంచన: రా! యమునా!—యెవరీమె?

యమున: మరొక అభాగిని.

కాంచన: (లేచి యిద్దర్నీ పరీక్షించి) యీమెకు తల్లి దండ్రులూ, బంధువులూ యెవరూ లేరా?

యమున: అందరూవున్నారు. కానీ యేం లాభం? వారి కంటికి కనిపించే అర్హత లేదీమెకు.

కాంచన: యేమైనా తప్పుచేసిందా?

యమున: అది తప్పుకాదు. వారిదృష్టిలో ఘోరమైన నేరం!

కాంచన: (చలించి) యేమిటి యమునా నువ్వు చెబుతున్నది? యీమె యెవరికీ విషం పెట్టలేదుకదా?

యమున: ఈమె అటువంటి పాపపుపని చెయ్యలేదు. తనకు తానే విషంతాగడానికి సిద్ధంగావుంది. యిక యేక్షణంలోనైనా ఆత్మహత్య చేసుకుంటుందని గ్రహించాను. వెంటనే ధైర్యం చెప్పి యిక్కడికి తీసుకు వచ్చాను.

కాంచన: మంచిపని చేశావు. (పద్మినితో) మేం వున్నంతకాలం నీకేమీ భయంలేదు—నీపేరేమిటి?

పద్మిని: (బెరుకుగా చూస్తూ) పద్మిని.

కాంచన: (లాలిస్తూ) నువ్వేం చేశావమ్మా? నిన్నెందుకు నీవాళ్ళు వదిలేశారు?

[పద్మిని మాట్లాడదు]

యమున: ఈమెకు—పాపం—పెళ్ళయిన సంవత్సరానికి భర్త పోయాడట! యిక యేమీ దారి లేక తనదారి తాను చూసుకుంటుందని—యీమె తండ్రి యీమెను తిరిగి కాలేజిలో వేశాడు.

కాంచన: పాపం! మంచిపనే చేశాడు.

యమున: ఆ మంచిపనే యిప్పుడు చెడ్డగా తయారై పూరుకొంది.

కాంచన: యేం? యేమయ్యింది?

యమున: ఇంకేం కావాలి? యీమెను ఒక మగవాడు ప్రేమించాడు.

కాంచన: దిక్కుమాలిన ఖర్మ, యీ మొగాళ్ళకి ప్రేమించటంతప్ప వేరే పని వున్నట్లు కనిపించటం లేదు—ఊఁ! ఆ తరవాత యేమయ్యింది?

యమున: నిన్ను పెళ్లిచేసుకుంటానన్నాడు. నా హృదయానికి రాణిని చేస్తానన్నాడు. అందమైన కారులో కూర్చోబెడతానన్నాడు. అలాగే కూర్చోబెట్టి ఒకరాత్రికి రాత్రి వూరు దాటిం

చేశాడు. భూలోక స్వర్గంవంటి సముద్రతీరంలో విహారానికి తీసుకువెళ్లాడు. చివరకు తల్లి దండ్రుల మాటకు జవదాటలేక ఆ అపరశ్రీరామ చంద్రుడు — నలచక్రవర్తిగా మారిపోయి యీమెను అరణ్యంలాంటి పట్టణంలో అర్ధ రాత్రివేళ వదిలేసి వెళ్లిపోయాడు.

పద్మిని: (రెండుచేతులతోనూ ముఖం కప్పుకుంటుంది.)

కాంచన: అమ్మాయీ! పద్మినీ! మగవాడు మనకంటికి కనిపించినట్లు వుండడు. అతని లోపల నిజమైన మనిషి దాగివుంటాడు. అతనిని గుర్తుపట్టడం కష్టసాధ్యం.

యమున: తరవాత కథకూడా వినండి. యీమె అక్క యీ వూళ్లోనే కాపురం చేసుకుంటోంది. యీ పద్మిని మరునాటి ఉదయం పట్టణమంతా గాలించి యిక చేసేదిలేక అక్కగారిల్లు చేరుకొంది.

కాంచన: పోనీ 'సుడిలో మెల్ల' అన్నట్టు ఒక దరికి చేరుకొంది.

యమున: అప్పుడే దరి కెక్కడ చేరుకొంది ఖర్మ! ఆ అక్కగారు యీమెను చూడగానే కలరా పేషెంటును చూసినట్లు ఉలికిపడిందట!

కాంచన: అదేం?

యమున: ఆవిడ భర్త అగ్గిరాముడు లాంటివాడట! యీమెను చేరదీస్తే యిద్దర్నీ కలిపి అతగాడు బయటకు పంపించవచ్చుట. అందువల్ల యీ పద్మిని అక్క వెంటనే నాకు కబురు పంపింది. యీమెను అనాథశరణాలయంలో చేర్పించమని నన్ను ప్రతిమాలింది. నేను తీసుకువచ్చాను. యిదీ కథ.

కాంచన: యెంత అన్యాయం! యీమెను నిర్దాక్షిణ్యంగా సమాజం బయటకు పంపింది. ఇదే నేరంచేసిన యువకుణ్ణి యేమీ చెయ్యలేక పోయింది.

యమున: మన సమాజం రెండు నాలుకలతో తీర్పు చెబుతోందండి.

కాంచన: (కోపంతో) అదీ యెంతకాలంసాగుతుందో చూద్దాం. (పద్మినితో) అమ్మాయీ! నీకు యిక్కడేమీ భయంలేదు. నీ స్వంతయిల్లులా నువ్వు స్వేచ్ఛగా వుండొచ్చు. ఇక నువ్వు గతాన్ని మరిచిపో! అద్యతనభావిలో నూతన యుగం ఉదయిస్తుంది. ఆనాడు ప్రపంచంలో కోమలహృదయులైన స్త్రీలదే పైచేయి అవుతుంది.

[రంగస్థలాన్ని చీకటి ఆవరిస్తుంది. ఉత్తర క్షణంలో మసక వెలుతురు కనిపిస్తుంది. క్రమ క్రమంగా వెలుగు అధికమౌతుంది. పద్మిని సూదీ దారం పట్టుకొని పువ్వులు అల్లుతూ కూర్చుంది. వీణ వాయిస్తున్న — శ్రావ్యమైన ధ్వని—వినిపిస్తోంది. యమున చప్పుడు కాకుండా వెనుకనుంచివచ్చి పద్మిని కళ్లుమూస్తుంది.]

పద్మిని: (ఉలికిపడి) ఎవరది?

యమున: ఎవరో చెప్పుకో.

పద్మిని: (చేతులు విడిపించుకొని) నువ్వా యమునా?

యమున: మరి యెవరనుకున్నావ్? అంతభయపడ్డావ్.

పద్మిని: అసలు నా బ్రతుకే భయంతో ఆరంభ మయ్యింది.

యమున: నువ్వు యిక్కడికివచ్చి సంవత్సరం అవుతోంది. అయినా నీకు పాతవాసనలు, పాత భయాలూ యింకా తగ్గలేదు.

పద్మిని: (నవ్వుతూ) అప్పటికీ యిప్పటికీ మార్పు లేదంటావా యమునా?

యమున: చాలా మారావు. ఇంకా పూర్తి మార్పు రావాలి.

పద్మిని: అంటే?

యమున: సిగ్గు, సంకోచం లేకుండా వున్నమాట మొహం మీద అనెయ్యడం; మగాళ్లను చూసి బెదరకుండా వుండడం వగైరా.

పద్మిని: నలుగురిలో కలిసి తిరగడానికి నాకు యేదోలా వుంటుంది.

యమున: అంటే నీ మనసులో నిన్ను నువ్వే కించపరుచుకుంటున్నావన్నమాట!

పద్మిని: అది సరికాదు.

యమున: కాకపోవడమేమిటి? అది నూటికి నూరుపాళ్లు నిజం. నువ్వు గతాన్ని విస్మరించడం లేదు.

పద్మిని: చాలావరకూ మరిచిపోయాను. లేకపోతే యిలాగైనా వుండగలనా?

యమున: ఇదిగో పద్మినీ! ఖచ్చితంగా చెబుతున్నాను. విను. యీ శరణాలయంలో నువ్వెంతో, మన కార్యదర్శిని కాంచనలత కూడా అంతే. అందరం సరిసమానమే నువ్వేదో తెలియక పొరపాటు చేసినంతమాత్రాన్ని నువ్వు దిగజారిపోయినట్లు భావించకు. నూతనయుగం వస్తోంది. నీలాంటి—మోసపడిన, దగాపడిన యువతులే ప్రపంచాన్ని పాలించే రోజులు దగ్గరకు వస్తున్నాయి. కాలంతో పాటు మనం కూడా పురోగమిస్తున్నాం. ఉత్సాహంతో వుండు. ఇప్పుడే వస్తాను.

[యమున నిష్క్రమిస్తుంది. పద్మిని ఒక నిట్టూర్పు విడిచి — తిరిగి అల్లుతూవుంటుంది. దూరాన్నుంచి సంగీతం హెచ్చు స్థాయిలో వినిపించి తగ్గుతుంది. కుడివైపు స్తంభంమీద 'స్పాట్ లైట్' పడుతుంది. ఆ కాంతిలో ఒక పురుషుడు కనిపిస్తాడు. సూట్, ఈవెనింగ్ హేట్ సన్నని మీసం—రెప్పవెయ్యకుండా పద్మిని వైపు చూస్తాడు.]

పురుషుడు: (ముందుకూ వెనుకకూ చూసి నెమ్మదిగా) పద్మినీ!

పద్మిని: (ఒక్కసారి అటుచూసి ఉలికిపడుతుంది. చేతిలోని సూదీ, దారం జారవిడిచి లేచి నిలుచుని) ఎవరు? గోపాలం?

పురు: నేనే పద్మినీ! గుర్తుపట్టలేదా?

పద్మిని: (కోపంతో నెమ్మదిగా) యెందుకువచ్చావిక్కడికి? ముందు బయటకువెళ్ళు.

పురు: నిన్ను చూసిపోదామని వచ్చాను పద్మినీ! కన్ను మూసినా, కన్ను తెరిచినా నిన్ను మరిచి పోలేకుండా వున్నాను.

పద్మిని: (ఎరుపెక్కిన మొహంతో) మాటలకు మోసపోయే రోజులు వెళ్లిపోయాయి. నువ్వు మోసం చేసి నట్టేటిలో ముంచిన పద్మిని గతించింది. యిక ఆమె గురించి ఆలోచించకు. ఈ కొత్త పద్మిని అసలే మంచిది కాదు. నీకు బుద్ధిచెప్ప గలదు. జాగ్రత!

పురు. కోపపడకు పద్మినీ. సానుభూతితో ఆలోచించు. అప్పుడు పరిస్థితులలా ముంచుకు వచ్చినై. మావాళ్ళు నన్ను నడివీధిలో పట్టుకొని బలవంతంగా తీసుకుపోయారు. నా అంతట నేను పారిపోలేను.

పద్మిని: (కోపంతో) బలవంతంగా తీసుకుపోయి నీ చేత మరో అమాయకురాలి మెడలో ఉరిత్రాడు వేయించారు. అంతేకదూ!

పురు: నా పాపం విను నీకు మంచి అనిపిస్తే నన్ను కరుణించు. ఎంత ప్రయత్నించినా నిన్ను మరిచిపోలేకుండా వున్నాను. ఆకాశంలో కిల కిల నవ్వే చంద్రబింబాన్ని చూస్తే నీ ముఖమే జ్ఞాపక మొస్తోంది. వికసించిన గులాబీలను చూస్తే నీ పెదవులమీద చిరునవ్వులు జ్ఞాపకం వచ్చి నన్ను కలవర పెడుతున్నాయి. ఆకాశంలో తారాడే మేఘ శకలాలను చూస్తే...

పద్మిని: (మనస్సులో అందుకొని కోపంతో) అధిక ప్రసంగం చెయ్యకు. మర్యాదగా పోతావా? అందరినీ పిలిచి బుద్ధి చెప్పించమంటావా?

పురు: (భయంతో) ఆఁ! ఆఁ! అంత పనిమాత్రం చెయ్యకు. ఈ దీనుణ్ణి జ్ఞాపకం వుంచుకో. మరోసారివచ్చి కనిపిస్తాను. యిదిగో! నా చిరునామా! అవసరమైతే సందేహించకు.

[ఒక కాగితం ఆమె ముందు విసిరి తొందరగా నిష్క్రమిస్తాడు. వెనువెంటనే కాంచనలత, యమున మరోవైపునుంచి వస్తారు]

కాంచన: (వస్తూనే బిగ్గరగా) ఎవరది? నీతో మాట్లాడుతున్న ఆ యువకుడెవరు? జవాబు చెప్పు. నీ ప్రవర్తన అనుమానంగా వుంది. పవిత్రమైన యీ శరణాలయంలో అడుగుపెట్టి అపవిత్రం చేసిన ఆ పురుషుడెవరు?

పద్మిని: (భయంతో యేం చెప్పడానికీ తోచక తడబాటుతో) అ...అతనేనండి.

యమున: సంకోచించకు. నిజం చెప్పు పద్మినీ! యేమంటున్నాడతను?

కాంచన: యింకేమంటాడు? నువ్వు లేకపోతే బ్రతకలేనంటాడు. యింకా చూస్తూ వూరుకుంటే ఉరిపెట్టుకొని చస్తానంటాడు.

పద్మిని: అంతేనండి. అంతే! అలాగే అంటున్నాడు.

యమున: అటువంటివాణ్ణి మైలుదూరంలో వుంచాలి.

కాంచన: అలాంటి దౌర్భాగ్యుడికి జీవితంలో మరిచి పోలేని గుణపాఠం చెప్పాలి. (క్రింద పడివున్న కాగితం తీస్తూ) నీ కేదో ప్రణయ లేఖ కూడా రాసినట్టున్నాడే!

పద్మిని: లేదండి. అది అతని అడ్రెస్. నా ముందు పారేసిపోయాడు.

కాంచన: (అడ్రెస్ చూసి) యిది ఒకందుకు మంచిదే, యితని సంగతి నేను తేలుస్తానులే!

[రంగస్థలాన్ని చీకటి ఆవరిస్తుంది. స్పాట్ లైట్ వెలుగులో సునందిని కనిపిస్తుంది. కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుతోంది. కళ్లు లోతుకుపోయివున్నాయి. నలిగిన గులాబిలా ఆమెలో అందం యింకా మిగిలి వుంది. అడుగుల సవ్వడికి ఆమె తలయెత్తి చూస్తుంది. పురుషుడు కనిపిస్తాడు. అతన్ని చూడగానే లేచి నిలబడుతుంది.]

సునందిని: యింత ఆలస్యంగా వచ్చారేం?

పురు: (చిరాకుతో) ఓహో! నీ కిప్పుడు సంజాయిషీ చెప్పుకోవాలి కాబోలు!

సునందిని: మీరు యింట్లో ఒక క్షణమైనా వుండటం లేదు. ఎప్పుడూ యెక్కడికో వెళ్ళిపోతూనే వుంటారు నా కేమీ తోచకుండా వుంది.

పురు: ఇరవై నాలుగ్గంటలూ నీ ముఖం చూస్తూ యింట్లో కూర్చోమంటావా?

సునం: అదేమిటండీ అలా అంటారు? నా మొహానికేం? మీరు పెళ్లయిన కొత్తలో నా మొహాన్ని ఎంత పొగిడేవారు! హాలీవుడ్ తార మొహంలా వుందనే వారు. ఆ తార పేరు కూడా యేదో చెప్పారు. అవా గార్డినరో లేక రీటా...

పురు: (మధ్యలో అందుకొని) అబ్బబ్బ! ఆ పాత విషయాలు నా దగ్గర యెత్తకు. ఈ కాలపు ఆడవాళ్ల మొహాలు—ఒక బిడ్డతల్లయిన తర్వాత చూడలేం. కోటాకడిగేసిన సినిమా తార మొహంలా తయారై వూరుకుంటాయి.

సునం: బిడ్డ తండ్రయిన తరవాత పెద్దవాళ్లు అలవాట్లు మార్చుకోవాలండీ.

పురు: (కోపంతో) నీ ఉద్దేశం?

సునం: మీరు కొత్త యిల్లు కనిపెట్టుకొని వుండాలి.

పురు: అదియెంతమాత్రం వీల్లేదు. నీకోసం, యీపాడు సంసారంకోసం — నా ఆనందాన్ని చంపుకోలేను.

సునం: అటువంటప్పుడు పెళ్ళెందుకు చేసుకున్నారు?

పురు: గతి లేక.

సునం: మా తండ్రి మీరు కోరినంత కట్నం యిచ్చారు. కారుదగ్గరనుంచి మీ కోరికలన్నీ తీర్చారు. ఎందుకోసం? నేను సుఖపడతానని కాదా?

పురు: ఏం? నువ్విప్పుడు దుఃఖపడుతున్నావా?

సునం: నే నెలావున్నదీ మీరే నిష్పక్షపాతంగా చెప్పండి. పెళ్లయిన ఆరునెల్లవరకూ మీరెంత బాగావున్నారు? యిక అక్కడనుండి రోజు రోజుకూ నన్ను నిర్లక్ష్యంగా చూస్తూవచ్చారు. యీనాటికి నన్ను పాతచెప్పులా తీసి ఒకమూల పారేశారు.

పురు: నీకు యిక్కడ అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేశాను. నీ కేమీ లోటురాకుండా చూస్తున్నాను.

సునం: జైల్లో ఖైదీని చూసినట్టు.

పురు: (కోపంతో) అధిక ప్రసంగం చెయ్యకు. నీకోసం నేను నా సంతోషాన్ని చంపుకోలేను. నీకు యిష్టంవుంటే యిక్కడ వుండొచ్చు. నీకు కష్టంగావుంటే తిన్నగా పుట్టింటికి వెళ్లొచ్చు.

సునం: నాకు పుట్టింటికివెడితే యేమీ లోటుజరగదు. అయినప్పటికీ యెంతకాలం పుట్టింటిలో వుంటాను?

పురు: నన్ను అనవసరంగా రెచ్చగొట్టకు. నీకు తోచినంత కాలం మీ పుట్టింటిలో వుండు. నీకు యిప్పుడే చెబుతున్నాను. నేను తిరిగివచ్చేసరికి యేడుపుముఖంతో నువ్వు యిక్కడ వుండకూడదు. వున్నావా నేను సహించను. యీ రాత్రిబండికే వెళ్ళిపో.

సునం: మొన్ననే కదండీ నేను పుట్టింటినుంచివచ్చింది. మళ్లా యే మొహం పెట్టుకు వెడతానండీ?

పురు: నువ్వు వెళ్ళకపోతే నేను మెడపట్టుకొని బయటకు గెంటవలసి వుంటుంది జాగ్రత్త! నీ మర్యాద నువ్వు కాపాడుకో. నేను తిరిగి వచ్చేసరికి యిల్లు ఖాళీచెయ్యి.

(ఆవేశంతో నిట్టూర్పు విస్తారు. సునందిని పైట చెంగుతో కన్నీటిని తుడుచుకోవడానికి ప్రయత్నిస్తూ వుంటుంది. కాంచనలత వస్తుంది.)

కాంచన : (సునందినిని గుర్తించి) సునందినీ!

సునం : (కళ్లు తుడుచుకొని) మీరా? యిలా వచ్చారేం?

కాంచన : పనిమీద వచ్చాలే! చూడు. యిప్పుడు దురుసుగా వెళ్ళిపోతున్నాడు అతడేనా మీ ఆయన?

సునం : అవునండీ!

కాంచన : నువ్వు యేడుస్తున్నా వెందుకు?

సునం : అబ్బే యేం లేదండి.

కాంచన : నిజం చెబుదూ! మీవారు యేమన్నా అన్నారా?

సునం : పుట్టింటికి వెళ్లిపోమంటున్నారు.

కాంచన : యేం? యెందుకు?

సునం : నా మొహం చూడ్డం యిష్టం లేకట!

కాంచన : నిన్ను మొదటినుంచీ అయిష్టంగానే చూశారా?

సునం : లేదండీ. మొదటి రోజులలో నన్నెంతో బాగా చూసేవారు. తరవాత తరవాత యిలా తయారయ్యారు.

కాంచన : సునందినీ! యిందుమిందుగా మొగాళ్లందరూ యింతే. సంవత్సరం గడిచేసరికి కట్టుకున్న స్త్రీమీద ఆకర్షణ తగ్గుతుంది. యిక అక్కడి నుండి హింసాకాండ ప్రారంభమవుతుంది.

సునం : మీరు వచ్చినపని చెప్పారు కారు.

కాంచన : అదే చెబుతున్నాను. మా కిరణాలయంలోని ఒక అమ్మాయికి మీ ఆయన—సేవ చేస్తానని మాట యిచ్చి వెళ్ళిపోయారు. వెతుక్కుంటూ యిక్కడికి వస్తే నువ్వు కనిపించావు. యింతవరకూ నీకు పెళ్ళయినట్లే నాకు తెలీదు.

సునం : (ఆశ్చర్యంతో) అమ్మాయికా? యెవ్రవరా?... యెందుకిచ్చారు?

కాంచ : అదంతా తరవాత చెబుతాను. కాని నువ్వు నేను చెప్పినట్లు వినాలి. మనం అంతా కలిసి ఒకసారి పాఠం చెబితే మీ ఆయనకు కొంచమైనా జ్ఞానోదయం కావచ్చు.

సునం : యేం చెయ్యమంటారో చెప్పండి.

కాంచ : నువ్వు పుట్టింటికి వెళ్ళిపోతున్నట్టు ఒక చీటీ రాసి యిక్కడపెట్టి నాతో కిరణాలయానికి రావాలి. మిగిలిన కథ నేను నడిపిస్తాను. యిక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు.

[సునందిని కాగితం కలం తీసి ఉత్తరం రాసి మడతపెట్టి కుర్చీ మీద పెడుతుంది. కాంచన లత, సునందిని తొందరగా నిష్క్రమిస్తారు— రంగస్థలాన్ని తిరిగి చీకటి ఆక్రమిస్తుంది. స్పాట్ లైట్ కాంతిలో పద్మిని కనిపిస్తుంది. కుర్చీలో కూర్చుని టేబిలు మీద పుస్తకం పెట్టి రాస్తూ వుంది. కాంచనలత వస్తుంది.]

కాంచన : (నెమ్మదిగా) యింకా రాలేదా?

పద్మిని : లేదండి. నా కెందుకో భయంగా వుందండి.

కాంచన : యిటువంటప్పుడు భయపడితే పరిస్థితి అంతా తారుమారు అవుతుంది. చాలా నేర్పుగా నటించాలి. అతడు రాగానే చిరునవ్వుతో ఆహ్వానించు—కూర్చోపెట్టు. మిగిలిన మాటలన్నీ అతనే అనేస్తాడు. మేం వెనుకనుంచి అంతా కనిపెడుతూ వుంటాం. అవసరమైతే గాని రంగం మీదికి వస్తాం. నువ్వేం భయపడకు.

[కాంచనలత నిష్క్రమిస్తుంది. పద్మిని తిరిగి రాస్తూవుంటుంది. స్తంభం వెనుక పురుషుడు కనిపిస్తాడు]

పురు : (చుట్టూ చూసి నెమ్మదిగా) పద్మినీ!

పద్మిని : (తలయెత్తి చూసి చిరునవ్వుతో) రండి.

పురు : (ముందుకువచ్చి) పద్మినీ, నువ్వు నమ్ముతావో లేదో—మొన్న నిన్ను చూచి వెళ్ళినప్పటి నుంచీ నా మనసంతా కలిగిపోయింది. వినయంలో నీ ముందు పంజాయిషీ యిచ్చుకున్నాను. అయినా నువ్వు సంతృప్తి పడలేదు.

పద్మిని : ఇప్పుడు కొంచెం అర్థం చేసుకున్నానులెండి.

పురు : (సంతోషంతో) ఇహనేం! నా అదృష్టం బాగుందన్నమాట! ఈరోజు లేచిన వేళ మంచిదే, అసలు నేను అనుకుంటూనే వున్నాను—నువ్వు యెప్పటికైనా నిజం తెలుసుకోగలవని.

పద్మిని : చాలావరకూ నిజం తెలుసుకున్నానులెండి.

పురు: (మరింత సంతోషంతో) అదీ! అలా దారికిరా! అనుమానం పెంచుకొని బాధపడటం మంచిది కాదు.

పద్మిని: అదే. మీరెవరంత వేగం అనుమానం త్రెంచుకోవాలి. పెంచుకో కూడదు.

పురు: (ఆమెను సమీపిస్తూ) చూడూ! పద్మినీ! ఇక నిన్ను నా జీవితాంతం పువ్వుల్లో పెట్టి పూజిస్తాను రోజంతా కలువరేకుల్లాంటి నీ కళ్ళల్లోకి చూస్తూ......

పద్మిని: (వెనక్కు జరిగి) కొంచెం దూరంగా వుండండి. ఎవరైనా రాగలరు?

పురు: లోపల ఎవరైనా వున్నారా?

పద్మిని: అంతా వున్నారు. వారితో మీరు నాకు దగ్గర బంధువు అని చెప్పానులెండి.

పురు: ఓహో! అయితే యిహ నేం! నిన్నొకసారి నేను పైకి తీసుకుపోవచ్చన్నమాట!

[కాంచనలత వస్తుంది. ఆమెను చూడగానే యువకుడు కొంచెందూరంగా నిలబడతాడు.]

కాంచన: (వస్తూ) పద్మినీ! వీరేనా నీవు బంధువు అని చెప్పావు?

పురు<br>పద్మిని } : (ఒక్కసారిగా) అవునండి.

కాంచన: (యువకుడితో) కూర్చోండి...నిలబడ్డారేం? మా శరణాలయానికి వచ్చినవారిని మేం అన్ని విధాలా మర్యాద చెయ్యాలి. అది మా ధర్మం. (కుర్చీలో కూర్చుంటుంది.)

పురు: (కుర్చీలో కూర్చుని) శరణాలయం బాగానే నడుస్తున్నదా అండీ?

కాంచన: బాగానే నడుస్తోంది. అయినా కొందరు దౌర్భాగ్యులుంటారు చూడండి—వాళ్ళు మాత్రం యీ చుట్టూ తిరుగుతూ వుంటారు.

పురు: (ప్రసంగం మారుస్తూ) దీని నిర్వహణకు డబ్బు ఎలా వస్తోందండీ?

కాంచన: మీలాంటి ఉదారపురుషులెవరో చందా లిస్తే!

పురు: నేను ఇటువంటి గొప్ప సంస్థకు చందా యివ్వడానికి సిద్ధంగా ఉన్నాను.

కాంచన: అంతకంటేనా! (లోపలికి చూస్తూ) యమునా! యమునా! రసీదుబుక్కు తీసుకురా.

(రసీదుల పుస్తకం తీసుకుని యమున వస్తుంది)

యమున: చందా ఎవరిస్తున్నారండీ?

కాంచన: ఇంకెవరు? వీరే!

యమున: (యువకుడితో) ఒక వెయ్యి రూపాయలు రాయమంటారా?

పురు: అంత డబ్బు యిప్పుడు లాభం లేదండి.

యమున: పోనీలెండి. ఐదువందలే రాస్తున్నాను. (రసీదురాసి అతనికి యిస్తుంది. అతను జేబులోంచి నోటుకట్టతీసి యమునకు యిస్తాడు)

యమున: (డబ్బు తీసుకొని) థేంక్సు! (లోనికి వెళ్ళిపోతుంది)

కాంచన: మీరు పద్మినికి దూరపుచుట్టమా?

పురు: అబ్బే! లేదండి! చాలా దగ్గర బంధువు.

కాంచన: అలాగా!

పురు: ఈమె యిక్కడ వున్నట్టు తెలిసినప్పటినుంచీ -మా ఆవిడ యీమెను ఒకసారి యింటికి తీసుకు రమ్మని—గోలా చెబుతోంది.

కాంచన: ఓహో! యీమెను ఒకసారి మీ యింటికి తీసుకువెడతా రన్నమాట!

పురు: మీరు అనుమతిస్తే!

కాంచన: దానికేం? అలాగే తీసుకువెళ్ళండి.

పద్మిని: (కాంచనలత వెనుకనుంచి నిర్భయంగా) ఇప్పుడు వద్దండి. మరొకసారి ఎప్పుడైనా వస్తాను.

కాంచన: (పద్మినిమీద కోపాన్ని అభినయిస్తూ) సాక్షాత్తూ దగ్గర బంధువు వచ్చి తీసుకువెళతా నంటే వెళ్ళవూ? (యువకుడితో) మరేం ఫరవా లేదులెండి. మిమ్మల్ని ఒంటరిగా పంపను.

పురు: థేంక్ యూ!

కాంచ: యమునా!

యమున: (ప్రవేశించి) ఎందుకండి?

కాంచన: (కోపాన్నభినయిస్తూ) ఏమే? కళ్లు నెత్తికొచ్చాయా? అతిథులు వస్తే మర్యాదచెయ్యడం తెలియదూ?

యమున: క్షమించండి. నిముషంలో అన్ని ఏర్పాటులూ చేస్తాను. (నిష్క్రమిస్తుంది)

పురు : (చుట్టూ చూస్తూ) యీ ప్రశాంతమైన వాతావరణం—అందమైన ఆ పూలవనం—యిదంతా చూస్తూవుంటే రోజూ యిక్కడికి రావాలనిపిస్తోంది.

[ఒక యువతి తలమీద ముసుగు వేసుకొని ట్రేతో కాఫీ తీసుకువస్తుంది. అతని దృష్టి ఇంకా పద్మినిమీదే వుంది.]

కాంచన: కాఫీ తీసుకోండి.

పురు : (కాఫీకప్పు తీసుకుంటూ యువతిముఖం చూడానికి ప్రయత్నిస్తాడు. ముసుగులో ఆమె ముఖం కనిపించదు)

కాంచన: యీమె యెవరా అని మీకు సందేహమా? యీమెకు కొంచెం సిగ్గెక్కువలెండి. అందుకోసం మొహం కప్పుకొంది. (యువతితో) అతిథులదగ్గర సిగ్గుపడటం మంచిదికాదమ్మా! యేదీ? నీ మేలిముసుగు?

[యువతి ముసుగును కాంచనలత తొలగిస్తుంది. సునందిని మొహం కనిపిస్తుంది. ఆమెను చూడగానే అతని చేతిలోని కాఫీకప్పు జారిపోతుంది.)

పురు : (లేచి కోపంతో) మీరంతా కలిసి యేదో కుట్రపన్నినట్టుంది. యిక యిక్కడ నేను ఒక క్షణంకూడా వుండడానికి వీల్లేదు.

[వెళ్ళిపోబోతాడు. కాంచనలత అతనిని బలవంతంగా కూర్చోబెడుతుంది.]

కాంచన : బాంధవాలన్నీ జరక్కుండా యెలా వెళతారు. కూర్చోండి.

[మూరాన్నుంచి చిమ్మనగ్రోవినుంచి రంగునీళ్లు వచ్చి అతని ముఖంమీద పడతాయి.]

పురు : (కోపంతో లేచి) యేమిటిది?)

కాంచన : (తిరిగి కూర్చోబెడుతూ) కూర్చోండి పరవాలేదు. పన్నీరు జల్లుతున్నారు.

పురు : (కోపంతో) సునందినీ! ఎందుకు వున్నావు యిక్కడ?

కాంచన : పాపం! ఆమె యేమి జవాబు చెబుతుంది? నేను చెబుతాను వినండి.

[రంగమ్మ తొందరగా ప్రవేశిస్తుంది.]

రంగ : (కోపంతో) యేమిట్రా! యిదేమన్నా యిల్లనుకున్నారా? దూల్లశాల అనుకున్నారా? కొంపంతా రంగునీళ్లు జల్లేస్తున్నారు. పైగా చెటంత మగాణ్ణి యింతమంది ఆడాళ్లూ యేకమై కట్టేశారు.

యమున : అది మగవాడు కాదండీ అమ్మమ్మగారూ! మన ఉషారాణి! పురుషవేషం వేసింది.

[ఉషారాణి మీసం, టోపీ తీసేస్తుంది.]

శారదాదేవి : (ప్రవేశించి) రంగమ్మగారూ! మీరు మరో రెండు వివాహాలు జరిగితే బాగుండేది—యిక గత్యంతరం లేక యీ నాటకాన్ని యింతటితో ముగిస్తున్నాం.

రంగ : యిలాంటి మేళాలు నా కొంపలో పనికిరావు, తెల్లవారేసరికి యిల్లు ఖాళీచెయ్యకపోతే పూరుకోను.

[కుడివైపు నిష్క్రమిస్తుంది. అందరూ నవ్వుతూ వుండగా—తెర.]

# మైలారసూరి సోపానసరణీ శాసనము

శ్రీ కె. హెచ్. వి. శర్మ

శ్రీశైలమునందలి మల్లికార్జున ఆలయము నుండి పాతాళగంగకు పోవుమార్గమున నొక శిథిల దేవళము నందలి కంబములకే శాసనము-నాగర, తెలుగు, గ్రంథ లిపులలో మృదుమధురమైన సంస్కృత భాషలో దక్కని చిన్న ఖండకావ్యముగ రచింపబడినది[1]

[illegible] గోచరుడును దిగంబర [illegible] శ్రీమల్లికార్జునుడు హరిహర భూపాలునకు భద్రము నిచ్చుగాక! దేవతలకు గూడ వాసయోగ్యమైన [illegible] పావనమైన పర్వతశ్రేష్ఠమొకటి గోరాష్ట్రమునఁ గలదు. గోకర్ణవాసి యగు చంద్రశేఖరుని శిరస్సీతాంశు కాంతులచే ద్రవించిన చంద్రకాంత శిలల నీటిచే నా పర్వత సానువులు క్షాళితములగుచుండును. అంబర చుంబితము అత్యున్నతమునైన కదంబవృక్షమొకటచ్చట గలదు. దాని పూవుల [illegible] నిత్యము దిశలందు చాల్పును. త్రిపుర విజయార్థమరిగిన పరమేశ్వరుని శరీరమునుండి స్వేద బిందువొకటి ఆ కదంబ వృక్ష ప్రసవమునందు పడుటచే సచాప కవచాదులతో మహాతేజస్వియగు పురుషుడొకడుదయించెను. ఆ పురుషుని గాంచి త్రిపురారి విస్మితుడై కదంబ ప్రసవమునుండి జన్మించితివి గాన ఆ పేరుతో నీ వంశము వ్యవహరింపబడగలదనియు, కార్తవీర్యార్జునాదులు గూడా ఆ వంశమునందే జన్మించెదరని యానతిచ్చి కదంబకుల వర్తనుడైన ఆ వీరుని గోరాష్ట్ర రక్షణార్థము రాజుగా ననుగ్రహించెను.

పాల్కడలివలె స్వచ్ఛమైన ఆ కదంబ కులమునందు కళానిధివలె శివభక్తాగ్రేసరుండగు బసవరాజు జన్మించెను. ఆ పురుషశ్రేష్ఠునకు కామదేవుడను పుత్రుడు గలడు. ఆ కామదేవుని కుమార్తె యగు పద్మలాదేవి నారాయణునికి లక్ష్మివలె (చాళుక్య) రాజేంద్రునికి ప్రియురాలాయెను. గోకర్ణేశ్వర సత్పూజాఫలితమనోరథయయిన యామె సౌభాగ్యగుణ సంపన్నురాలగు విశాలాంబను గాంచెను. హంసగమనయు కదంబకుల సంపత్తునకు భాగ్యోదయమును, వికసిత సౌభాగ్యభావములుగల ఆ విశాలాదేవి శుభలక్ష్మివలె నుండెను. ఆమె భూదేవితో గూడ హరిహర రాయలనుపొంది భర్తతో సఖీకృతయై ప్రకాశించుచుండెను. హరిహరులకు లక్ష్మీ పార్వతులవలె హరిహరునకా విశాలదేవి ప్రియురాలాయెను. సత్యమున సరస్వతియు, పాతివ్రత్యమున అరుంధతియు, ఔదార్యమున కల్పవృక్షము నైయొప్పుచున్న యామె గుణములు వర్ణింప నెవ్వరితరము? స్వయముగ లక్ష్మియే ఆమె యందు ప్రభవింపగోరుచుండెనేమో! అఖిలలోకమాన్యయగు మేనకయందు హిమవంతునకు పార్వతివోలె విశాలాంబయందు హరిహర భూపాలునకు విజయలక్ష్మి యుదయించెను. ఆమె ముఖము సుధాంశు బింబము, వాక్కు కామధేనువు, అధరము చింతామణి, భుజలత కల్పవృక్షము, చిరునగవమృతమయము, స్వాంగభూతములైన సోపకులతో ప్రభవించిన లక్ష్మివలె నుండెను.

బాణాసుర ద్వారపాలకుడు, అర్జున కోదండ ప్రహార పరుషేందు శేఖరుండైనట్టియు నిషాదముఖ గండూష తోయములచే సంతుష్టుడైనట్టి భ్రమరాంబా ప్రియుడైన పురశాసనునియందు విశాలాంబ అత్యంత భక్తురాలాయెను. భక్తిప్రదుడైన హరుడామె భక్తికి సంతసించి స్వప్నమునందు విశాలాంబకు [illegible] నిట్లని యానతిచ్చెను.

"శ్రీ పర్వతమున నొక ఆశ్చర్యమైన జన్మభూమి కలదు. దాని శిఖరమున వేదముల, వారొక్క యన్వేషణము యోగులు చేయుచుండెదరు. సువర్ణ వృక్ష పరిమళముచే నిండినట్టియు, సర్వాక్రాంత కందరములు గలట్టి ఆ పర్వత శిఖరమును దర్శించినవారికి పునర్జన్మమే లేదు. అచ్చటి పాతాళగంగ యందు మునుగు మానవోత్తము లాకాశ గంగా జలములందమరులై తేలుచుందురు. ఆవాస మాత్రమున నే మానవులు

1. Annual Reports on Epigraphy, Nos. 47, 49 and 50 of 1915.

పావనులగుదురు, మరియు సిద్ధుల యొక్క మనోరథములు కూడా సిద్ధించును. యాచకుల కోరికల నచ్చటి కదళీకాననము సఫలము చేయును. ఆ శిఖర ప్రత్యంత పర్వతముల వసించువారి కీశ్వరుకుకూడ సేవచేయును. అట్టి లోకోత్తర శిఖరమందు నిత్యము వసించు నా దర్శన మహోత్సవార్థ మనేకు లరుదెంతురు గాన సుఖారోహణమునకుగాను సోపాన మార్గమును కట్టింపుము. నీ సంతతి, యశస్సు వర్ధిల్ల గలవు."

ఆ స్వప్నమున కత్యాశ్చర్యము పొందిన యావిశాలాంబ దేవశివుని యాదేశమును ప్రాతఃకాలమున భృత్యవర్గమునకు బండితులకు దెల్పి శకవర్షములు 1315 శ్రీముఖ సంవత్సరమునందు అవిఘ్నముగనే స్థిరమయిన సోపానమార్గము కట్టించెను. ఆ కల్పముగ శచీదేవివలె ప్రియునితో గూడ నైశ్వర్యము ననుభవించుచు విశాలాంబ ప్రకాశించుగాక! పాతాళగంగోదకములచే పవిత్రుడై శంకరార్యుని పుత్రుడగు మైలారసూరి పురశాసను నారాధించి యీ సోపానసరణీ శాసనమును రచించెను.[1]

ఈ శాసనము కావ్యముగనే గాక చారిత్రముగ గూడ మిక్కిలి ముఖ్యమైనది. ఇంతవఱకు తెలుగు లిపిలో దొరకిన గోకర్ణ కదంబుల శాసనమిది మాత్రమే. ప్రాచీన రాజవంశముల యుత్పత్తి యనేకముగా పుక్కిటి పురాణములతో నిండియుండును. విష్ణువు నుండి గాని పరమేశ్వరునుండి గాని ఆయా వంశముల మూల పురుషులు అవతరించినట్లు వర్ణించుచుందురు. కదంబులు వారి వంశపు మూల పురుషుడు త్రిలోచనకదంబుడనియు నాతడు పరమేశ్వరునుండి యవతరించినట్లు చెప్పుకొందురు. విశేష మేమన ప్రాచీన కదంబుల సమకాలికులగు పల్లవులుకూడ వారి మూలపురుషుని ముక్కంటి పల్లవ లేక త్రినయన పల్లవుడని పొగడుచుండిరి. ఇది కదంబులనుండి పల్లవులకు సంక్రమించినదని జార్జిమొరెస్ గారి యభిప్రాయము.[2] వారి వారి యౌన్నత్యములు దెల్పుటకే ఆ మూల పురుషులను త్రినేత్రములతో, చతుర్భుజములతో సృష్టించిరి గాని చరిత్రకంతమాత్రమున నివి యాధారములు కాజాలవు.

ప్రాచీన కదంబవంశపు రాజులు క్రీ॥ శ॥ 345 నుండి సుమారు 655 ప్రాంతమువఱకు బనవాసి నాధారముగ పాలించిరి. తరువాత వరుసగా చాళుక్య, రాష్ట్రకూటులచే వారి రాజ్యమంతరించినది. మరల పదియవ శతాబ్ది యంతమున యుతీవ చట్టంగదేవునకు, షష్ఠదేవుడను వార్లచే రెండు కదంబ రాజ్యములు బనవాసి, గోవాలయందు వేర్వేరుగ స్థాపించబడినవి. వారికి హానగల్లు కదంబులనియు, గోవా కదంబులనియు పేర్లు. ఈ రెండు ప్రధానవంశములుగాక బయల్నాడ్, బేలూరు, బంకాపూర్, ఉచ్ఛంగి, వగర్ ఖండ్, కళింగకదంబులని చిన్న చిన్న కుటుంబములాయా ప్రదేశములనుండి పాలించుచుండిరి.

ప్రస్తుత శాసనమునందలి కదంబ వంశము గోకర్ణ ప్రాంతమునకు చెందినది. గోవానుండి పాలించిన రాజులలో కామదేవుడను వాతడుగలడు. ఆతడు కదంబ వంశజుడగు త్రిభువనమల్లుని కుమార్తెను వివాహమాడి బావమరదియగు షష్ఠదేవు ననంతరము సింహాసనమునకు వచ్చెను. మరియు నాతడు రట్టవంశజుడగు లక్ష్మీదేవుని పుత్రుడు.[3] ఇట్టి కామదేవుడు లక్ష్మీదేవుని పుత్రుడగుటయు, కదంబవంశజుడు గాకపోవుటచేతను మన యీ శాసనములో జేర్కొనబడిన కామదేవు డాతడు కాజాలడు.

ఉత్తరకెనరా, కుంటతాలూకా, గోకర్ణము నందలి కామేశ్వరీ మఠమువద్ద శిలపై నొక కన్నడ శాసనము గలదు.[4] దానిలో కాదంబచక్రవర్తి, శివచిత్తవీర బసవదేవరాజు కుమారుడగు కామదేవుడు గోకర్ణమునందలి ధారేశ్వర క్షేత్రమున నొక మఠము కట్టించి, కొంతభూమిని దాన మొసంగినట్లు గలదు. దీని కాలము కామదేవుని రాజ్యపాలన 14 వ వత్సరమగు విక్రమ సంవత్సర మార్గశిర శుద్ధ 15 సోమవారము, చంద్రగ్రహణము. పైవివరము లన్నియు (చంద్రగ్రహణముతప్ప) సరిగా శకవర్షములు 1262 విక్రమ సంవత్సరమునకు సరిపోవును దీనికి సరియగు క్రీ॥ శ॥ 1340 A.D December 4 (Monday). దీనినిబట్టి కామదేవుడు క్రీ॥ శ॥ 1326 లో సింహాసనమునకు వచ్చినట్లు గూడ చెప్పగలము ప్రస్తుత మన యీ శాసనకాలము నుండి వెనుకకు లెక్కించి జూచిన శాసనములో

2. Kadambakula by George M. Moraes page 9.

3. Ibid. Pages 208 F. F.

4. Annual Reports on Epigraphy. Bombay-Karnatak No. 110 of 1939-40.

చేర్కొనబడిన కామదేవుకు సరిగా ఆ ప్రాంతము వాడే యగును. ఇట్లే గోకర్ణ శాసనమునందలి కామదేవుకు కాదంబచక్రవర్తి శివచిత్త బసవదేవుని కుమారుడగుట, గోకర్ణాధీశ్వరుడగుటయు, సమకాలికుడగుటను బట్టి, యీ శ్రీశైల శాసనమందు చేర్కొనబడిన కామదేవు డాతడేయని నిశ్చయింపవచ్చును.

పై కామదేవునకు పద్మలాదేవియను కుమార్తె గలదు. కందనవోలి కైఫీయతులో నీ పద్మలాదేవి కామదేవుని భార్యయని తప్పుగా వ్రాయబడినది 5 ఈమె చాళుక్య రాజేంద్రుని భార్యయనికూడ శ్రీశైలమునందలి మరియొక శాసనమును బట్టి స్పష్టముగ దెలియును.6

"ఖ్యాతా పద్మల దేవీతి కామదేవ నృపాత్మజా।
రాశీ మహా విశేషస్య రాజ్ఞీ చాళిక్య సంతతేః॥"

ఈ చాళుక్యరాజేంద్రు డెవరైనది ప్రస్తుతము నిశ్చయింపలేకున్నాము. అతనికి పద్మలాదేవియందు విశలాంబ జన్మించెను. ఈమె విజయనగర రాజగు రెండవ హరిహరరాయల భార్య. శాసనములలో నామె "కదంబకుల విధివభాగ్య సంభూతిః" యని వర్ణించబడినది విజయనగర రాజుల శాసనము లనేకముగ7 గోకర్ణము నందుండుటచే రెండవ హరిహరరాయలకు పూర్వమే గోకర్ణమువారి వశమైనట్లు విశలాంబా హరిహరరాయల వివాహసంబంధమున కదంబులు వారి బంధువులై మరికొంతకాలము పాలించియుందురనియు నూహింపగలము.

విశలాంబయందు హరిహరరాయలకు విజయలక్ష్మి యను కుమార్తెయు, విరూపాక్షుడను కుమారుడును8 కల్గిరి.

కోరుమిల్లి శాసనములో నొక శ్లోక మిట్లుగలదు.

"పౌత్రీం కాటయ వేమయ క్షితిపతేః
పుత్రీంచ కాటప్రభో
ర్దౌహిత్రీం చతురర్ణవీం హరిహరక్షోణీ
పతే శ్శాసితుః,
తస్యాన్యామవిదితో హ్యయాం హరిహరాంబాం
చార మాగ్రహ య-
ద్వ్యాప్తో వేమమహీశ మల్లనృపతి స్సామ్రాజ్య
లక్ష్మ్యై సమమ్."—

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారీ శ్లోక మసంగతమని పాఠపత్తులతో ఖండించి యీ క్రిందివిధమున మార్చవలయునని చెప్పిరి.9

"పుత్రీం కాటయ వేమ యక్షితిపతేః
పౌత్రీం చ కాటప్రభోః"

దీనినిబట్టి హరిహరాంబ 10 హరిహరుని దౌహిత్రియు, కాటయపౌత్రి, కాటయవేముని పుత్రియు నగును. కాటయవేముడు హరిహరరాయని యల్లుడని చెప్పుచున్న శాసనములనుబట్టి కాటయవేమునకు దొడ్డాంబిక, మల్లాంబిక, తిల్లాంబిక యను ముగ్గురు భార్యలు గలరని తెలియును. తిల్లాంబికయే హరిహరరాయలకూతురు గావచ్చునని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చెప్పిరి. అహోబిలమునందలి కాటయవేముని శాసనము11 కొంతవఱకీవిషయమును బలపరచును. గోకర్ణమునందలి యొక శాసనములో 12 హరిరాయల కూతురగు విజయలక్ష్మి వ్రతము నొకదానిని కటించినట్లు గలదు.

---

5. Kaifivat of Kandanavolu L. R. 18. P. 404. (Published in the Further Sources of Vijayanagara History, by Prof. K. A. Nilakanta Sastri and Dr. N. Venkataramanayya; Vol II Pages 86 and 37)

6. Anmual Reports on Epigraphy. No. 51 of 1951.

7. Annual Reports on Epigraphy. Bombay Karnatak; Nos. 101, 104, 106 and 109 etc of 1939-40.

8. Annual Reports on Epigraphy. No. 51 of 1915.

9. శృంగార శ్రీనాథము Pages 284 f. f.

10. "History of the Reddi Kingdoms"లో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కాటయ వేముని భార్యయు, పుత్రియుకూడ హరిహరాంబయే యని చెప్పిరి. (Pages 128 and 169) ఇది పొరపాటని గ్రహింపవలయును.

11. South Indian Inscriptions (Texts) vol X No. 577.

12. Annual Reports on Epigraphy Bombay - Karnatak. No. 109 of 1939-40.

ఇంతవఱకు దొరకిన శాసనములనుబట్టి హరిహర రాయలకు విజయలక్ష్మి యను నొకతెమాత్రమే కుమార్తె గలదని తెలియును. కావున నీశాసనములో పేర్కొనబడిన విజయలక్ష్మియే తల్లాంబిక యగునేమో యని నా యభిప్రాయము. భావిపరిశోధనాఫలితమున దీని సత్యమింకను బుజువైనచో గోకర్ణకదంబుల సాంబంధ్యము హెరాస్ గారు చెప్పినట్లు విజయనగర రాజులకే గాక, తద్ద్వారా రాజమహేంద్రవరమువఱకు ప్రాకినదని చెప్పవచ్చును.

ఈ శాసనమును రచించిన కవి శంకరార్యుని పుత్రుడగు మైలార సూరి. ఈతడు క్రీ॥ శ॥ 1393 ప్రాంతమువాడని యీ శాసనకాలమునుబట్టి తెలియును.

## శాసన మూలము

పుణ్యశ్లోకో హరిహరనృపతే ర్మల్లికార్జునః
దేయా ద్దిగంబర వ్యాపి సుఖం కృత్తివాసోధరః. 1
ఆస్తి విస్తార సంరుద్ధ వసుధావిబుధాశ్రయః
కుటజో నామగోరాష్ట్రే పావనః పర్వతోత్తమః. 2
గోకర్ణవాపి గౌరీశ శిరశ్శీతాంశు రశ్మిభిః
స్యందమానేందు కాంతాంభః క్షాళితా యస్య సానవః. 3
అద్భుతః కోపి తత్రాభూ త్కదంబః స్థగితాంబరః
యత్ప్రసూనాని సీమన్తే సదా ధత్తేఽద్రికన్యకా. 4
పురత్రయస్య విజయం విధిత్సోః స్థిర ధన్వనః
అంగాద పతితస్వేదాంబు బిందోః త్రిరోః ప్రసవోదకే. 5
సంజజ్ఞే తత్ర తేజస్వీ పురుషః పురుహాకృతిః
ధృతగోధాంగుళిత్రాణః సచాపః కవచాన్వితః.14 6
విజిత్య త్రిపురీసంగీః ప్రత్యక్ష వృత్తిః పురాంతకః
తత్రాత్మ సదృశాకారం తం దృష్ట్వా విస్మితోఽభ్యధాత్. 7

యత్త్వం కదంబ ప్రసవ ప్రభూతోఽసి పరంతప
అతస్త ద్వ్యపదేశేన భవ వంశో భవిష్యతి. 8
యస్మిన్వంశే జాతస్త్వం తస్మిన్నేవ మహాకులే
ఉత్పత్స్యన్తే మహీపాలాః శౌరివియాజ్జనాదయః. 9

దేవస్తమనుగృహ్యైవం వీరం గోరాష్ట్ర రక్షణే
రాజాన మకరో దేనం కదంబ కులవర్ధనమ్. 10
క్షీరాబ్ధి విమలే తస్యకులే ఽఖిలకలానిధిః
రాజా బసవదేవో భూన్మాహేశ్వర శిరోమణిః. 11

శౌరికరి వాస్య15 శూరస్య విరోధి నరకద్విపః16
పురుషార్థసమస్యాసీ త్కామదేవాహ్వయస్సుతః. 12
ఖ్యాతా పద్మల దేవీతి కామదేవ తనూద్భవా
పద్మానారాయణస్యైవ రాజేన్ద్ర స్యాభవత్ప్రియా. 13
గోకర్ణేశ్వర సత్పూజా సఫలాత్మ మనోరథా
సౌభాగ్య గుణసంపన్నాం విట్ఠలాంబా మసూత సా. 14
కృత హంస గమన శిక్షా కదంబకుల విభవ భాగ్య
సంభూతిః
వికసిత సుమనో భావా విట్ఠలా దేవీ విభాతి ఘనలక్ష్మీః17 15
క్షితిరివ విట్ఠలా దేవీ హరిహర భూపేన కృతకరగ్రహణా
భీర్యాభిసముభిషిక్తా శ్రీకర వాలప్రసాధితా జయతి 16
ఖ్యాతి ప్రథివాద హరే స్సతీ హరస్యాపి వల్లభా
జాతా18
ఖ్యాతి ప్రథివాద సతీ విట్ఠలదేవీతి హరిహర స్యైకా. 17
సత్యం సరస్వతీ తస్యాః పాతివ్రత్య మరుంధతీ
ఔదార్యం విట్ఠలాంబాయాః శీలయుత్స్యవరద్రుమాః. 18
వర్ణ్యన్తే విట్ఠలాంబాయాః కేవ లోకోత్తరా గుణాః
కాంతశ్చ తస్యాస్స్వయంలక్ష్మీజనక యస్యాంజగత్త్రయీః 19
ఉదపాది విజయలక్ష్మీ హరిహర భూపేన విట్ఠలాం
బాయామ్,
హైమవతీవ హిమవతా మేనాయా మఖిలలోక
మాన్యాయామ్ 20

ముఖ మమృత మయూఖో ముగ్ధవాక్కామదోగ్ధ్రీ
సురమణి రధరోష్ఠో దోర్లతా కల్పవల్లీ,
స్మితమమృత మయం తద్విప్రయోగాప హాత్వ—
దజని విజయలక్ష్మీ పాదరైః19 స్వాంగభూతైః. 21
బాణాసుర గృహద్వార దౌవారిక పదస్థితే,
అర్జునోర్జిత కోదండ ప్రహార పరుషేందుకే,

---

13 దీనిని ప్రకటించుటకు యనుజ్ఞనొసంగిన గవర్నమెంటు ఎపిగ్రాఫిసు గారికి నే నెంతయు కృతజ్ఞుడను. తప్పులు సవరించి సరియగు పాఠము మాత్రమే యివ్వబడినది.

14. 'కవచాంచితః'—అనికూడ గలదు.

15. "శారికరివాతి శూరస్య"—

16. "నరకద్విషః"—

17. 'ఘనలక్ష్మీః'—అని గూడ గలదు.

18. "వల్లభాకాంతా"—

19. "పాదరైః"—

నిషాది ముఖగండూషతోయ స్య స్వప్నేపి తే. 22
విలంబిక్త పరార్ధే నే భ్రమరాంబా ప్రియే విభో
విశలాంబా వ్యధాద్భక్తి మూర్తితాం పురశాసనే. 23
పతిద్భక్త్యా థ సంతుష్టో భక్తాభీష్ట ప్రదో హరః
స్వప్నే పురస్థితో భూత్వా విశ్లాంబా మభాషత 24
"అస్తి శ్రీ పర్వతో నామ కశ్చిదాశ్చర్య జన్మ భూః
మూర్ధ్ని యస్యశ్రుతీనాం చ దూరం విచిన్వన్నియోగినః. 25
ఉదారా రగ్వధాటే మోద మురగాక్రాంత కందరమ్
పశ్యన్తో యస్య శిఖరం నపశ్యన్తి పునర్భవమ్. 26
యత్ర పాతాళ గంగాయాం మగ్నా మనుజసత్తమాః
ఉన్మజ్జం త్యచిరే కాళీవోక్యముగంగాజలేఽమరాః. 27
భవన్త్య వాస మాత్రేణ పావనా యత్ర మానవాః
యత్ర సిధ్యన్తి సిద్ధానా మపి సర్వ మనోరథాః. 28
కదళీ కావనం యత్ర కామాన్ఫలతి దేహినామ్
సర్వోప్యపి సేవతే పాదా న్యస్యపాదోప సేవినామ్ 29
†ఇత్థం విశ్వత్రికే తస్మిన్నిత్యం విహిత సంనిధేః
మహోత్సవాలోక సార్థంపాగ్ణ సాన్వగచ్ఛతో ద్భుతమ్. 32
కౌరయుస్య దురా రోహ సుఖాం సోపాన పద్ధతిమ్
కల్పయ్యతే తవయశః సంతతిస్సమృద్ధయః". 33
ఇతిస్వప్నే శ్రీ గిరీశో విశ్లాంబా మవోచత
విశలాంబాఽపి తం స్వప్న మాలోక్యాతీవ విస్మితా. 34
ఆదేశం దేవదేవస్య దుర్లభం తమనుగ్రహాత్
అతం సద్భక్త్యత్య వర్గణస్య విధాతే విసుహాముసి. 35
శుకాలాయ గతేశాక జాతే శ్రీముఖవత్సరే
తధివా కౌరయత్ర త స్థిరాం సోపాన పద్ధతిమ్. 36
కల్పవల్లీ సుమనసా మాకల్పా ద్విభ్రతీ శ్రియమ్
విశ్లాంబా జయతాం శివప్రేయసా సమమ్. 37
పాతాళగంగా పాథస్సు పూతాత్మా పురశాసనమ్
ఆరాధ్య లిలిఖచ్చాంత తపస్వీ ప్రణయూంచితః. 38
పార్వతీశ ప్రసాదాయ శంకరార్య తనూభవః
మైలార మారిః సోపానసరణీ శాసనమ్ శివమ్. 39

శివమస్తు.

---

†ఇచ్చట రెండు శ్లోకములు పూర్తిగా చెరగిపోయినవి.

# హృదయ జ్వాలలు

శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రి

వీరాస్వామి ఉద్యోగంనుంచి విముక్తుల కాగానే తన జీవిత శేషమును ప్రశాంత వాతావరణమున గడుప దలచి అమితోత్సాహంగా స్వగ్రామం చేరుకున్నాడు. కాని వచ్చిన వారం రోజులకే అతనిలో ఒక వింతైన అసంతృప్తి, ఆవేదన ప్రారంభించినయ్. రోజులు గడిచిన కొలదీ అతనిలో వికటు, చీకాకు మితిమీరుతున్నాయి. ఆ గ్రామమును వీరాస్వామి ముప్పదేండ్ల క్రితం విడిచివెళ్లాడు. అప్పటినుండి ఎన్నడైనావచ్చినా ఒకగంటకాలంకంటె ఆ వూళ్ళో వుండుటకు తీరిక లభించేది కాదు. అందువలన ఆ గ్రామంలో ఇప్పటి వార్ని గురించి అతనికి తెలియదు. స్వగృహంతప్ప ఆ గ్రామంలోని తతిమా అంతా అతనికి క్రొత్తగావున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరపు నాగరికతా ప్రభావం ఆ గ్రామంపైనకూడా అఖండంగా పని చేసింది. తాను బాగా వయసులో వున్నపుడు నిర్జన ప్రదేశములుగావుండి నక్కల నివాసస్థానములుగా పేరుపడ్డ కొన్ని భాగాలు నేడు గ్రామపు నడిబొడ్డు వీథులుగా తయారై ఉన్నతసౌధాలతో నిండివున్నాయ్. అపరిమితమైన ప్రతిభతో, చాకచక్యంగా గ్రామ పెత్తందారీతనమును సాగించిన ఆ నాటి గ్రామపెత్తందార్లను తలిచే వారులేరు. అవి ఎన్నడో కాల గర్భంలో లీనమై పోయినయ్. అపుడు బీడుగా పడి వున్న ఆ గ్రామం చుట్టూగల భూమి యీనాడు దివ్యమైన ఉత్పత్తి శక్తులనుపుంజింపజేసుకుని ప్రశస్తమైన దొర పుగాకును పండిస్తూ అప్పట్లో కూటికి గతిలేక పక్కీర్లుగా ఎంచబడిన కొందరికి లక్షలు గడించి పెట్టి సంఘంలో అగ్రస్థానాలను అనంతభోగాలను అందిస్తున్నది.

వీరాస్వామిని పలకరించే వారు కాని తలిచే వారు కాని కన్పించలేదు ఒక్క వెంకోజీ తప్ప. వెంకోజీ వీరాస్వామికి పూర్వ పరిచయస్థుడు. దేహం ముడతలు పడిపోతున్నా కాయబారు శరీరం కావడం చేత వెంకోజీకి వయసు పెద్ద పరిశ్రమగా తోచదు. రోజు కొక తడవైనా వీరాస్వామివద్దకు పనివేళ్లా వచ్చి పిచ్చాపాటీ మాట్లాడి పోతూంటాడు. వీరాస్వామికి కాలం చాలా కష్టంగా గడుస్తున్నది. అతను ఉద్యోగంలో వున్నపుడు గబగబా పరువులెత్తి పూర్తి కావలసిన కార్యములలో సగంపాలు మిగులు చూపి ఊపిరాడకుండా చేసిన కాలచక్రం యిప్పుడు అనంతమైన విశ్రాంతిని చూపి మనసుని వెక్కిరిస్తోంది. ఆ రోజు కారోజు గడిచినకొద్దీ ఒంటరితనం చాలా బాధాపూరితమై అతనిలోని ప్రతిఅణువునూ నీరసపరుస్తోంది. వచ్చే పోయే మనుష్యుల గుంపుల్లో ఎప్పుడూ సందడిగా వుండే తాలూకా ఆఫీసులో చిన్న బంట్రోతు వుద్యోగం అతనిది. కాకీదుస్తులు ధరించి మెళ్లో బిళ్ళ పట్టా వేసుకుని నీటుగా అధికారంగా, అధికారి ప్రతినిధి అన్నట్టుగా ప్రభుత్వ దర్జాతో తాసీల్దారుగారి ఆఫీసుగది ముఖద్వారంవద్ద నిలబడి లోనికి వెళ్ళేవారిని దూపుల్లో ఆదిలిస్తూ, అవసరమైనపుడు వినయవిధేయతలు కురిపిస్తూ సాయంకాలం అయిదుగంటలగుసరికి కనీసం నాలుగు రూపాయలైనా కళ్లచూచే అలవాటుగల వెనుకటి జీవితంతో, రాగికాసీకూడా సంపాదించుకోన నోచుకోనియిప్పటి తన పరిస్థితిని పోల్చి చూసుకుంటే ఎక్కడా సామ్యం కుదరటంలేదు. ఇది ఒక పునర్జన్మగా తోస్తున్నది

వీరాస్వామిది చాలా కష్టజీవితమని అతనిభార్య జీవించివున్నపుడు జాలిపడుతూండేది. పదిహేడేండ్ల వయసువరకు సోమరిపోతుగా బజార్లవెంట తిరిగిన వీరాస్వామికి తండ్రి మరణం ఒక గొప్ప నీతిపాఠం నేర్పింది. నాలుగు నెలల్లో స్వయంకృషితో చదవడము, వ్రాయడము నేర్చుకుని బుద్ధినైపుణ్యంచేత ఒక డిప్యూటీ కలెక్టరుగారి అనుగ్రహమునుపొంది జవాను వుద్యోగాన్ని సంపాదించాడు. తనకంటే పై అంతస్థులలోనున్న వారిని వినయవిధేయతల్లో సేవించితద్వారా మంచివాడనిపించుకుని ఆ మంచితనాన్ని ధనార్జనకు ఉపయోగపడేలాగు

చూసుకోవటమే అతని జీవితాశయమైపోయింది. మానవుల అంతస్థుల విభజనలను, వర్గభేదములను కనీసం మనసులోనైనా అతిడెన్నడూ తిరస్కరించి ఎరుగడు. ఎంతటి అవమానకరమైన విషయాన్నిగురించైనా ఆవేశంగా ఆలోచించుట అతనికి చేతగానిపని. మన శ్శాంతిని అంత తేలిగ్గా పోగొట్టుకునే ప్రకృతికాదు. ఒక్కొక్క తసీల్దారు అనవసరంగా అహంకారం తెచ్చుకుని ధామధూములు చేసి దూషించినపుడు అతని నుండి పొందగలిగిన జవాబు కాంతిరసం చిందులాడే మందస్మితమాత్రమే. అతనిలోని ఆ నిశ్చలశక్తే అధికారుల్ని ఆకర్షించింది. లంచంపుచ్చులు యిస్తేగాని ఆఫీసుగదిలోకి రానివ్వటంలేదని ఎంతోమంది ఫిర్యాదులు చేసినపుడుకూడా అధికారులు 'వాడి కడుపు తిప్పలు వాడిది' అన్నట్లుగా చిన్నగా నవ్వి వూరుకునే వాళ్ళు. ధనార్జనకు మానవ పౌరుషమును బలిపెట్ట వల్సిందేనని అతని భావన.

వీరాస్వామి ఉద్యోగవిరమణ చేసిననాటికి అతను ఆర్జించి నిలవచేసుకున్న ధనంగూర్చి లెక్క చూసుకుంటే బ్యాంకుల్లో వున్నదికాని, ప్రావిడెంటుఫండు బాపతుగాని, దగ్గిరవున్న రొఖ్ఖంగాని పదివేలకు ఏమాత్రం తక్కువ. ఇదిగాక జీవితాంతమువరకూ నెల నెలకు పింఛనుబాపతు రాబడివుంటుంది. ఒకనాడు తను ఇష్టాగోష్ఠిలో బయటపెట్టాడు వీరాస్వామి యీ మాట వెంకోజీతో. వెంకోజీ వెంటనే ఆశ్చర్యచకితుడై గుండెలు కొట్టుకుంటూ అన్నాడు. "అట్లాగా వీరయ్యా నాతో యీ సంగతి ఎన్నడూ చెప్పావుకాదే! నువ్వు తెలివితక్కువవాడివనీ వెర్రివాడివనీ అనుకోటంలో నేను చాలా పొరబాటుపడుతున్నానని ఇపుడు విచారిస్తున్నాను."

వీరాస్వామి చిన్నగానవ్వి యిలా అన్నాడు "ఎందువల్ల వెంకోజీ? నా తెలివితక్కువ తనమును గూర్చి కొత్తగా ఏమి తెల్సుకున్నావ్?"

"పదివేలు దుడ్డు కలిగివుండీ, నెలనెలకు పింఛను బాపతు రాబడివుండీ...ఆఁ...ఇవన్నీ వుండీకూడా... ఇంత స్థిమితము సౌకర్యములు కలిగికూడా మళ్లీ తిరిగి గృహస్థువు గాకుండా వున్నావంటే తెలివితక్కువ తనంగాక మరేమవాలి? కొంచెం చదువు సంధ్య నేర్చుకొని లోకజ్ఞానం సంపాదించిన మనలాంటివాళ్ళే బుద్ధిహీనంగా ప్రవర్తించి సౌఖ్యాల్ని చంపుకుంటూ కూర్చుంటే, ఇక మన కులాల్లోని అజ్ఞాన ప్రజను అని మాత్రం ఏమిప్రయోజనం?" వెంకోజీనుండి వెలువడిన పై మాటలు సద్భావంతోనే కూడినవనీ, ఎగతాళి మాటలు కావనీ వీరాస్వామి వూహించాడు.

"అదేమిటి వెంకోజీ? నా భార్య మూడు సంవత్సరాల క్రితమే కదా గతించింది!"

"అయితేమాత్రం నిన్ను మళ్లా ఒక ఇంటివాణ్ణి కావద్దనీ, తననే తల్చుకుని కుములుతూ చావమని చెప్ప లేదుకదా?"

"చెప్పలేదనుకో. వివాహామునకు మాత్రం మానవ జీవితంలో తగినవయసు లేదా వెంకోజీ?"

"తగిన వయసేమిటోయ్? వయసు ముదిరిందని ఆహార విహారాల్లో అశ్రద్ధ చూపటం, అప్పుల్లోకి పారిపోతా వటం ఎంత అవివేకమనిపించుకుంటుందో యిదికూడా అంతే."

వెంకోజీది గట్టిబుఱ్ఱ. తన అభిప్రాయాల వేపుకు ఇతరులను త్రిప్పుకోటంలో అతను గొప్ప దిట్టరి. అతని భావనలు ఎపుడూ కుళంలోనే కూరుకుని వుంటయ్. కావల్సినవారికి అతను ఇళ్లుకట్టిపెడుతూంటాడు. అలాగే అవసరంలేని వారినికూడా గృహనిర్మాణము నకై ప్రోత్సాహపరుస్తూంటాడు. ప్రతిమానవునకు గృహము, గృహిణి అత్యవసరములని అతని నమ్మిక. ఈ రెండూ కారణ కార్యములవంటివి గనుక ఒకదాని యందు శ్రద్ధవహించి మరియొకదానిని నిర్లక్ష్యపరచ కూడదని అతనివాదన. అతను నలభై సంవత్సరాల అనుభవం గల తాపీమేస్త్రి.

వీరాస్వామి కొంచెంసేపు ఆలోచించి ఇలా అన్నాడు. "ఏ విషయంలోనైనా సరే వయసునుబట్టి పోకపోతే వెఱ్ఱివాళ్ళం కావటము నేది నిశ్చయం."

"వయసు ముదిరిందికదా అని జీవితాన్ని నాశనం చేసుకోమని ఎక్కడున్నదోయ్? ధనలోపం గనక; వయసు ముదిరింది. కాయకష్టం చేసుకుని భార్యను పోషించుకునే స్థితిలోకూడా లేవని వూరుకోడానికి? సంతానమైనావుంటే అనుకోవచ్చు. పితృఋణం తీర్చుకోలేని అధముడవవుతావా? వాళ్ల పుణ్యవిశేషాలవలన స్వర్గసీమ నలంకరించిన నీ పితృదేవతలు ఒక్కమాటుగా తటాలున పాపకూపంలోకి రాలిపడరూ? బిడ్డాపాపా లేని బ్రతుకు ఏమిబ్రతుకయ్యా? నిన్ను భగవంతుడు మాత్రం ఎట్లా మెచ్చుతాడు? పున్నామ నరకమును

భరించటం సామాన్యమైనపని అనుకున్నావా? అయినా ఏ మాత్రం వయసు ముదిరిందేమిటి? నాకంటే పదిహేళ్లు చిన్నవాడివి కదా!"

"నాకు మొన్న నాలుగో తారీఖుకి యాభై ఆరు నిండినై తెలుసా?"

"అబ్బో చాలా పెద్దవనుకే! పిచ్చివాడ, ఆ వయసు మానవునికి ఒక పెద్దవయసుటోయ్? పాలడబ్బాల్లోనూ కల్తీ ఆముదంలోను పెరిగే ఇప్పటికాలపువాళ్లమా ఏమిటి? నలభైయేళ్లకే ఒళ్లు జవజవలాడిపోడానికి! నువు చెప్పినవయసు నాకు దాటిన తర్వాతే మా చివరి వాళ్లిద్దరూ పుట్టింది! ఇదిగో వీరయ్యా ఒక మాటచెప్తాను. మానవుడై పుట్టినాక ఒక బాల్యంలో తప్ప మరే దశలో నైనాసరే గృహము, గృహిణి వుండి తీరవల్సిందే! అలా లేనివాడి బ్రతుకు బ్రతుకేకాదు. నరకకూప."

ఈ చివరిమాటలు వీరాస్వామి మనసుకు సూటిగా తగిలినయ్. వీరాస్వామి వెంకోజీకి మరొక విషయంపై దృష్టి మరలేటట్లు ప్రసంగం ప్రారంభించాడు. వెంకోజీ యీ విశాల విశ్వంలోని ప్రతివిషయమును గూర్చి తనకు గల అతి పరిమితమగు జ్ఞానమునే వుపయోగించి గుక్క త్రిప్పుకోకుండా గంటలకొలదీ అమోఘంగా మాట్లాడ గలడు. ఫలాని విషయం కావాలనే పట్టుదల ఏమీ వుండదు. తనకు అనంతమగు లోకజ్ఞానం కలదనీ, గొప్ప అనుభవజ్ఞుడనీ ఇతరులు తలచగలందులకు ఏదో ఒకవిషయ ముంటే చాలును. కాంగ్రెస్ మంత్రుల హయాములో ప్రభుత్వపు వివిధ శాఖలకు సంబంధించిన భవన నిర్మాణ సందర్భములలో వాస్తుశాస్త్రము పట్ల అశ్రద్ధ చూపుటచేతా, వైవాహిక సాంప్రదాయ ములపై పారంపారం లేని ఆంక్షలు విధించుటవల్లా ఆంధ్రదేశంలో యీ మహా కాంగ్రెస్ పతనం సంభ వించిందని పదేపదే చెప్తూంటాడు. తన అమూల్య విశ్వాసములకు విలువయిచ్చే వాళ్లెవరూ కన్పించలేదనే నిరుత్సాహమంటూ ఏమీ వుండదు. కనీసం గంట సేపైనా దినపత్రిక చూడటం, దేవాలయంలో పురాణ శ్రవణం చేసివచ్చి ఆ విన్నదానిని గోరంతలు కొండం తలుగా చేసి అద్భుత వర్ణనల్తో గూర్చి తన విమర్శనల్తో సహా వినేవారికి తలనొప్పి వచ్చేటంతవరకూ వాగ యటం—ఇవి ఇతని ముఖ్య దైనిక విధులు.

వీరాస్వామి లోపలికి వెళ్లి పక్కమీదవాలి వెంకోజీ పలుకులను గూర్చి దీర్ఘంగా ఆలోచింప ప్రారంభించాడు. ఆలోచించిన కొలదీ మనసు విభిన్న భావాల తాకిడితో బరువెక్కిపోతోంది. 'గృహము గృహిణి లేనివాని బ్రతుకు బ్రతుకే కాదు. నరకకూప' అని అతని శ్రవణపుటముల్లో వెంకోజీ గంభీర కంఠనాదము కొట్టవచ్చినట్లు ధ్వనిస్తోంది. తాను మూడు సంవత్సరాలనుంచీ శాంతి సౌఖ్యాలకు దివ్యనిలయమని దేనిని గురించి తలమగున్నాడో, ఆ జీవితకాలమునకు గాలిలో పైకెగసిపోవు కాగితపు ముక్కకున్నంత విలువ కూడా లేదని అతని ఊహాపథంలో వెంకోజీ నిలబడి నొక్కి వక్కాణించి పల్కుతున్నాడు. తాను జీవితంలో యింతవరకూ రెండే సుఖాలను చవిచూడగలిగాడు. మొదటిది అధికా రులసేవ, రెండవది అవకాశం వున్నంతవరకూ జేబులు నింపుకోవటం. ఇకపోతే దాంపత్య జీవితం అటూ పోటూ లేని మంద నదీ ప్రవాహంవలె నడిచిపోయింది. తన భార్య ఆదెమ్మ పెద్దగా సుఖడోలికల్లో వూగిం చిందీ లేదూ. దుఃఖాలలో ముంచి తేలనెత్తి అధః పతితున్ని చేసిందీ లేదు. ఏదో సామాన్య గృహిణిగా సనాతనాభిప్రాయముల్లో జీవించి వూపిరి విడిచే నిమిషంవరకు సంతానప్రాప్తిలేని దుఃఖంతో కుమిలి పోతూనే వుంది. ఆమె చిరకాల వాంఛితాన్ని నెఱ వేర్చుట తన విధి కాదా? ఆమె జీవితాశలను ఫలింప చేసి ఆ అమాయికపు ఇల్లాలికి ఆత్మశాంతి చేకూర్చుట తన విధి కాదా? ఇప్పటికీ తనకు పదిమైళ్ళ దూరంగా తారట్లాడుతూండిన జరత్వమును గూర్చి డిపార్టు మెంటువారు వులికిపడి సర్వీసుకు పనికి రావని వెళ్ల గొట్టేశారు గాని అసలు తనలో ముసలితనం ఎక్కడున్నది? పదిసంవత్సరాల క్రితముకంటె యీ రోజున తన దేహదారుఢ్యం ఒక వీసమైనా తగ్గ లేదే మానసిక పటిష్ఠత కూడా శారీరక బలమునే అనుసరించి వున్నదికదా! ఒక్కొక్కప్పుడు తన ఆత్మ విశ్వాసములకే ఎదురు తిరిగి తన మనసు ఎంత మారాము చేసూ వుంటుందో తనకు పింఛను యిచ్చి బంపిన ఆ జిల్లా అధికారులకు ఏమి తెలుసు! వీరాస్వామి మనసు కొంచెంగా మెత్తబడ్డది. వెంకోజీ అతని హృదయంలో విజయపతాక ప్రతిష్ఠాపనకై ఇప్పుడిప్పుడే సాధన సామాగ్రి కూర్చుకుంటున్నాడు. వెంటనే కొద్దికాలం క్రితం జరిగిన ఒక ఉదంతం అతని చిత్తవీధిలో వూగింది ఆ వయ్యారి మంత్రసాని తనవేపు ప్రణయ

దృక్కులు విపరీతపు శరీరం పులకరించి ఏ మధుర స్పర్శకో ఆరాటపడ్డది. తాను తెలివిగలవాడు గనుక పరిస్థితులు గ్రహించి రాగాన పడకుండా ప్రవర్తింప గలిగాడు. ఆ క్షణానే తనకింకా కొంతకాలంపాటు స్త్రీ సాంగత్యపు అవసరం కలదని గుర్తించాడు. కిటికీ చువ్వల సందులలోంచి మలయపవనములు బలవంతంగా దొరుకొనివచ్చి అతని వీపును దువ్వగా, మెత్తగా తాకుతున్నయ్. గోడప్రక్క నేవున్న సంపెంగి చెట్టు పువ్వుపరిమళమును లోపలకు జోరుగా పంపుతోంది. వీరాస్వామి కొంచెం విసుగ్గా లేచి కూర్చొని శాలువా కప్పుకుని తలనొక్కుకుంటూ లేచి కిటికీవద్దకు వచ్చి నిలబడి చువ్వలసందుల్లోనుంచి దృష్టి బయటకు సారిస్తున్నాడు. ధవళచంద్రికలు తెల్లని భావ్యములను వర్షిస్తున్నయ్. దూరంగా కనిపిస్తూన్న ఇసుకతిన్నెల కొంతల్లో సువర్ణప్రతిమల వలె మెరుస్తున్నాయి. ఆ ప్రక్క నేవున్న నదీప్రవాహపు శీతల ఏకో ఆకాశమును, పరమావధిని దృష్టిలోవుంచుకొని చురుకుగా ముందుకు సాగిపోతోంది. ఎక్కడినుంచో ఝుంకార ధ్వనితో గభాలునవచ్చి ఒక భ్రమరం మందార కుసుమంపై వాలిమధుభిక్షణ ప్రారంభించింది. ఎదురుగా కనిపిస్తూన్న జామచెట్టు శాఖోపశాఖల్లో ఫలపత్ర కుసుమాదులతో నిండి చల్ల గాలికి మెత్తగా తల వూపుతూ అతన్ని చూచి వెక్కిరిస్తున్నట్లుగా వుంది. వీరాస్వామి మనసులో పదిమంది వెంకోజీలు ఏకకంఠ స్వరంతో నిగ్గతీసి అడుగుతున్నారు. 'ఆ క్రోధ నీకు ఏదయ్యా? నీ జీవితవృక్షం ఎండిమోడైపోయింది' మరల వెంకోజీ కంఠం మానవ ప్రబోధం ప్రారంభించింది. 'పిచ్చివాడా? వివాహం చేసుకుని నీ జీవిత వృక్షమును చిగిరింపచేసుకో. సృష్టిలో వికాసం లేని దేనికీ సౌఖ్యం లేదు. ముకుళిత పుష్పంవలన ప్రపంచమునకు కలిగే ప్రయోజనం ఏమిటి? ఏకాంతంవలన నీకు లభించేదల్లా మనసు సంకుచితమైపోవటమే. అమృతప్రాయమైన ఆనందాని అనురాగమునకు దూరముగా వుండి మనసును అనవసరంగా ముండింపజేసుకుని నీకు నీవై మృత్యుదేవతయొక్క కౌగిలింగములోనికి ఒరిగిపోకు. నీలాల నింగిలో నిండు జాబిల్లి ఏ కుసుమ కోమలియొక్క రాగసుధను పొంది వలె వనో ఎంత వేగంగా పరుగిడుతున్నాడో చూడు.' వీరాస్వామి అస్థిమితచిత్తంతో గిరుక్కున వెనక్కు తిరిగివచ్చి పక్కపై వాలి నిద్రాదేవికి స్వాగత వాక్యాలు పలికాడు. వెంకోజీ ప్రబోధనములు అతని జీవశక్తిలో కలుగజేసిన గంభీరమైన కదలికను ఆ వెన్నెలరాత్రి ఒక కల్లోల ప్రవంతిగా పరిణమింపచేసింది.

మర్నాటి సాయంకాల సమయాన పురాణప్రవచనాంతరం వెంకోజీ వీధియరుగ్గులోనుంచే 'అది విడిచిన్నదియ్యా భీష్మాచార్యులు సర్వరాజులు ఏం సర్వం బోధ చేస్తారయ్యా? మనవాళ్ళకు చెపితే వచ్చును గాని మాంసభక్షణ ఎంత పాపభూయిష్టమని చెప్తాననుకున్నావ్! అసలు అవాపకు అహోపవాస్త్రాలు వాడటం మా చెప్పే ఫలమైపోయింది వీరయ్యా.' అని స్వస్తి చెప్పుకుంటూ లోపలకొచ్చి వసారాలో కూర్చున్నారు. ఇతరులనుంచి జవాబులేదనే నిరుత్సాహం వెంకోజీకి లేనే లేదు. వీరాస్వామి ఏదో ఆలోచనల్లో మునిగి మౌనంగా కూర్చున్నప్పటికీ వెంకోజీ మరల తన అమూల్యాభిప్రాయములను వెలువర్చ నారంభించాడు. 'కాని వీరయ్యా భీష్మునంటే నాకు ఒకందుకు మహాకోపమయ్యా, పోనీ తన వలపుల భరించను తండ్రి కర్పించి గొప్ప త్యాగమే సలిపాడనుకో. తాను కూడా ఏ పేదింటిపిల్లనో చూసుకుని పెళ్ళాడివుండ కూడదూ? ఏమున్నదయ్యా? గృహము, గృహిణి లేని జీవితంబీబలువారిన నల్లరేగడి నేల కాదయ్యా?...' వెంకోజీ అనర్గళోపన్యాసమునకు అడ్డుతగిలి వీరాస్వామి అన్నాడు "అంతే నంటావా మామా?"

అవును అంతేగాక! నీ మాటైనా అంతే"

"అయితే చేసుకుందామని వుద్దేశం కలిగినా నాకీ యీడులో పిల్ల నెవరిస్తారు మామా?"

"ఎవరిస్తారా? నీవు ఒప్పుకోవాలే గాని బోలెడు మంది సిద్ధంగా వున్నారు."

"నిజంగానా మామా? నాకు వివాహం చేసికోవాలనే అని పిస్తోంది."

"అయితే కనుక్కుంటాను వుండు. చెరువు కట్ట మీద ఎల్లయ్య దగ్గర ఒక పిల్లవుంది. చక్కని చుక్క! అయితేమటుకు ఎల్లయ్య దరిద్రదోషం వలన కొంత డబ్బు కోరుతున్నాడట. పాపం అతగాడు పసువుల వ్యాపారంలో దెబ్బతిన్నాడు కదూ!"

ఇల్లు నిర్మించి పెట్టడంలోను ఇల్లాల్ని ఏర్పర్చి పెట్టడంలోను వెంకోజీ మహా నేర్పరి. పదిహేను

రోజులు ఆదేపనిగా పెట్టుకుని ఎల్లయ్య ఇంటి చుట్టూ తిరిగి ఎవరికి చెప్పేమాటలు వారికి చెప్పి ఇరువురి చేతా ఒప్పించాడు. మొదటయితే వీరాస్వామి కొంచెం అయిష్టత కనపర్చాడు కాని వధువును చూచిన తరువాత ఎల్లయ్య అడిగిన రెండు వేల రూపాయలు ఇవ్వడానికి ఏమాత్రం వెనుకాడ లేదు. ఆ జవ్వని తన వంటింట్లో నిలబడితే చాలునను కున్నాడు వీరాస్వామి. ఆ తరుణి ఒక విద్యుల్లతా విగ్రహం. అనాదరణచే ఆ సౌందర్యశోభ ధూళి పట్టివున్నది. సాటిలేని విలువగల అమృత భాండం తనది కాబోతున్నదనే వుత్సాహంతో మరొక రెండు వేలు ఖర్చుపెట్టి ఆభరణాలు చేర్పించి ఒక వెయ్యిరూపాయలు వివాహ కార్యక్రమములకు వెచ్చించాడు.

మంచిరోజు చూసుకుని నూత్న వధువుకు సర్వ లాంఛనాలూ జరిపి తన ఇంటికి తెచ్చుకున్నాడు. ఆరోజు సాయంకాలమున వీరాస్వామి కనకాన్ని తన ముందు కూర్చోబెట్టుకుని తన ఆచార వ్యవహారములను గురించీ, తన అలవాట్లను గూర్చీ వాటి కనుగుణంగా ఆమె నడుచుకోవల్సిన పద్ధతుల్ని గూర్చీ సవివరంగా బోధించాడు. చివరకు వీరాస్వామి 'ఏమంటావ్, చెప్పాను కదా?' అన్నాడు కనకం ముసిముసి నవ్వుల్తో తన అంగీకారాన్ని తలవూపుతూ తెలియ జేసింది. ఒక ఘనకార్యం సాధించినంత గొప్పగా సంతృప్తి చెందాడు. ఆ మధురక్షణాన అతని మనసు ఒక దివ్యానుభూతిని పొందింది. తన జీవితపు పోకడలకు తగినట్లుగా ఆలేత గుండెల్లో మార్పు తేగలిగానని ఒక విధమైన దర్పదనము, ఆనంద పారవశ్యత, పొందాడు. ఇంతకాలంనుంచీ అతని మనసు నావరించియున్న కొన్ని విశ్వాసములలో బిగువు సడలింది. మూసుకుని వున్న అతని హృదయ కుహరమును కనకంయొక్క లావణ్యశోభ నెమ్మదిగా తెరిచింది. ఆమె అరమోడ్పు కనులనుండి సుకుమారంగా ఒలికి పడుతూండే శృంగార దృష్టులు ఉద్రేకం చల్లారిన అతని గుండెల్ని చక్కిలిగింతలు పెడుతున్నయ్. ఆ నడకలోని ఒయ్యారము, ఆకర్షణ యంత్రాలనపిగిన ఆ గులాబీ చెక్కిళ్ళు, గుండెల్ని వూపే ఆ కిలకిల నవ్వులకు అతనిలో నిద్రాణమైయున్న కొన్ని శక్తులు చైతన్యంపొంది విజృంభించ మొదలిడినాయి. విరక్తిభావాలన్నీ తుడుచుకుని పోగా అతని హృదంతరమున అనురాగోదయమైంది. వాడి పోయిన జీవితపు ఆశలు చిగిర్చి కొంచెంగా పుంజు కుంటున్నాయి. యౌవనపరిమళం గుబాళించే ఆమె కౌగిలిలో మహత్తర ఆనందానుభవమును పొందగలు తున్నాడు వీరాస్వామి. ఆ వలపు తీపి అతనికి తన వయసునుకూడా జ్ఞాపకం లేకుండా చేస్తోంది. ఆ నవ వికసిత పుష్పమును తన చేతిలో బంధించుకుని తన కనువైనరీతిగా వుపయోగించుకోగలననే ధైర్యం, అహం అతనిలో వుదయించినయ్. మూడునాలుగు మాసాలు గడిచిన తరువాత ఒకనాటిరాత్రి భోజనసమయాన విస్తర్లో తన కయిష్టమైన కొన్ని పదార్థములు వడ్డించి వుండటం చూసి తన బోధనలు కనకంలో ఏమంత చురుగ్గా పనిచేయటంలేదని గ్రహించి వీరాస్వామి వెంటనే కొంచెం మందలింపు ధోరణిలో గద్దింపుగా అడిగాడు. "ఇంతకాలంనుంచీ నేను నా అలవాట్లను గూర్చి నీకు చెప్తూవచ్చిన విషయం ఏమిటి? నీవు యిప్పుడు చేసినపని ఏమిటి? నేను ఖచ్చితమైన శాకాహారినని నీకు తెలుసుకదా!" ఏమాత్రం వ్యవధిలేకుండా సురసురలాడుతూ కొంచెం పెళుసుగా జవాబిచ్చింది కనకం "ఒకరికోసం నా నాలుకమీద వాతపెట్టుకోటం నాకు చేతకాదు. అన్నిపనులూ డబ్బువల్లనే సాధించవచ్చునను నమ్మకతో వుండి ప్రయోజనం లేదు." యీమాటల్తో చెంపలు రెండూ వాయించినట్లయింది. అతని అహం బాగా దెబ్బతిన్నది. ఆ చివరివాక్యం అతనిమనసుపై ఆగ్నేయాస్త్రంలాగా పనిచేసి ఎంతోసేపు ఆ వేదనతో అలమటింపచేసింది. అయినప్పటికీ ధైర్యం కోల్పోడానికి ఇష్టపడక "నీమాటలు నాకేమీ అర్థం కావటంలేదు" అన్నాడు. "అర్థ తాత్పర్యాలు చెప్పేందుకు నాకిపుడు తీరిక లేదు." అని జవాబిచ్చింది కనకం నుదురు చిట్లిస్తూ.

ఈమాటలు మనసును నీరసపరుస్తున్నప్పటికీ 'పరిస్థితి మించిపోయిందేమీ లేదు. అదుపులోకి తేవచ్చు' అని అతనిలోని అహం అని అంటూ కొంచెం నిబ్బరాన్ని కలిగిస్తోంది వీరాస్వామి యిక మరి ఎదురు మాట్లాడకుండా ఒకనిమిషకాలంపాటు దీర్ఘంగా ఆలోచించి చెమ్మగిల్లిన నేత్రాలతో పని ముగించుకుని విస్తరి ముందునుంచి లేచాడు.

భోజనానంతరం రోజూ మాదిరిగానే వీరాస్వామి వసారాలోకివచ్చి కూర్చున్నాడు. తరువాత కనకంకూడా తనభోజనం పూర్తి చేసుకుని చక్కగా శృంగారించుకుని పరిసరాల్ని సెంటు సువాస

వళ్లో నింపుకొని ఒయ్యారంగా వచ్చి అతనికి తమలపాకులు యీనెలుతీసి యివ్వటం అలవాటు. కాని ఆరాత్రి వీరాస్వామి ఎంతసేపు వేచివున్నా అదేమీ జరుగలేదు. కొంతసేపటికి గదితలుపులుకూడా మూతపడ్డ శబ్దం వినిపించింది. వీరాస్వామి లేచివెళ్ళి వంటఇంట్లో చూచుసరికి ఎక్కడి దక్కడె అంతా సర్దివున్నది. గదిదగ్గఱకు వచ్చి ఎంతోసేపు 'కనకం, కనకం' అని పిలిచాడు. జవాబులేదు. పిలవగా పిలవగా కొంతసేపటికి ఎక్కి ఎక్కి ఏడుస్తున్నట్లు ధ్వని కొంచెంగా వినిపించింది. 'నిన్ను నేను ఏమన్నాను కనకం? యీ కాస్త మాత్రానికేనా?' అని అన్నాడు వీరాస్వామి అనునయంగా. ఇంకా ఎన్నో విధాలుగా బ్రతిమాలుతూ మాట్లాడాడు. కనకంనుంచి జవాబూ లేదు. కవాటములు తెరువబడనూ లేదు. చివరకు విసుగెత్తి వీరాస్వామి వసారాలో నేలమీదనే వాలి నిద్రపోయాడు.

ఆ మర్నాటి ఉదయానే వీరాస్వామి ఎల్లయ్యను పిలిపించి కనకం ముందు నిలబెట్టి గతరాత్రి వృత్తాంత మంతా చెప్పాడు. ఆయన వీరాస్వామి చెప్పిన విషయమంతా విని చివరకు కోపంతో మండిపడిపోతూ 'అప్పుడే అల్లరికి మొదలా? చాల్లే వూరుకోవయ్యా. నా పిల్ల యీ పెళ్ళివద్దని ఎంత గోలపెట్టినా వినక దాన్ని ఎంతో కష్టం మీద సమాధాన పర్చి యీ సంబంధం చేస్తే దాని బ్రతుకు బజార్లో పెట్టడానికి ప్రయత్నిస్తున్నావా? నువ్వు అసలు మాకు ఏ విషయంలో సాటి? వంశ మర్యాదలోనా? గొప్ప తనంలోనా? నా ప్రారబ్ధం యిలావుండి నేను పడిపోబట్టిగాని, లేకపోతే జమిందార్లింటికి వెళ్ళాల్సిన పిల్ల కాదటయ్యా? చుక్కలాంటి పిల్లను తీసుకెళ్ళి ముసలి పీనుక్కిచ్చి కట్టానని వూళ్ళోవాళ్లు నన్ను ఎంత నిందిస్తున్నారో తెల్సునా? జాగ్రత్త! మర్యాదగా నడుచుకో..." అని అంటూ నాలుగు కేకలు పెట్టి వెళ్ళిపోయాడు.

దీంతో వీరాస్వామి కుప్పకూలినట్లు కూలిపోయాడు. రాత్రి కనకం మాటలు చెంపదెబ్బలు. ఇప్పుడు ఎల్లయ్యమాటలు కాలితన్నులు. దిగులుగా ఎదుటివైపు చూస్తూ కూర్చున్నాడు. అతని నేత్రముల్లో అశ్రువులూరినై. నడకలో విజయగర్వం చూపిస్తూ కనకం లోపలి కెళ్లిపోయింది. తాను ఒక అంధకూపంలో పడిపోడానికి యీ తతంగం ఒక నాందీవాక్యంగా తోచిందతనికి. ఇక ముందునుంచీ ఇతరుల ఆజ్ఞానుసారంగా పనిచేయు యాంత్రిక సాధనములవలె జీవితమును గడుపుటే మంచిదనీ, లేక చైతన్యముగల మానవునిగా స్వాభిప్రాయములో, ఆదర్శములో జీవింపదల్చుకుంటే తనకు మర్యాద దక్కదనీ తలచి ఆ పద్ధతినే అవలంభింప తన మనసులో ఆ క్షణాన్నే శపథం చేసుకొన్నాడు వీరాస్వామి. ఆ నెలాఖర్న కసాయివానికి నలభైరూపాయల బిల్లు చెల్లించవల్సివచ్చినప్పుడు యాంత్రిక వీరాస్వామిలో అణచిపెట్టుకున్న మానవత్వం కొంచెంగా తలయెత్తి చూసింది. కాని వెంటనే కనకం కల్పించుకుని 'సంసారమంటూ ఏర్పర్చుకున్న తర్వాత ఖర్చుగాక ఏమవుతుంది?' అంటూ కొఱకొఱ చూపటంతో శపథం మాట జ్ఞప్తికివచ్చి మారుమాటాడకుండా పర్సుతీసి నాలుగు పదిరూపాయల కాగితాలూ వాని చేతిలో వుంచాడు.

వీరాస్వామి ఎంతకాలం ఓపికపట్టి చూసినా పరిస్థితుల్లో ఏమాత్రం మంచి మార్పు కనిపించటంలేదు. రోజులు వారాలు మాసాలు గడిచినకొద్దీ అతను యీ యాంత్రికస్వభావాన్ని భరించలేకపోతున్నాడు. అతనిలోని మానవత్వం పౌరుషహీనమై పడి వుండటానికి ఒప్పుకోటంలేదు. మనసుని ఎంత రాయి చేసుకుని మూగగా కాలం గడుపుతూన్నప్పటికీ కళ్ళ ముందు జరిగే ఒక్కొక్క అకార్యము, కర్ణముల్లోకి బలవంతంగా దూరి వస్తూన్న ఒక్కొక్క కఠోర వాక్యము అతని మనసుని రాచి రంపాన పెడుతున్నాయి. కర్తవ్యం కానలేక నిస్సహాయుడైన అతని లోని పరిశుద్ధహృదయం దీనాతిదీనంగా విలపిస్తోంది. రాత్రిసమయాలందు అతనిపట్ల నిద్రాదేవి ఘోరంగా కాఠిన్యం వహిస్తోంది. పక్కమీద కూర్చుని గంటల కొలదీ, కన్నీటిబాష్పాలతో భూదేవిని అభిషేకించటం అలవాటైపోయింది. అంధతమస్సులకుకూడా గుండెలు కరిగి వేగంగా వెనక్కు జరిగిపోతున్నాయి.

అలవర్చుకుందామనుకున్న యాంత్రికపద్ధతి అతనికి అనుకూలంగాక చాలా తిరుమగా తన విధి నిర్వహణలో దెబ్బతింటూన్నది. భగవంతునిపై భారం వుంచి శపథాల్తో అణగగొట్టి నిరాయాసంగా కూర్చొపెడదామనుకున్న అతనిలోని 'మానవత్వం' ముందు అతని మనశ్శక్తి పనికిమాలినదై పోతూన్నది.

భూతకాలపు బాధలు గౌరవ శోకాలు వెనుకనుంచి పొంచియున్నా ఎత్తిపొడుపు మాటలు విసుర్తూ అతని గుండెల్లోని నరాల్ని నులిమివేస్తున్నాయ్. జీవశక్తి కలిగివుండటమే మానవుని ప్రత్యేకత అని వీరాస్వామి తెల్సుకోలేదు. తన జీవితంలో ప్రవేశపెట్టుకున్న యాంత్రిక విధానం నిష్ఫలమైపోవడానికి అదే కారణమనే మాట అతని మనసుకు తట్టలేదు. తన జీవితంలో ఆశాసౌధములన్నీ కూలిపోయి పరిసరములు హేయభోజనములుగ పరిణమించి, ఆహార పానీయాదులు విషప్రాయములై, భవిష్యత్తు భయదాంధకారముగతోచి, హృదయం దుర్బలమైపోయి, యీ విశాల ప్రపంచంలో ఆదరణ చూపే అమృత హస్తం లభించక, సూర్యచంద్రులు సైతము విషాద జీమూతములై హింస పెడుతూన్నప్పుడు మానవునిలోని 'మానవత్వం' అతన్ని ఆత్మహత్యకైనా పురికొల్పవచ్చు. లేక లోకం యొక్క సానుభూతి కొంతవరకూ కలిగివుంటే, హృదయబలం కోల్పోక, కనీసం సామాన్య వాక్యాలయినా లభించి గుండెల్ని తడిచేయగల్గినప్పుడు విప్లవభావములు రేకెత్తించి రణరంగ ప్రవేశమునకైనా ప్రోత్సాహించవచ్చు. మరొక రకమయిన మానవులుకూడా వుంటారు. వారిలో శక్తిహీనమై బూజుపట్టి వున్న మానవత్వం వారి హృదయాల్ని నిరంతరం దుఃఖాగ్నిలో భస్మీపటలం గావిస్తూ, జీవచ్ఛవాలలాగా జీవించేవున్నాననిపిస్తూ ఏ నిమిషానికా నిమిషం మనసుని వాడికత్తితో గాట్లు పెడుతూ క్రమక్రమంగా కాష్ఠభూమికి సమీపంగా లాగుతూ వుంటుంది.

ఒకనాటి సాయంకాల సమయాన వెంకోజీ పురాణ శ్రవణానంతరం వీధిగుమ్మంలో నుంచే వాగుడు మొదలెడుతూ లోపలకు వచ్చాడు. "అమెరికా వాడు కూడా మాయచంద్రుణ్ణి చేసి ఆకాశంలోనికి విడిచాడుట వీరయ్యా. వాడెంత మొనగాడయ్యా, నాకు ఇప్పటివరకు తెలీదసుమీ. ఇందాక ఏదో సందర్భం వచ్చి ఇట్లా జరిగింది వెంకోజీ అని చెప్పారు మా పురాణం శాస్త్రిలుగారు..."

వీరయ్య కొంచెం కోపావేశంతో అన్నాడు: "నీవేనా మొనగాడివి కానిది! నీవూ చేసి చూపించావుగా నాకు ఒక పెళ్లి! మూలనున్న వాడ్ని ముంగిలికి తెట్టి అవస్థల పాల్జేశావ్."

"అదేమిటి అట్లాగంటావ్ వీరయ్యా? ప్రతి మానవుడు ఇల్లూ ఇల్లాలూ కలిగివుండాలి. ఇది మానవుని ప్రాథమిక హక్కులు" చేతులు రెండూ వెనక్కి మెలి పెట్టుకుని పచార్లుచేస్తూన్న వీరాస్వామి వెంటనే ఆగి కొంచెం వెటకారంగా ఇలా అన్నాడు—"అవునవును. నువ్వు కట్టిపెట్టే ఇళ్లుకూడా ఇలానే వుంటాయా?" వెంకోజీ [illegible] కోపం తోటి వూగిపోతూండగా ఇలా అన్నాడు—"నేను తయారుచేసిన ఇళ్లా? ఎంత పునాదిబలం ఏర్పాటు చేస్తానో తెల్సునా? నా చేతిమీద నడిచిన గృహనిర్మాణాలను కంటే వాస్తుసిద్ధాంతి ఇంతవరకూ పుట్టలేదనుకో. కావాల్సివుంటే వెళ్లిచూడు. గుంటూరులో జిల్లాకోర్టు భవనం, తెనాలి తాలూకా హైస్కూల్లోని పెంకుటివసారా, కొల్లూరులోని పున్నయ్యగారి అన్నదాన సత్రం, ఈవూళ్లో పుగాకు డబ్బుతో లేచిన మేడలూ—వీటన్నిటికీ మేస్త్రీని నేనేనయ్యా. ఆ కాలాన పంచపాండవుల ఆస్థానమయుడు వాస్తుసలహాదారుడు - యీ కాలాన పాండవుల సుగుణాలన్నీ పొదిగివున్న మా పురాణం శాస్త్రిలవారికి నేను వాస్తుసిద్ధాంతిని." వీరాస్వామి ఏదో జవాబివ్వబోతూంటేగా లోపల్నుంచి సన్నని కంఠస్వరం పలికింది "అన్నీ మంట పెట్టావులే. వారికీ వీరికీ పాచిపనులతోసహా సేవచేసి పించుకున్న ఆ నాన, వృత్తినుంచి విరమించి డాబుల డప్పు వాయించుకుంటూ కూర్చున్న నువ్వూ మీ యిద్దరూ కలిసి [illegible]."—వెంకోజీ ఖిన్నుడై మారుమాటాడకుండా బయటికొచ్చి తన వెంటవున్న వీరాస్వామితో 'ఏమిటి వీరయ్యా యీ విపరీతం?' అని అన్నాడు ఆశ్చర్యంగా.

"నీవు తెచ్చి పెట్టిందే" అని చీత్కారంగా జవాబు. వెంకోజీ వెంటనే పక పకా నవ్వుతూ "ఇది దాంపత్యం వీరయ్యా దాంపత్యం. ఇది ఒకప్పుడు [illegible] మరొకప్పుడు సుమశయ్య. ఇది నీకేమిటి? శ్రీకృష్ణ పరమాత్మ అంతటివాడికి ముక్కు తిమ్మన్నగారు ఎంత గయ్యాళి భార్యను ఏర్పాటుచేశాడో తెల్సునా? దేవతలే పరమపూజనీయంగా భావించే ఆయన శిరసును కాలితో తన్ని మరీ కసితీర్చుకుంది సత్యభామ......" వెంకోజీ మాటలకు అడ్డుతగిలి వీరాస్వామి గద్గద కంఠస్వరంతో ఇలా అన్నాడు. "నేను వచ్చి వచ్చి పెద్ద ఊబిలో పడ్డాను మామా. ఏ దృష్టితో చూసినా ఇది పెద్ద మడుగే. అవిడ

పోకుతే తెలుసు యీ భోగోపాయాలు ఏం చేస్తున్నయ్. సబ్బుబిళ్ళలకు సెంటుసీసాలకు అందులో ఇరవై రూపాయలు ఖర్చయ్యాయి."

వెంటనే వెంకోజీ నోరుతెరిచి బిగ్గరగా అన్నాడు. "సున్నిపిండి వాడమనవయ్యా. మిత వ్యయమే శ్రేయస్కరమని బోధించు. మరుగు అంటూ చేసేటి వీరయ్యా? కొంతకాలం ఓపికగా కాలం గడిపావంటే ఒక నందనవనమే కాగలదని నమ్ము. నా ఆశీర్వచనం ఇంతవరకు ఎక్కడా వ్యర్థమైంది లేదు. నువ్వు ఎంత పుణ్యపురుషుడవోయ్ వెంకోజీ అని అంటూ వుంటారుకూడాను మా పురాణం శాస్త్రిగారు. కనుక సంవత్సరం తిరిగేసరికి నీకు పుత్రరత్నం కలిగి తీరాలని నేను ఆశీర్వదిస్తున్నాను. తప్పకుండా కలిగితీరవల్సిందే. ఇక పో వీరయ్యా." అని అంటూ చెప్పి వెంకోజీ నెమ్మదిగా బయల్దేరాడు.

తాను వీథిలో నడిచిపోతూన్నప్పుడు అరుగుల పైని అమ్మలక్కల గుసగుసలు, మూక్కలు పిల్లల చిలిపి నవ్వులు, అడుక్కునే వాళ్ళదగ్గరనుంచీకూడా కనపరుస్తూన్న నిర్లక్ష్యదృష్టి—వీటన్నిటినీ వీరాస్వామి జాగ్రత్తగానే గమనిస్తున్నాడు. మనసంతా ఎప్పుడూ గుబులుగా వుంటుంది. కనకం ఎంతో అవసరంపడితే తప్ప అతనితో మాట్లాడటంకూడా మానేసింది. రెండుపూట్లా విస్తర్లో వడ్డించిన ఆ కాసిని మెతుకులూ నోట్లో వేసుకుని వచ్చి వసారాలో ఖిన్నుడై కూర్చుంటాడు. కనకం సర్వాలంకార భూషితయై, కృష్ణ త్రాచులాటి పొడుగాటి నల్లని జడ గుండెలపై త్రిప్పివేసుకుంటూ నీటుగా ఎక్కడికెక్కడికో తిరిగివచ్చేది. ఎవరెవరో వచ్చి తన మాటాపలుకూ లేకుండానే సరాసరి లోపలకువెళ్లి ఆమెతో మాట్లాడిపోతూండేవారు. తానొక గృహయజమాని అనే విలువ లేకపోగా అల్పజాతికి చెందిన పురుగుకంటె హీనంగా ఎంచబడుతున్నాడు. కండ్లలోనీరు కండ్లలోనే ఇంకింప చేసుకోటం ఆపని ఎన్నడైనా సాధ్యంకానప్పుడు ఎక్కడికైనా ఒంటరిగావెళ్లి గుండెలభారం తీరేలాగు విలపించి రావటం జరుగుతోంది. రాత్రి ఎనిమిదిగంటలకే కనకం లోపల గడియలు బిగించుకొని గదిలో పడుకుంటుంది. ఇక వీరాస్వామి అవసారాలో నేలమీదనే నిద్రపట్టక చాలా ప్రొద్దుపోయేవరకూ అటూ ఇటూ పొర్లి దుర్భరమైన మానసికయాతన పొంది పొంది చివరకు ఎప్పుడో కన్నుమూసేవాడు. ప్రస్తుతవిషాదవృత్తాంతాలతోపాటు గత జీవితంలోని సుఖమయానుభవాలుకూడా అతని మనసులోకి తొంగిచూస్తూ శరీరమంతా కంపరమెత్తిస్తూంటాయి. నీచంగా అనుభవిస్తూన్న కష్టకాలంలో గతించిన కాలం బాపతు స్వీయసుఖానుభూతులఛాయలు స్మృతిపథంపై తొణికిసలాడుటకంటె యమయాతన మరొకటి లేదు మానవుడికి.

వీరాస్వామి ఒకనాటిరాత్రి దేవాలయంలో హరికథ విని పొద్దుపోయి ఇంటికి వచ్చాడు. తన కొరకై వేచివుండే అవసారాలో నేలపై ఉస్సూరుమంటూ మేను వాల్చాడు. ఒక గంటకాలంపాటు కొంచెం విశ్రాంతిపొంది వచ్చిన అతని మనసును మరల విషాద మేఘములు క్రమ్మ ప్రారంభించినై. మనసును మూసుకుని నిద్రాదేవి చేతుల్లోకి ఒరిగిపోదామని ఎంత ప్రయత్నిస్తున్నా దుఃఖమయ వృత్తాంతాలు బలవంతాన లోనికి తోసుకునివచ్చి పీఠం వేసుకుని కూర్చుని తల నరాలను నొక్కేస్తున్నాయి. ఇంతలో రెండు కంఠాలు చిన్న చిన్నగా నవ్వుతూ మాట్లాడుకుంటున్నట్లుగా వీరాస్వామికి వినిపించింది. వెంటనే వీరాస్వామి లేచి వెళ్ళి తలుపు కంతల్లోనుంచి చూచాడు. అతని శరీరంలోని నరనాడులూ క్రుంగిపోతూన్నాయి. శరీరం ఒక్కసారిగా అమిత నీరసమైపోయి గజగజ ఒణికిపోతోంది. గుండెల్ని గట్టిగా అదుముకుంటూ తూలిపోతూన్న నడకతో వీధిలోకివచ్చాడు. ఇంతకాలము నుంచీ తనను వేధిస్తూన్న అనుమానములన్నీ పరమ సత్యస్వరూపములను ధరించి ప్రత్యక్ష నిదర్శనములుగా తనఎదుట నిలబడినయ్. ఇక ఏమాత్రం సందేహం లేదు. పట్టెమంచంపై కనకం ప్రక్కనకూర్చుని ఆమె గులాబీ చెక్కిళ్ళను అనురాగంగా నిమురుతున్నవాడు తప్పకుండా ఆ కిల్లీకొట్టు నారాయుడే! ఆ ఒంకులొంకుల క్రాఫింగుజుట్టు, ఆ కోలముఖము—వాడు తప్పకుండా నారాయుడే!

ఆ భయదాంధకార కాళరాత్రి సమయాన కోపం ఒకప్రక్కన దుఃఖం మరొకప్రక్కనా అతని మనసుపై సుత్తిదెబ్బలు కొడుతూండగా, గుండెలు తీవ్రావేదన తాకిడికి పగిలిపోవుటకు సిద్ధమవుతూండగా వీరాస్వామి వీధివెంట నడిచిపోతున్నాడు. నడిచి వచ్చిన వెనుకదిక్కు అతని వీపుపై మాదికోకలు చేస్తూండగా, కండ్లముందు కన్పిస్తూన్న ముందుదిక్కు

అతని స్నండేల్లో'కి దుర్భరమైన శీతల కంపనాలను పంపిస్తోంది.

వీరాస్వామి కాళ్లు ఒక శిథిల దేవాలయంముందు ఆగిపోయినై. కొంచెం ఓపిక తెచ్చుకుని మెల్లిగా లోపలికి వెళ్ళాడు. దేవాలయ ప్రాంగణం శిథిలశిల్పాలతో నిండివుంది. ప్రభుత్వ భూగర్భశాఖవారిచే ఏర్పాటు చేయబడిన పెట్రోమేక్సు లైటుమాత్రం కాంతివంతంగా వెలుగుతోంది. ఒక మూలనపడివున్న మనోజ్ఞ శిల్పఖండం వేపుకు నడిచాడు. ప్రాచీన భారతీయ శిల్పకారుల కళానైపుణ్య విశేషం ఆ శిథిల శిల్పపు లోతుల్లో జనికిగ్గి ప్రకాశిత మవుతోంది. ఒకప్పుడు ఏ దేవాలయపు శిఖరాలప్రక్కనో సుందరంగా నిలబడి అధిక పూజ్యతపొందిన ఆ శిల్ప ప్రతిమ నేడు మట్టిలో సగంవరకూ పాతుకుపోయి నక్కలు కుర్రాళ్ళు దానిపై కూర్చుని సిగిరెట్లు తాగే ఒంగుకు వుపయోగ పడుతోంది. కళ్ళు తుడుచుకుని ఒక్కతెపెర ఆ శిథిల శిల్పం వంక తేరి పారజూశాడు వీరాస్వామి. తన జీవితానికి ఆ శిథిల శిల్పానికీ ఎంతో పోలిక వుందనుకున్నాడు. ఇద్దరూ అనుభవించేదశలు ఒకే మాదిరివి! కాని దానికి హృదయంలేదు. తనకు హృదయంవున్నది. తనకుకూడా హృదయంలేకుండా పోతే యీ బాధలేదు.

వీరాస్వామి అక్కడనుండి లేచి వెంకోజిఇంటికి వెళ్ళి ఒకతూరి తలుపు దరిచాడు. జవాబులేదు. వెంటనే వెనక్కు తిరిగాడు. 'ఆయనమాత్రం ఏం చెప్తాడులే. భగవంతుడైన శ్రీకృష్ణుడే భార్యచేత కాలి తన్నుతిని కిక్కురుమనకుండా పడివున్నప్పుడు, మానవమాత్రుడివి నీవు యీ పనికి ఎందుకు సహించలేవు అని అడుగుతాడు. అంతే' అని మనసులో అనుకుంటూ ఇంటికి వచ్చాడు. నారాయణ్ణి రెండునిమిషాలక్రితం పంపించి బయట నిలబడివున్న కనకం వీరాస్వామినిచూచి "రాత్రి రెండుగంటలవరకు యీ తిప్పల్లకు అంతులేకుండా వుంది." అని అంది మూతి ముడుచుకుంటూ. అతని లోని ఆత్మశక్తి తగినజవాబునే సిద్ధపర్చిందిగానివెంటనే యాంత్రిక స్వభావం అడ్డుపడి నోరు నొక్కేసింది. అనంత దుఃఖాల్నీ ఆవేదనల్నీ అత్యంత సహనంగా తనయందు ఇముడ్చుకోగల్గిన కాలచక్రపు గంభీర గమనంలో తొమ్మిదిమాసాలుగబాగా దొర్లిపోయినై. పచ్చి శృంగార రసానుభవం, నీచస్నేహం కనకానికి ఒక ఘోరమైన సుఖవ్యాధిని సంక్రమింపచేసినయ్. అగ్ని పల్లవాధరములు తెల్లగా పాలిపోయి వికృత రూపాన్ని ధరించినై. ఆ నున్నని గులాబిచెక్కిళ్లు దళసరములై పగుళ్ళు చూపినయ్. వెన్నెలకాంతులు ప్రసరింపచేసే ఆ ముఖబింబం చిరుచీకట్లకాలవాలమై ఒక విషాద నిలయంగా మారిపోయింది. ఒంకులొంకులుగా తిరిగివున్న ఆ నీలకేశములు పలితవర్ణమునకు తిరిగి ఒక్కటొక్కటే రాలిపోతున్నయ్. తప్తకాంచనమును ధిక్కరించు ఆమె దేహమునకు నల్లని కప్పు పట్టింది. ఈ తీరుగా ఆమె మనోహరరూపవిలాస సంపదనంతనీ బొబ్బల వ్యాధి స్వేచ్ఛగా భక్షించి ఆమెను ఒక కురూపిగా, దూరాన్నుంచే చూచుటకు అసహ్య మొందవునట్లుగా తయారుచేసింది. తల్లిదండ్రులు కూడా ఆమె ఇంటికి రావటం మానుకున్నారు.

యాంత్రిక స్వభావం వీరాస్వామిని మాత్రం అహంకారావేశాలకు జుగుప్సకు అతీతుడ్ని చేసి అతనిచే ఆ కుళ్ళిపోయిన రోగికి సమస్తోపచారములనూ నోరెత్తకుండా చేయిస్తోంది. డాక్టర్ వచ్చి రోగిని పరీక్షించి కనకం చరిత్ర తెలిసివుండటే, చమత్కారంగా ప్రశ్నించాడు "యీ అమూల్యాభరణాన్ని ఎక్కణ్ణుంచి సంపాదించుకున్నారయ్యా?"

ఆ ప్రక్కనే నిలబడివున్న వీరాస్వామి తొణకకుండా వెంటనే జవాబిచ్చాడు "నావద్దనుంచే"

డాక్టర్ కలవరపడుతూ అడిగాడు "అలాగా? ఇంకా మీరేదో పెద్దమనుష్యులనుకున్నాను."

ఏమాత్రం తొణక్కుండా వీరాస్వామి చిరునవ్వుతో ఇలా అన్నాడు "ఆఁ చేసింది ఫ్యాషన్ వుద్యోగంకదండీ? పైగా మూడేళ్లపాటు ఏకాంత జీవితం"

శక్తిహీనములై వాలిపోతూండిన ఆమె దీన దృక్కులు ఆ నిమిషాన అతి భక్తి శ్రద్ధల్తో వీరాస్వామి పాదములకు మ్రొక్కినయ్. డాక్టర్ ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళిపోయాడు. కనకం వీరాస్వామిని పిలిచి మంచం మీద కూర్చోమని సైగచేసింది. వీరాస్వామి పక్కమీద కూర్చున్నాడు. అతని చేతుల్ని తన గుండెలకు అదుముకుని అతని నేత్రాల్లోకి ఏకాగ్రంగా చూస్తూ దీనంగా అడిగింది "నేను మీకు నిజంగా ఎట్లా కన్పిస్తున్నాను చెప్పండి. క్రూరరాక్షసిలాగా కదూ?..."

"కాదు, కనకంలాగా నే..."

ఆమె నిర్వణపోయి అన్నది "కనకంలాగానే!......... యీ స్థితిలో నన్ను మీ కనకంలాగానే భావిస్తున్నారా మీరు? మానవుల్లో ఇంతటి క్షమాశక్తి వుంటుందని నే నెప్పుడూ తల్చలేదు. దీనినే అసమర్థతగా భావించి మీకు దారుణద్రోహం చేశాను." ఆమె హృదయం శోకపరితప్తము కాగా కంట్లవెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయి.

"ఎందుకలా విలపిస్తావ్?" అని జాలిగా అడిగాడు వీరాస్వామి. కనకం తన ముఖాన్ని తన ఒళ్ళో దాచుకుని పొంగిపోతున్న దుఃఖభారంతో మాటలు వణికి పోతూండగా ఇలా అన్నది "మీ పరిశుద్ధ హృదయానికి మహా అపకారం చేశాను. మీపట్ల నేను సల్పిన అపచారానికి తగిన శిక్ష యీ లోకంలో నే అనుభవిస్తున్నాను ఇక ఆ లోకపు శిక్ష ఎంత ఘోరంగా వుండగలదో తెలీదు." అతని గుండెలు ద్రవీభూతమైనవి. బుగ్గలపై కన్నీటిధారలు చారలు కడుతున్నాయి. సానునయంగా ఆమె శిరమును నిమురుతూ ఓదార్చాడు.

వీరాస్వామి సంపాదించిన పదివేల రూపాయలు గబగబా ఖర్చయిపోవటమూ, కనకం తుది తఱిని క్షమా భిక్ష వేడి అతనినుండి యీ లోకమునుండి శెలవు పుచ్చుకోవటమూ ఒక్క తడవగా జరిగినై. ఆ పదిహేను రోజులూ ఎలాగో గడిపి అప్పుతెచ్చి ఆమె శ్రాద్ధకర్మలను పూర్తిచేశాడు.

కనకంతో బాటు యాంత్రిక స్వభావం కూడా అతనినుండి ఎగిరిపోయింది. వీరాస్వామి తిరిగి బస్తీ చేరుకుని ఒక బ్యాంకులో ఓర్మజవాను నౌకరి సంపాదించాడు.

ఉదయం పదకొండు గంటల సమయం, బ్యాంకు సెక్రటరీగారి ఆఫీసురూమ్ ముఖద్వారం ముందు శిల్పబంట్రోత్ వీరాస్వామి శిలగా, దర్జాగా, ఉద్యోగపాయగా నిలబడివున్నాడు. అతడు పూర్వము మాదిరే తన జీవిత తృప్తిలోని ఆనందం లవలేశము పొందాలని ప్రయత్నిస్తున్నాడే గాని కొద్దికాలం క్రితమే అతని బ్రతుకుబాటల్లో రగిలిన మంటలు అతని మనసులో ఆరిపోనే లేదు. మనసులోని మంటల బాధకు వేడి ముఖంలో కల్పించకుండా చేయాలని అతను ఎంతో ప్రయత్నిస్తున్నాడు కాని ఆ పని అతనికి సాధ్యం కావటంలేదు.


Statement about ownership and other Particulars about newspaper

**BHARATI**

**Monthly**

1. Place of Publication :
   6&7, Thambu Chetty St. Madras-1.
2. Periodicity of its publication :
   7 th of Every Month
3. Printer's Name :
   Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publisher's Name :
   Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address : (As above)
5. Editor's Name;
   Sri S. Sambhu Prasad
   Nationality Indian
   Address: 29, Chamier's Road, Adyar, Madras 20.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital.

| NAME | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 29, Chamier's Road, Adyar, Madras-20. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(*Sd*) S. RADHAKRISHNA,

28-2-1958 Signature of Publisher.

# జిగీష

## కృష్ణజ

కొందరు చూడడానికి సన్నంగావున్నా జ్వరం చీది ఎరుగరు. కొందరు వేడికాఫీ త్రాగితే వాళ్ల శరీరంలో టెంపరేచర్ రెండు డిగ్రీలు పెరగడం, ఐస్‌క్రీం తింటే ఆరు డిగ్రీలు తగ్గడం జరుగుతుంది. కొందరు ఇంగ్లాండు లాటి చల్లని దేశంలో కొల్లాయి గుడ్డతో వున్నా, సహారా యెడారిలో వూల్లతో శరీరాన్ని బంధించినా వాళ్లలో మార్పు కనబడదు. దీనికి కారణం కేవలం శరీరంలో బలంవుండడమే అనలేం. వాళ్ల మానసిక ప్రవృత్తే ఇందుకు కారణం. వాళ్ల మనస్సులు యినుపరజంతో చేయబడి వుండడం వల్లనే వారి శరీరం కూడా యినుపముక్కలా తయారవుతుంది. అందుకే బెర్నార్డ్ షా దృఢమైన శరీరంలో దృఢమైన మనస్సు అనే మాటను దృఢమైన మనస్సు వల్ల దృఢమైన శరీరం అని మార్చాడు. ఇలాటి మన స్థితినే సత్వగుణం అంటారు.

ఏపనినైనా విజయవంతంగా చేయాలంటే— ఏ పనిలోనైనా విజయాన్ని పొందాలంటే కావల్సినది ఈ సత్వగుణం గాని అవకాశాలు ఉపకరణాలు కావు. అందుకే 'క్రియాసిద్ధిః సత్వేభవతి మహతాం నోపకరణే' అన్నారు.

ఒకే చక్రంగల రథం, పాములు కళ్లాలుగా నుండి నడిపించాల్సినవి యేడుగుఱ్ఱాలు, ఆధారంలేని ఆకాశమార్గంలో అనూరుడివంటి చరణరహిత సారథివున్నా ఈ సత్వగుణం వుండడంవల్లనే సూర్యుడు యిరవై నాలుగు గంటల్లో భూమిని చుట్టిరాగల్గుతున్నాడు. చెరుకుగడ విల్లంబుతో, తూనీగల వింటినారితో, పుష్పబాణాలతో పరమేశ్వరుడంతటి వాడిని మన్మథుడు జయించగలడానికీ, అసంఘటితమైన కోతిమూకతో యోజనాల పర్యంతం సముద్రానికి వారధి కట్టి యే ఉపకరణాలు లేకుండానే శ్రీరాముడు సర్వవిధాలా ఉన్నత అవకాశాలు ఉపకరణాలు వున్న రావణుని జయించడానికీ ఈ సత్వగుణమే కారణం. ఈ సత్వగుణం లేనప్పుడు యెన్ని ఉపకరణాలున్నా జయం లభించదు.

అంటే విజయం పొందడానికి ముఖ్యమైనది మొక్కవడని మన మనస్సు—అందులో జయించాలనే తీవ్రమైన ఆకాంక్ష. దీనినే జిగీష అంటారు. జయం గాని ఓటమిగాని ముందు రూపరహితమైన మన మనస్సుల్లోను తరువాత బాహ్యపరిస్థితులలోను కలుగుతుంది.

చాణక్యుని గూర్చిన సంఘటన ఒకటి ముద్రారాక్షసంలో చెప్పబడింది. ఒకరోజున ఆయనకు అన్నీ దుర్వార్తలే వస్తాయి ఒకచారుడు ఒక్కప్రక్కన బొక్కసం చెయిజారిపోయిందనీ, వేరొక దూతవారి మరొక ప్రక్కన సామంతులు యెదురు తిరిగారనీ, ఇంకొకడు అన్నివైపులా పరిస్థితులు విషమించాయని చెబుతారు. ఆఖరి వార్తాహరుడు వచ్చినప్పుడు చాణక్యుడు విశేషాలేమిటని అడుగుతాడు 'అన్నిదిక్కులలోవలెనే ఈ దిక్కులోకూడా...' అంటూ నీళ్లు నములుతాడతడు. అప్పుడు చాణక్యుడు 'నా బొక్కసం పోయింది. ఫరవాలేదు; సామంతులు యెదురు తిరుగుతున్నారు, భయంలేదు; పరిస్థితులన్ని దిక్కులా విషమిస్తున్నాయి, నష్టంలేదు; నా సర్వస్వం చేజారిపోతున్నది, మించిపోయిందిలేదు; శత్రువులను నాశనం చేయగలిగిన 'బుద్ధి'మాత్రం నాదగ్గరవుంది. అది పోకుండా వున్నంతకాలం యేమీ ఫరవాలేదు' అంటాడు. అన్నట్లుగానే ఆ విషమపరిస్థితుల నధిగమించి విజయాన్ని సాధిస్తాడు. జిగీష ఉన్నవాళ్లని ప్రపంచంలో యే శక్తీ ఓడించలేదు. అది లేనివారికి సాక్షాత్తు భగవంతుడుకూడా విజయాన్ని సాధించిపెట్టలేడు!

మొన్నటి ప్రపంచయుద్ధంలో ఫ్రాన్సు దేశంలోకి జర్మను సైన్యాలు చొచ్చుకుపోతున్న సమయమది. ఫ్రెంచి సైన్యాలన్నీ తిరోగమిస్తున్నాయి. జర్మను సైన్యాలు ఫ్రాన్సు రాజధానికి కేవలం యిరవై మైళ్లదూరాన మాత్రమే వున్నాయి. జర్మనీసేనల ముందు నిలవలేక వెనుకకు తగ్గుతున్న ఫ్రెంచిసైన్యాలు నిలబడి జర్మనులను యెదుర్కొనవలసిందిగా సర్వ

సేనాధిపతి సూచించాడు. జర్మనులను యెదుర్కొంటున్న యిర్వైమంది సేనానులలో ఒక్క మార్షల్ ఫా మాత్రమే నిలబడి జర్మన్లను యెదుర్కోవడానికి సిద్ధపడ్డాడు అప్పుడతను పంపిన సమాధానమిది "నా సేనావాహిని మధ్యభాగం పట్టుసడలి వెనుకకరిగింది. కుడి విభాగం చెదిరి వెనక్కు తగ్గుతోంది. పరిస్థితి క్షేమంగా వుంది. నేను తప్పక జర్మనులను యెదుర్కొంటాను." నిజానికి అప్పుడు జర్మనుల ధాటిని ఆపినదీ కలలోకూడా అనించని విజయాన్ని సాధించిందీ కూడా ఈ మార్షల్ ఫాచే. చివరి ఆ యుద్ధంలో అతను మిత్రమండలి సైన్యాలకు సర్వసైన్యాధ్యక్షుడయాడు. 'మీ విజయానికి కీలకమైన రహస్యమేమి' టని అతనిని ప్రశ్నిస్తే "నేను ఓడించబడకూడదనీ జయంపొందాలనీ ముందు నా మనస్సులో దృఢంగా నిశ్చయించుకున్నాను. అంతే" అన్నాడు. జయించాలి అనే కోరిక మనస్సులో వుంటే ఓటమి అసంభవం. జిగీషవుంటే జయం తథ్యం.

గెలుపుకు ఓటమికి తేడా యెంత అనే విషయం మీద కాకమ్మ కథలతో గాక జీవితంలో జరిగిన ఘట్టాల నుదహరిస్తూ చక్కగా తెలిపినవారికి బహుమతు లిస్తామని ఒక ఆంగ్లపత్రిక ప్రకటించింది. అప్పుడు ఈ క్రింది వాస్తవిక సంఘటనలు రెండూ ప్రకటింపబడ్డాయి.

ఒక ఓడ సముద్ర మధ్యంలో మునిగిపోతుంది. ఒక్క ఐదుగురికి తప్ప మిగతా వారందరికీ ఏవో రక్షణోపకరణాలు దొరికాయి. ఆ పటువడి సముద్రంలో పాపం వారు ఈదుతూ వుంటారు. ఒడ్డు అనేది వారికి వందల మైళ్ళదూరంలో వుంది. చివరకు ఈ జలచరాలకు ఆహారం కావల్సివచ్చిందే అని ఒకడు, ఈ నీటిలో గోరీ ప్రాప్తిస్తున్న దేమి రాత అని ఒకడు దుఃఖిస్తుంటే ఒకడికి భార్యాబిడ్డలు మరొకరికి బ్యాంకులో డబ్బు కళ్ళముందు కనిపించ నారంభించాయి ఈ నలుగురూ కూడా తామిక జీవించే ఆశ లేదని మనస్సులో గట్టి అభిప్రాయానికి వచ్చారు. ఆఖరికి భగవంతుని కూడా నిందించ నారంభించారు ఎప్పుడైతే వాళ్ళ మనస్సులో నే బలహీనత యేర్పడిందో అప్పట్నుంచీ వారు సరిగా యీదనే లేకపోయి మరణించారు. కేవలం ఆ అయిదో వ్యక్తి ఒక్కడే 'నేను చావను. భగవంతుడు నన్ను అనవసరంగా సృష్టించాడంటే నేను నమ్మను. నేను బ్రతికి తీరాలి" అంటూ శక్తినంతా కూడగట్టుకుని ఈదడం ప్రారంభించాడు. దృఢనిశ్చయం లేని నలుగురూ మరణించిన ఐదు నిముషాలకే ఒక విమానం అటు రావడం, దానిలోనివారు ఈ ఈదుతున్న వ్యక్తిని చూచి రక్షించడం జరిగింది! ఓడ మునుగుతున్నప్పుడు కప్తానువైర్ లెస్‌లో చేసిన విజ్ఞప్తివల్ల వచ్చిన విమాన మదని తరువాత అతను తెల్సుకున్నాడు. ఇతను విజయానికీ ఓటమికీగల తేడా కేవలం ఐదు నిముషాలు మాత్రమే నంటాడు.

ఇంకొక సంఘటనలో ఒక అమెరికా కంపెనీ వారు దక్షిణాఫ్రికాలో ఒక బంగారుగనిని త్రవ్వి బంగారాన్నంతా త్రవ్వేశారు. దానిక్రిందకూడా యింకొక గని వుంటుందని శాస్త్రజ్ఞులు చెప్పగా త్రవ్వ నారంభిస్తారు. పదిఅడుగులు త్రవ్వినా బంగారం దొరకలేదు, ఇరవై అడుగులలోతు త్రవ్వినా ఫలితంశూన్యం. ముప్పది అడుగులు త్రవ్వినా దొరికింది మట్టి మాత్రమే. నలభై అడుగులు త్రవ్వినా నిరాశే కల్గింది. నిరాశతోనే యాభై అడుగులు త్రవ్వారు. మనస్సులో నిరాశ పెరగడం మాత్రమే జరిగింది. అయినా అరవై అడుగుల లోతు త్రవ్వారు. లాభంకనపడలేదు. విసుగుతో డెబ్భై అడుగులలోతుదాకా త్రవ్వారు. పూర్తిగా నిరాశ కల్గింది మనస్సులో. మరొక పదిఅడుగులు త్రవ్వి యెనభై అడుగుల లోతుదాకా వెళ్ళినా ఫలితం కనపడనందున ఆ ఖాళీ గనులను వదలి అమెరికాకు వెళ్ళారు. తరువాత వాటిని చవుకగా మరొకరికి అమ్మారు. ఈ వ్యక్తి పట్టుదలగలవాడు. శాస్త్రాలు అబద్ధాలు కాదు గనుక అక్కడ తప్పక బంగారం దొరుకుతుందని విశ్వాసంతో దొరికేదాకా కృషిచేస్తానని దక్షిణాఫ్రికాకు వచ్చాడు. వారు త్రవ్విన చోటునుండి మళ్ళీ త్రవ్వకం ప్రారంభించాడు. కేవలం మూడడుగులు త్రవ్విన వెంటనే అతనికి బంగారం లభించింది! ఆ కాలంలో అది ప్రపంచంలోకల్లా పెద్దగని! గెలుపుకూ ఓటమికీ తేడా కేవలం మూడడుగులే నంటాడా పెద్దమనిషి.

మనం చిన్నప్పుడొక కథ విన్నాం. ఒక ప్రయాణీకుడు తనకు తెలియకుండానే ఒక కల్పవృక్షం క్రింద కూర్చుంటాడు. చల్లని నీరు దొరుకుతే బాగుండు ననుకుంటాడు. అది కల్పవృక్షం గనుక వెంటనే లభిస్తుంది. వాటిని త్రాగి చక్కని ఫలహారాలుంటే బాగుండు ననుకుంటాడు. అవీ లభిస్తాయి. తరువాత విశ్ర

మించడానికి హంసతూలికాతల్పం వుంటే బాగుండు ననుకుంటాడు, అదీ లభిస్తుంది. ఇలా అన్నీ అనుకోగానే లభిస్తుంటే ఆశ్చర్యం అనుమానం కల్గి 'ఇక్కడే మున్నా రాక్షసి వుందేమో' ననుకుంటాడు. రాక్షసి కనిపిస్తుంది. 'ఇది నన్ను మింగదుకదా' అనుకుంటాడు. మ్రింగి వూరుకుంటుంది. అలాగే మనస్సులో మనం దేనినైతే దృఢంగా కోరుకుంటామో అదే జరుగుతుంది. అందుకే యద్భావం తద్భవతి అన్నారు

ఏ విషయంలోనైనా ముందు మనం ఓడింపబడటంగాని గెలిపింపబడటంగాని మన మనస్సుల్లోనే జరుగుతుంది. తరువాతనే అది మనకు జీవితంలో కనపడుతుంది. ఈ విషయాన్ని మనకు చరిత్రకూడా ఋజువుచేస్తుంది.

ఆంగ్ల దేశచరిత్రలో ట్రఫాల్గర్ నౌకాయుద్ధానికెంతో ప్రాధాన్యతవుంది. నెపోలియన్ ఓడింపబడటం ఈ యుద్ధంలోనే. ఈ యుద్ధంలో ఆంగ్లేయుల నౌకలన్నీ దాదాపు దెబ్బతిన్నాయి. వారివద్దనున్న మందుగుండు సామగ్రి అయిపోయింది. మరో అయిదే పదినిమిషాల వరకూ వస్తుందేమో-అంతే. ఎదుటిశత్రువులు కురిపిస్తున్న ఫిరంగిగుండ్లకు అనేకమంది నాశనం కావడం తప్పయింకా యుద్ధంకొనసాగించడంవల్ల ప్రయోజనం కనిపించడంలేదు ఓటమి యెలాగూ తప్పదు కనుక కొంతమంది ప్రాణాలనైనా రక్షిద్దామనుకున్నాడు సైన్యాధ్యక్షుడు. ముందున్న నౌక అధికారికి తాము లొంగిపోయినట్లుగా తెల్లజండా ఎత్తమని కూడా ఆజ్ఞాపించాడు. ముందున్న ఓడకు అధికారి నెల్సన్. అతనుమాత్రం తెల్లజండా యెత్తలేదు! అతనికి మనస్సులో ఓటమి అంటే యేమిటో తెలియక పోవడమే యిందుకు కారణం. ఏమైనాసరే తాను లొంగిపోగూడదని అతను మనస్సులో నిశ్చయించుకున్నాడు గనుక చావుకు తెగించి చివరదాకా పోరాడాలని అనుకున్నాడు. సైన్యాధ్యక్షుని మనస్సులోనే ముందు ఓటమి తప్పదనే భావంవల్ల ఆయన తెల్లజండా యెత్తమన్నాడు. విచిత్రంగా కొద్ది నిముషాల్లో ఆంగ్లేయుల శత్రువులే లొంగిపోయినట్లు తెల్లజండా యెత్తారు. అక్కడివారి పరిస్థితీ యిక్కడి ఆంగ్లేయుల మాదిరిగానే వుంది. ఆంగ్లేయుల బలం యెంతో వారికి తెలియదు. నెల్సన్ మాదిరిగా ఓడగూడదనీ, జయించి తీరాలనీ దృఢ మనోనిశ్చయంగల నాయకుడొక్కడూ లేనందువల్లనే వారు ఓడిపోయారు.

మనదేశచరిత్రలో కూడా యిలాంటి ఉదాహరణలనేకం కనపడతాయి. శివాజీ మరణానంతరం రెండున్నర లక్షల సైన్యంతో శ్రీనగర్ నుండి రామేశ్వరం వరకూ వ్యాపించివున్న మొఘల్ సామ్రాజ్య సమ్రాట్ ఔరంగజేబ్ మహారాష్ట్రుల హిందూపదపాద్ షాహీపై దండెత్తాడు. ఆనాడు వారికి నాయకుడు లేడు, ధనం లేదు. పెద్దరాజ్యంలేదు. సుశిక్షితమైన సేనలు లేవు. బాలుడైన రాజుకు బదులు రాజమాత తారాబాయి ఔరంగజేబ్ నెదుర్కొంది. పదునెన్మిది సంవత్సరాలు పోరాటం సల్పినా ఔరంగజేబ్ వారిని ఓడించలేకపోయాడు. చివరకు తానే అక్కడ మరణించాడు. హిందువులు యేమీ లేకపోయినా గెలుపొందడానికీ, అన్నీ వున్న ఔరంగజేబ్ ఓడింపబడడానికీ కారణం వారు హిందువులలో వున్న జిగీషే. స్వాతంత్ర్య భారతదేశాన్ని సాధిద్దామనే దృఢమైన నిశ్చయమే. 'మనం ఓడింపబడకూడదు. జయించి తీరాలి' అని వారి మనస్సులో గట్టిగా భావించడంవల్లనే వారు జయించారు.

జిగీష అనేది లేకపోతే లభిస్తున్న విజయాలు కూడా చేయిజారిపోతాయి. ఫతేపూర్ సిక్రీ యుద్ధంలో మొగల్ వంశస్థాపకుడైన బాబర్ ను రాణాసంగా ఎదిరిస్తాడు. బాబర్ ఓడింపబడి వెనుకకు తిరిగి పారిపోదామనుకుంటున్న సమయంలో రాణాసంగా దెబ్బతగిలిన యేనుగును దిగివేరే గుఱ్ఱం ఎక్కుదామనుకుంటాడు. ఏనుగుపై రాణా కనపడక హిందూ సేనల మనస్సులో సంశయం కల్గుతుంది. సంశయాత్మా వినశ్యతి. నైతికంగా దెబ్బతిన్న హిందూసేనలు కొద్దిక్షణాల్లో తాము పొందబోతున్న విజయాన్ని చేతులారా బాబర్ కిచ్చారు! తళ్ళికోట యుద్ధరంగంలో ఇదేకథ. పానిపట్టు యుద్ధంలో కథ వేరుకాదు. మన దేశచరిత్రలో జిగీష లేనందువల్ల మనం నోటిదాకా వచ్చిన విజయాలనెలా అనుభవించలేకపోయామో తెలిపే సంఘటనలు కొల్లలుగా కనిపిస్తాయి.

శూన్యంనుండి ప్రపంచంవచ్చిందంటారు శాస్త్రవేత్తలు. అలాగే కేవలం శూన్యంనుండే ఛత్రపతి శివాజీ రాజ్యాన్ని స్థాపించగల్గుతాడు. ఆయన అను

వీరులు సుసంఘటితులు కాని కొండజాతి మావళీలు, చుట్టూ బలవత్తర విరోధి రాజ్యాలు, స్వతంత్రంగా 'నాది' అని చెప్పుకోతగ్గ ఒక్క అంగుళం భూమి లేదు; ఆధునిక ఆయుధాలు లేవు. అయినా 'హిందూ స్వరాజ్యా'న్ని శివాజీ సాధించాడు. 'స్వధర్మ రక్షణ, స్వరాజ్యస్థాపన' అన్న ఆయన దృఢ నిశ్చయంవల్లనే, జిగీషవల్లనే షయిస్తఖాన్, సిద్ది జయసింగ్ లవంటి విరోధి వీరులనుకూడా ఆయన ఓడించగల్గాడు.

హిందూ దేశానికి మొట్టమొదటవచ్చి రాజ్య స్థాపనచేసిన విదేశీయులు మహమ్మదీయులు. వారిలో రాజనీతి ధురంధరుడు అక్బర్ చక్రవర్తి. ఒక్క మేవాడ్‌ను మినహా ఆయన సమస్త ఉత్తర భారతాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడు. మేవాడ్ రాణా రాణాప్రతాప్‌మాత్రం అక్బర్ నయానగాని భయానగాని లొంగదీసుకోలేకపోయాడు. అష్ట కష్టాలు పడ్డా రాణా ప్రతాప్ తన స్వతంత్ర ఉద్యమాన్ని వదలలేదు. ఆయన మనస్సుకు ఓటమి లేదు. ఆయన సత్వగుణానికి ప్రతినిధిలా ప్రవర్తించాడు. సర్వస్వం కోల్పోయినా చలించక మరణ సమయానికి ఒక్క చిత్తూరు దుర్గాన్ని మినహా మిగతా మేవాడ్ అంతా ఆయన తిరిగి జయించగల్గాడు. అడవులు గాని అంతఃపురాలు గాని ఆయన మనస్సులో ఏలాటి మార్పునూ తేలేకపోయాయి.

అందుకే ఆంగ్ల కవి మిల్టన్ 'మనస్సు స్వర్గాన్ని నరకంగాను, నరకాన్ని స్వర్గంగాను' మార్చగల దన్నాడు. మనస్సులో జిగీషవున్న జాతిని ఏవరూ త్రొక్కిపెట్టలేరు. అదిలేని జాతిని ఉద్ధరించడంకూడా కష్టం. జర్మనీని జపానును ఎంత నొక్కిపెట్టినా అవి పైకి వస్తూనే వుండడానికి కారణమదే. యుద్ధంలో మనకన్న ఎంతగానో దెబ్బతిన్న ఈ దేశాలు కోలుకొనడమే గాక మనకీనాడు అప్పుకూడా యివ్వగల్గుతున్నాయి!

మనస్సులో ముందు ఓడింపబడ్డవ్యక్తి తరువాత కార్యసిద్ధి పొందడం అసంభవం అనే విషయాన్ని అఫ్‌జల్ ఖాన్ చరిత్ర ఋజువు చేస్తుంది. శివాజీని యేమైనాసరే పట్టి తెస్తానని ప్రతిజ్ఞ చేసి బయల్దేరిన బీజపూర్ సేనాని యితను. ప్రతిజ్ఞనైతే చేశాడేగాని అతని మనస్సులోనూ, హృదయాంతరాళాల్లోను తాను ఓడిపోతానేమో ననే అనుమానం వుంది. అందుకే అతను దండయాత్రకు పూర్వం జీవితాన్ని వీలున్నంత ఖుషీగా గడిపాడు. తను తిరిగి రాకపోతే మరొకరి వశమైపోతారేమో నని తన ఇరవై మంది భార్యలను, ఉంపుడు కత్తెలను చంపి బయలుదేరుతాడు. ఇదంతా ఖాను హృదయంలోను మనస్సులోను గల్గిన ఓటమి భావననే వ్యక్తంచేస్తుంది. కాని శివాజీ యేమైనా సరే జయించి తీరాలన్న జిగీష కల వ్యక్తి. అతని ప్రవర్తన ఏలా వుందో చూడండి. తన కొద్దిపాటి సేనతో మైదానంలో ఖానుయొక్క అశేష సేనావాహినులతో తలపడితే శివాజీకి జయం దుర్లభమని తెలుసు. అందువల్ల ఖానును దుర్గమపర్వత ప్రాంతాల్లోకి వచ్చేటట్లు చేయాలి. దీనికోసం అతను తనువున్న దుర్గాన్ని వదలి బయటకురాలేదు. శివాజీని బయటకు లాగాలని ఖాన్ శివాజీకి గోబ్రాహ్మణ రక్షకుడనే బిరుదు వుంది గనుక గోవులను బ్రాహ్మణులను వధించ నారంభించాడు. అయినా శివాజీ బయటకు రాలేదు. పంటపొలాలను శివాజీ కోశాగారాలను, ఖాన్ తగలబెట్ట నారంభించాడు. హిందూమత రక్షకుడు శివాజీ. కనుక, హిందూ దేవాలయాల విధ్వంసనకు పూనుకున్నాడు. అయినా శివాజీ బయటకు రాలేదు. జనతా జనార్దనః అని శివాజీ విశ్వాసం, అందువల్ల శివాజీ రాజ్యంలోని జనులపై అత్యాచారాలెన్నిటినో చేయ నారంభించాడు. శివాజీ చలించలేదు. ఆఖరికి శివాజీకి అత్యంత ప్రియమైన కులదేవత భవానీ ఆలయాన్ని కూడా నాశనం చేశాడు. అయినా శివాజీ బయటకు రాలేదు. తోటి హిందువులే శివాజీని నిందించి దుర్భాషలాడ నారంభించారు. శివాజీ పిరికి వాడనుకుని ఖాన్ విజయోన్మాద గర్వంతో కళ్ళుమూసుకుపోయి చివరకు కొండప్రాంతాల్లోకి రా సాహసించాడు. ఇంత వరకు వేచివున్న శివాజీ, ఖాను ఆహ్వానాన్నందుకుని ఏకాంతంగా మాట్లాడడానికి అంగీకరించాడు. అక్కడ ఖాన్ తనని చంపడానికి ప్రయత్నాలు చేస్తున్నాడని ఖాను పంపిన ఒక దూతవల్ల తెలుసుకుని కూడా తాను లొంగడానికి కూడా సిద్ధమే నన్న ఆశనుకూడా ఖానులో కల్గించి ద్వంద్వయుద్ధానికి సిద్ధపడ్డాడు. చివరకు తల్లికి మ్రొక్కి తన అన్నను చంపిన కుటుంబ శత్రువు, హిందూ సామ్రాజ్య విరోధి, ధర్మద్రోహి యైన అఫ్‌జల్‌ఖాన్‌పై విజయాన్ని సాధించడాని కవసరమైన యేర్పాట్లన్నీ చేసుకువెళ్లాడు. అందు

వల్లనే ఆజానుబాహువైన అఫ్జల్ ఖాన్ ధృతరాష్ట్ర కౌగిలిలోకి స్వయంగా వెళ్ళినా, పోట్లాడినా, శివాజీ జయించగల్గాడు. అఫ్జల్ ఖాన్ ప్రత్యక్షంగా యిప్పుడు ఓడించబడ్డా అసలు బయలుదేరకముందే అతని మనస్సులోనే మొదట్లో ఓడించబడ్డాడనే విషయాన్ని కాదనగలమా?

మనస్సుల్లోని ఆకాంక్షలే 'జిగీష'తో కూడి వుంటే, సత్వం అనేది ఆ ఆకాంక్షలకు తోడైతే ఆ ఆకాంక్షలు ప్రత్యక్షరూపంలో బాహ్యపరిస్థితుల్లోనూ కనిపిస్తాయి. అందుకనే రాజకీయంగా యుద్ధరంగపు విజయాలకన్న ప్రజల మేధమీదా, హృదయాలమీదా విజయం కోరుతారు మనవారెప్పుడూ. ఇదే నిజమైన విజయంగా భావిస్తారు. ప్రజల మనస్సును జయిస్తే అతివిచిత్రమైనవి కూడా సాధించవచ్చు.

కేవలం రెండు వందల సంవత్సరాలకు పూర్వం మన సేనలు సింధూల్లంఘనం జరిపి అఫ్ఘనిస్తాన్ పొలిమేరల్లో విడిశాయి. అప్పుడు అహమ్మద్ షా అబ్దాలీ ఆ దేశపు రాజు. అతని మేనల్లుడు తనని అఫ్ఘనిస్తాన్ కు రాజునుగా చేస్తే హిందువులకు సామంతరాజుగా వుంటానన్నాడు! ఇరాన్ దేశపు రాయబారి మనవద్దకు వచ్చి అఫ్ఘనిస్తాన్ పైకి తాముకూడా మనతో కలిసి దండయాత్రకు వస్తామనీ ఆ దేశాన్ని భారత ఇరాన్ దేశాలు పంచుకుందామనీ అడిగాడు! అప్పుడు మనం ఇరాన్ రాజ రాయబారాన్ని త్రోసివేశాం. 'అఫ్ఘనిస్తాన్ మా పూర్వపు గాంధారం దానిని పంచుకోం. అలా పంచుకుంటే కుంభా (కాబూల్ నది) నది మీకు వస్తుంది. మా శాస్త్రాల ప్రకారం హిందూ రాజుల పట్టాభిషేకానికి మా బర్మాలోని ఐరావతీ నదీ జలాలకువలెనే 'కుంభా'జలాలు కూడా అవసరం. కాబట్టి అఫ్ఘనిస్తాన్ విభజన కంగీకరించం' అన్నారు ఆనాడు మనవారు. కాని రెండు వందల సంవత్సరాల తరువాత మన పరిస్థితి చూద్దాం— మనమే బర్మాను విడతీయాలని తీర్మానాలు చేశాం. అంతేకాదు దేశాన్ని సైతం మూడు ముక్కలుగా విభజించాం. రెండువందలయేళ్ళ క్రితానికీ ఈనాటికీ యెంత తేడా!

ఈ మార్పుకు మన మనస్సుల్లో వచ్చిన మార్పే ప్రధాన కారణం కాదనగలమా? ఆనాడు మన దేశంలో సామాన్యుల మనస్సుల్లో సైతం 'జిగీష' వుంది. అదెలాటిదో గూడా ఈనాడు మన ప్రముఖులకే తెలియదు. ఈనాడు దేశంలోని సమస్యలన్నిటినీ విజయవంతంగా పరిష్కరించలేకపోవడానికి మూల కారణమిదే. మళ్ళీ దేశంలో ఈ సత్వాన్ని సాధించగలిగితే మన ఆకాంక్షలకు, ఆశాదర్శాలకు జిగీషను తోడు చేసుకలిగితే ఒక్క ఆసియాలోనే గాకుండా ఖండఖండాంతరాల్లోగూడా మన సంస్కృతీ సామ్రాజ్యాన్ని స్థాపించగల్గుతాం. మళ్ళీ బర్మా థాయిలాండ్, ఇండోచైనా, ఇండోనీషియా, మలయా, జపాన్ చైనాల్లోనేగాక యిటు మధ్య ప్రాచ్యంలోను అటు ఆఫ్రికా యూరోపా అమెరికా ఖండాల్లోగూడా మన భావాలను ప్రసరింపచేసి మానవాళి నావరించిన తమస్సును పారద్రోలగల్గుతాం. భౌతికవాదాలతో కొట్టుమిట్టాడుతున్న ప్రపంచానికి మన ఆధ్యాత్మిక సందేశాన్నివ్వడంద్వారా శాంతిస్థాపనకు తోడ్పడగల్గుతాం. మనం ప్రపంచాన్ని ఆధ్యాత్మికరంగంలో జయించకపోతే ప్రపంచంలో భౌతిక వాదావలంబులైన ఈ రాజ్యాలమధ్య సంఘర్షణలకు స్వస్తి అంటూవుండదు. అందువల్ల మనం జయించాలి. దీనికి జిగీష అవసరం.

"భూభాగ్ నహీఁ శత శత మానవహృదయ జీత్ నే కా దృఢనిశ్చయ" ఇది ఈనాడవసరం. భూభాగాలను గాక శత శత మానవ హృదయాలను జయించాలనే దృఢనిశ్చయంతో శక్తితో కృషి ప్రారంభిస్తే పూర్వం మనువులె

'ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం
సర్వమానవాః'

అని మళ్ళీ మనం ప్రపంచాన్నాహ్వానించవచ్చు. ఈ విశ్వమానవ హృదయ విజయాకాంక్షతోపాటు జిగీషవుంటేనే "కృణ్వంతో విశ్వమార్యం" అన్న ఆదర్శాన్ని చేరగల్గుతాం.

# కలకత్తానగరము

శ్రీ సుధీన్‌దత్త

* గతసంచిక తరువాయి

VI

పాలకవర్గాలకు వంగరాష్ట్రపునరేకీకరణ తలగొట్టినట్లయింది. వారు రాజధానిని, కలకత్తానుంచి ఢిల్లీకి మార్చారు—తమ అక్కసును వెళ్లగక్కటానికి. వారి వుద్దేశ మేదైనా ఆచర్యను వంగీయులు అలా అర్థం చేసుకున్నారు. ఉత్తరాదివాళ్లు ఆచర్యను హర్షించుతున్నారని జరిగే ప్రచారం కేవలం అబద్ధమనీ, 'విభజించి పాలించాలి' అనే సూత్రానికి అనుగుణంగా లేవదీయబడ్డ ప్రచారమనీ ఆరోపించారు. కాని ఈ వంగీయులకు వెంటనే మరో సంతృప్తి కలిగింది. ఢిల్లీ సింహాసనం ఎవరెక్కినా అది ఎక్కువకాలం నిలవాక మయే రాజ్యంగాదనే పాతసామెత వాళ్లకు జ్ఞాపకంవచ్చింది. కొలదికాలంగా జరుగుతూవచ్చిన సంఘటనలన్నీ నిజంగా అందుకు నిదర్శనంగానే వున్నాయి. కాని అనతికాలంలో బ్రిటిష్ పరిపాలన అంతమైపోతుందని, దేశభక్తుల వెర్రికేకలగా వున్నదేగాని ఆనాడు ఎవరూ విశ్వసించిన విషయం గాదు. ఇక పాకిస్థాన్ అనే అభూతభూతం, ఎంతటి నిరాశావాదికూడా ఆనాడు ఊహించగలిగింది గాదు. ఏదియేమైనాకలకత్తా ప్రశాంతత భగ్నమైపోయింది. ప్రధాన వాణిజ్యకేంద్రంగానూ ఆసియాలో ప్రధాన నౌకాకేంద్రంగానూ కలకత్తా నగరం దినదినాభివృద్ధి నందుతూ వచ్చినా, పునరేకీకరణలో ఏర్పడిన సరిహద్దులు కారణంగా, దానివల్ల ప్రయోజనం పొందుతుండే ప్రాంతం పరిమితమైపోయింది.

నిజానికి పాతరాష్ట్రం, పరిపాలనా సౌకర్యాల దృష్ట్యా, తలకుమించిన వైశాల్యంగా వుండేది. ఇప్పుడు మనవాళ్ళు చెబుతున్న సాంస్కృతిక సమైక్యతా సిద్ధాంతాన్ని అంగీకరించితే, ఇతర మాతృభాషలు కలవారికి అన్యాయం జరగడానికి అవకాశం లేకుండా కొన్నిప్రాంతాలను కత్తిరించితే, దానికి ఆక్షేపణ ఏమీ వుండనవసరంలేదు. కాని మావంగీయులు అలా భావించలేదు. హిందువులనూ మహమ్మదీయులనూ సముజ్జీలుగా తయారుచేసి విద్వేషాలు రెచ్చగొట్టటానికి వంగరాష్ట్రంనుంచి పెద్దపెద్ద భాగాలను కత్తిరించి వేస్తున్నారని ఆలోచించారు. నిజానికి వాళ్లు ఊహించినట్లే జరిగింది. క్రమేణా ఈ రెండువర్గాలమధ్య విద్వేషాలు రేగినై. మొదటి ప్రపంచయుద్ధం నాటినుంచీ కలకత్తానగరం మతకలహాలకు తావలమైంది. 1946 నాటికి యివి ఆరనిజ్వాలలైనాయి. చరిత్ర తీవ్రరూపం ధరించింది. బ్రిటిష్‌శాంతిదేవత (Pax Britanica) దాఆధారంమీద నిర్మింపబడినట్లు చెప్పబడుతున్న సామ్రాజ్యం, ఏ నగరంలో తొలుత ఆవిర్భవించిందో, ఆ నగరంలోనే చివరకు అల్లరిపాలై అణగారిపోయింది. దాంతో, బ్రిటిష్ సామ్రాజ్యం సాధించిన మహత్కార్యంగా చెప్పబడుతున్న, భారత సమైక్యత ఛిన్నాభిన్నమైపోయింది.

మరోక సంవత్సరానికి లాంఛనప్రాయమైన స్వాతంత్ర్యం లభించింది. వెనువెంటనే పంజాబులో జరిగిన దారుణ సంఘటనలు, కలకత్తా హత్యాకాండలను తలదన్నినై. నేను అప్పుడు అక్కడే ఒకపత్రికలో పనిచేస్తున్నాను. ఆపత్రిక, తప్పనిసరి అయి స్థానిక హత్యాకాండను అలా ముక్తసరిగా చెప్పి వూరుకుంది. ఏదియేమైనా, మా ప్రాంతంలో జరిగిన హత్యావిలాసం, భారత దేశచరిత్రలో మహత్తరమైన ప్రప్రథమ సంఘటన గనుక ఆగౌరవం మాకేదక్కవలసివుంది. పది వేల మంది మారణహోమ మయ్యారంటే మరి స్వల్పసంఖ్య కాదుగదా! ఎండవానలకు లోనై కుళ్ళుతూ శవాలు మూడురోజులపాటు ఆ మహానగర వీధుల్లో అలానే పడి వున్నై. ఒక్కొక్కటి నల్లగా, కిలంగా మారిపోయి, ఈలావున వుబ్బి, కుక్కలు, నక్కలూ, రాబందులూ కూడా దగ్గరకు రావటానికి వీలులేకుండా చెడుగొలు

కొట్టుకుపోయినై. నదిలోకి తోసిన శవాలు కొన్ని నది మలుపులో ఒకచోట కూడబడ్డాయి. ప్రక్కనున్న యింటి కిటికీలోనుంచి వాటివంక చూచిన ఒకబాలికకు మతిచెడిపోయింది. మతులుపోకుండా వున్నవాళ్ళు తలుపులు మూసుకుని గోళ్లాలు పెట్టుకున్నారు. అదినంగా వారు సూర్యతేజాన్ని చూచేఅవకాశాన్ని కోల్పోయినా రాత్రివేళ చుట్టూరా మండిపోతున్న కొంపలు కిటికీలలోనుంచి కనుపించుతూనే వుండేవి. కుళ్లుశవాల దుర్గంధాన్నుంచి తప్పించుకునే అవకాశం ఏ ఒక్కరికీ లేదు.

VII

హఠాత్తుగా మృత్యువు పెనుగోల్పటం అక్కనాక్కరుగా చావటం ఇది కలకత్తా ప్రజలకు కొత్తగాదు. పూర్వంనుంచీ వస్తూన్న కొట్లాటలు హత్యలూ అటుంచి, అరక్షితమైన ఆ నగరంమీద పట్టపగలే దాడిచేసి జపాను విమానాలు రేవు కార్మికులను వెయ్యి మందిని చంపేసినాయి. 1943 నాటి క్షామం జగద్విఖ్యాతమైన విషయంకదా! రోజుకు రెండు వేల మంది చొప్పున చచ్చారు. ఇక 1946 నాటి హత్యాకాండకు, దాక్ష్యతారాహిత్యం, చేతగానితనం మొదలైనవాటిలో ఏది కారణమో మనం ఊహించలేము. దరహాంమీద జనబాహుళ్యాన్ని అలా హత్య చేయటానికి పూనుకున్న ఆ గుండాల సంఖ్య ఎంతో అంచనాకు అందదు. వాళ్లు ఒక కులానికీ ఒక వర్గానికీ చెందినవాళ్లని చెప్పటానికి వీల్లేదు. ఆ కల్లోల దినాల్లో ఒక ఆంగ్లేయ మిత్రుని సహాయంతో, నేను మా అమ్మగారిని చూడ్డానికి మా యింటికి వెళ్లాను. అక్కడ చూచిన దృశ్యం నన్ను కలవరపరచింది.

మా యింటిప్రక్క, ఒక బ్రిటిష్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడైవచ్చిన, ఒక పెద్దమనిషి వున్నారు. ఆయన చుట్టూవున్న వాళ్లను రెచ్చగొట్టి, వీధిలో చిల్లరసామానులు అమ్ముకునే మహమ్మదీయులను 12 మందిని హత్య చేయించాడట. కుళ్లివాసన గొడుతున్న ఆ శవాలమీదుగా దాటి నేను మాయింట్లో అడుగుపెట్టవలసివచ్చింది. నేను అప్పట్లో, 'నా జాతీయులు హింసాపరాఙ్ముఖులు' అని నిరూపించుతూ

ఒక గ్రంథం రచించి యిస్తానని ఒక కంపెనీతో ఏర్పాటు చేసుకున్నాను. మా అమ్మగారిదగ్గరనుంచి తిరిగి నా మకాముకు వచ్చినవెంటనే ఆ వ్రాతప్రతిని ముక్కలుముక్కలుగా చింపి అవతల పారవేశాను. ఈ హత్యాకాండ నడుమ, తిరిగి ప్రశాంతి యేర్పడటానికి, పూర్తిగా సంవత్సరం పట్టింది. తిరువాత దినాల్లో కొంత ప్రశాంతత యేర్పడటానికి బ్రిటిష్ నిష్క్రమణ, పాకిస్థాన్ ఏర్పాటు ఇవన్నీ కారణాలక్రింద చెప్పుకోవటానికి ఆస్కారమున్నా, ఈ మహాద్భుత కార్యాన్ని సాధించిన లోకోత్తరపురుషుడు 'గాంధిజీ'. మహాత్ముడు బ్రిటిష్ నిష్క్రమణను సాధించాడు. పాకిస్తాన్ ఏర్పాటును అభేద దృష్టితో చూచాడు. ప్రత్యక్ష విరోధమునకు పూనుకుని మతకలహాలను రూపుమాపాడు. భారత విభజనను అరికట్టడం తనకు వశం కాదప్పుడు, కలకత్తా హింసాకాండల వెనువెంటనే తూర్పు పాకిస్తానులో కల్లోలాలు చెలరేగగా, తాను అక్కడికి వెళ్ళి మానవుల తరఫుని మకాం వేశాడు. కాని ఆయన తిరిగివచ్చే సమయానికి తిరిగి కలకత్తాలో కల్లోలాలు చెలరేగాయి. అప్పుడు కలకత్తాలో కొన్నిరోజులపాటు ఒక ముస్లిం నాయకునకు అతిథిగా వుండి ఆ జ్వాలలను తిరిగి చల్లార్చాడు.

ప్రారంభంలో ఆయన కార్యక్రమం ఏమంత ఉత్సాహజనకంగా లేదు. ఆదిలో ఆ ప్రార్థన సభావేశాలకు వచ్చినవారంతా ఆయన్ను వేళాకోళం చేయటానికి వచ్చినవాళ్ళే. ఉన్నటుండి ఒక విచిత్రం జరిగింది. ఉద్రేకపూరితమైన మూక, సుహ్రావర్దీని ఒప్పజెప్పమని కేకలు వేస్తూ గాంధిజీ మకామును చుట్టివేశారు. అది చరిత్రాత్మకమైన సంఘటన. సుహ్రావర్దీకి మారుగా తన్ను వధించమని గాంధిజీ ముందుకు వచ్చారు. అనంతరం తానుకూడా బయటికివచ్చి గాంధిజీ ప్రక్కను నిలబడి పనిచేసినందుకు సుహ్రావర్దీ సాహసౌదార్యాలు కొనియాడదగినవన్న మాట నిజమే అయినా, అప్పటికే గాంధిజీ విజయాన్ని చేపట్టి కూర్చున్నాడు. ఆ విధంగా కొలది దినాలకే, స్వాతంత్ర్యోత్సవం నాటిరాత్రి, యేడాదిక్రితం శవాలతో నిండిపోయిన ఆ వీధులే ఉత్సవ కోలాహలంతో మహో సందడిభరితము లయినాయి. హిందువులూ మహమ్మదీయులూ తమంత తాముగా ఒండొరులను కౌగిలించుకొని భ్రాతృవాత్సల్యాన్ని ప్రదర్శించారు. తొలినాటి హత్యా సంఘటనలు ఎలా మరువరానివో, ఆనాటి దృశ్యాలుకూడా అలా మరువరానివి.

## VIII

గాంధిజీ రాజకీయగురువు గోఖలేగారు, అంటూ వుండేవారు! "వంగదేశం యీనాడు ఒక విషయాన్ని అవగతం చేసుకుంటే, మిగతా భారత దేశానికి అది రేపటికిగాని బోధపడదు" అని. కాని అది సామ్రాజ్యానికి కలకత్తా రాజధానిగా వున్ననాటి పరిస్థితి. కేంద్రాధికారం, కలకత్తానుంచి, ఢిల్లీకి మారగానే, తన ప్రతిభాసంపన్నులను, ఇతరులను గుర్తించటం లేకనే అక్కసు పెంచుకుని వంగీయులు పూర్తిగా అంతర్ముఖులైపోయారు-కలకత్తా ప్రాచీన నాయకుల— సురేంద్రనాథ్ బెనర్జీ, చిత్తరంజన్ దాస్ మొదలైన వారి—భూతములు మెలకువగా వుండగానే అతని మానసపథాన్ని కల్లోలపరచ ప్రారంభించినాయి. జాతీయ మహానాయకులుగా వారు చూపిన కార్యదక్షతను చూపలేక పోయినా, బ్రిటిష్ దినాలనాడు పెంపొందింపబడ్డ 'శాశ్వత ప్రతిపక్ష' మనస్తత్వాన్ని వదులుకోలేకపోతున్నారు. అందుచేత, దానికి ఒక లక్ష్యమున్నా లేకపోయినా, ఏ అల్లరిమూకలు కోరితే దాంట్లో చేరిపోతారు. లక్ష్యశుద్ధిలేని కార్యక్రమాలు సహజంగా గాలిలో హరించిపోతాయి గనుక ఆ అపజయాలన్నిటిని నెత్తికెత్తుకుంటున్నారు. ఈ ఆవేశ మనస్తత్వాలు అవగతం చేసుకున్న అధికారులు, ఏవో, ఒకటో రెండో ట్రాము కార్లను తగలబెట్టి వేయటానికి అక్కడ వదిలేస్తే దాంతో ఆ ఆవేశం చల్లారిపోతూ వుంటుంది. ఏది యేమైనా వంగీయుల సామూహిక జీవితానికి సుముఖుడు కాదు. 18 శతాబ్ది అంతంలోనూ 19 వ శతాబ్ది ప్రారంభంలోనూ, ఒకళ్ళ కొకళ్ళకి పొంతన లేకుండా ఎలా వుండేదో 1946 లో కూడా అలాగేవుంది స్వాతంత్ర్య లబ్ధినాటికే పాతకుటుంబాలన్నీ అంతరించి పోయినై. ప్లీడరీ, డాక్టరీ మొదలైన వృత్తుల్లో డబ్బు గడించినవారు కట్టిన భవంతులన్నీ శిథిలదశకు వచ్చేసినై అయినా ఈ కొత్తతరం దీనప్రజ కూడా, తమ ఆచారాలకు అంటిపెట్టుకుని వుండటంలో తమ తాత ముత్తాతలకు తీసిపోయినవారు కారు. ఫుట్‌బాల్ పందాలలోనూ, కుస్తీపందాలలోనూ తమ యిష్ట

మెచ్చిన పక్షాన్ని అభినందించి కొట్టుకోవటానికి సంఘాలు కట్టటం తప్ప మిగతా అప్పుడు ఇక సామాజిక జీవిత మంటూ లేదు. చిన్న చిన్న కూటాలుగా విడిపోయి, తమ యిళ్ళ పాకలలో కొంచెం విశాలమైన యిల్లు దొరికితే ప్రతి సాయంత్రమూ దాంట్లో చేరి బాతాఖానీ వేస్తారు. పంచదారా, పాలు మితిమీరిపోసిన టీ, కప్పుల తరబడి ఖాళీచేస్తూ వుంటారు. ఊపిరాడకుండా గంటల తరబడి అలా బాతాఖానీ వేస్తారు. ఆ సంభాషణలలో ఊళ్ళోవున్న ఆడా మగా అందరిమీదా ఏదో అభాండా లేస్తూ యిష్టం వచ్చిన ప్రలాపా లన్నీ చేస్తారు.

ఇంకా కొంచెం వాక్ప్రవృత్తి కలవాళ్లు క్లబ్బులో చేరతారు. పానకం టీకి బదులు విస్కీ వాడతారు. ఒకోసారి భోగంవాళ్లను పిలిపించి డాన్సులు ఏర్పాటు చేస్తారు. లేకపోతే ఆత్మస్తుతీ పరనిందా ప్రధానవిషయంగా సంభాషణలు సాగిపోతూ వుంటాయి. మనకి ఓపికవుండి ఇల్లాంటి కూటములను కొన్నిటిని పరిశీలించితే ఒక విషయం తెలుస్తుంది. ఒక కూటమి ఒక ప్రత్యేక ముఠా—ఒక కూటమిలోని వాళ్ళను తిడుతూవుంటారు. ఈ ముఠా తత్వం కలకత్తాలో వున్నంత, మరెక్కడా లేదు. చిన్న స్కూలు కమిటీగానివ్వండి, కాలేజి కమిటీ గానివ్వండి, బాంకు డైరక్టర్లు గానివ్వండి సాహిత్య పరిషత్తు గానివ్వండి, చిట్టుబంపెల, యే కళాపరిషత్తయినా గానివ్వండి అందులో ముఠాలు లేకుండా వుండటానికి వీల్లేదు. టాగూరు జీవితంలోని చివరి పదిహేను సంవత్సరాలూ మినహాయించితే, వంగసాహిత్య రంగంలో తిట్టే కూటమి ఒకటీ, దీవించే కూటమి ఒకటి లేని రచయిత యెవ్వడూ లేడు.

## IX

ఇంతా ఒకందుకు మంచిదే. మనుష్యుల్లో వ్యక్తిత్వం పెరగటానికి ఆస్కార మంటుంది. పరిసరాలలో వున్న విషయాలమీద మోజుపోయినప్పుడు దూర ప్రాంతాలయందలి విషయాలను అభినందించే ఉల్లాస మేర్పడుతుంది. విదేశగ్రంథాలను చదివటంలో, కలకత్తావాడికంటే బొంబాయివాడు ఎక్కువ గ్రంథాలు చదవవచ్చు. కాని బొంబాయి వాడికంటె, కలకత్తా వాడు చాలా పరిశీలనగా చదువుతాడు. తన సాహిత్యాన్ని గురించి మాట్లాడవలసివచ్చినప్పుడు కూడా, శబ్దప్రయోగాలనుగురించీ సాంకేతిక ప్రయోగాలను గురించీ మాట్లాడుతాడే తప్ప, 'కథా వస్తువు' దృష్టితక్కువ. హిందీ రచయితలు అలాకాదు. ఒండొరుల రచనలు పరామర్శించుకునే టప్పుడు శిల్పానికంటే, విషయానికి యెక్కువ ప్రాధాన్యత నిచ్చి మాట్లాడుతారు. ఏది ఏమైనా వంగీయులకు తన తాతముత్తాతలనుంచి ఒక్కటిమాత్రం సంక్రమించి తీరింది. వాదోపవాదాలంటే తగని మోజు. కొంత మీమాంస, కొంత ఘర్షణవుంటేగాని తృప్తిగావుండదు. సోవియెట్ విప్లవ ప్రారంభదినాల్లో అక్కడ వుండి వచ్చిన నా మిత్రుడొకడు మా కలకత్తా మాచి వాతో పదే పదే అంటూ వుండేవాడు! 'రష్యనులకు వంగీయులకూ తేడా లేదు' అని. ఇలాగే ఒక ఫ్రెంచియువతి, 'ఈనగరం పారిస్ నగరాన్ని తలపింపజేస్తుంది' అని పదే పదే అంటూ వుండేది. బాగా అన్నీ ఆలోచించగల ఒక అమెరికన్ పెద్దమనిషి 'కలకత్తాలో అడుగు పెట్టిన తరువాత, నేను భారతదేశంలోవున్నాననే అనుభూతి కలిగింది' అన్నారు.

ఈ పోలికలలో నిజమేమైనా వుంటే, అది నగర ప్రదేశాన్ని బట్టీ, శిల్పప్రాభవాన్ని బట్టీ వాతావరణాన్ని బట్టీ ఏర్పడినవి కావు. నిజానికి వాషింగ్టన్ వాతావరణంకంటే ఇక్కడి వాతావరణం ఏమంత అధ్వాన్నమయినది కాదు. అసలైన 'కలకత్తా వాతావరణం' అనుభూతికి రావాలంటే కంటికి బాధగా వుండే విషయాలను ముందు కొంత సహించి వాటిని విస్మరించి—నగర హృదయంలోకి చొచ్చుకుపోవాలి. ఈ నగర నిర్మాణాన్ని క్రమబద్ధం చేయాలనే తొలిప్రయత్నం 1911 లో జరిగింది. అప్పటికి 20 లక్షల జనాభా వున్నారు. ఇప్పుడు దాదాపు 50 లక్షలదాకా అక్కడ నివసించుకున్నారు. మరో లక్ష ప్రజలు పనిపాటలకోసం పరిసర ప్రాంతాలనుంచి వచ్చి పగల్లా నగరంలో వుంటారు. అందుచేత వెనక నవాబులు వగైరా లుండే పాతకొండీ లన్నీ, కూలివాళ్ళు ఆక్రమించుకుని మురికి ఆవాసాలుగా మారుతూ నగరం దక్షిణానికి వ్యాపించింది. ఏది యేమైనా అనకాయలో కారం కూరినట్టు జనం ఇలా క్రిక్కిరిసివుండే నగరం, ప్రపంచంలో మరొకటి ఏదీ లేదు. ఈ నగరాన్ని ముందైనా బాగుచేయటా

నికి తగిన అపార్టుమెంట్లేవీ కనుపించవు. గృహ నిర్మాణ కార్యక్రమం చాలా అస్తవ్యస్తంగా వుంది. దీనికి తగ్గట్టు 'రెంటు కంట్రోలు' ఒకటి. ఇది ఇలా వుండగా పల్లెటూళ్లనుంచీ దినదినం వచ్చి చేరుతుండే కొత్త జనసమూహాలను అరికట్టడానికి తగిన శాసనమేమీ లేదు. నిజానికి కలకత్తా వంగ ప్రాబల్యంగల నగరమే. కాని ఇందులో నూటికి 35 మంది—10 వేలమంది యూరపియనులతో కలుపుకుని, పరాయిదేశాల ప్రజలు. మిగతా జనాభాలోకూడా కచ్చితంగా అక్కడపుట్టి పెరిగిన వాళ్ళు కేవలం నూటికి 20 కుటుంబాలు.

లండనుకూ, కలకత్తాకూ జనాభా విషయంలో ఒక పోలిక వుంది. రాష్ట్రంలోని అయిదవవంతు జనాభా నగరంలో నివసించుతూ వుంటారు. తూర్పుపాకిస్తాన్ యేర్పడిన తరువాత ఆ ప్రవాస ప్రజానీకాన్ని భరించే తాహత్తు రాష్ట్రానికి లేకుండా పోయింది. హుగ్లీనది కూడా రోంద్రుబకుతోంది. వర్షఋతువులో తప్ప, పైనుంచి వచ్చే ఒండ్రుమట్టిని కూడా క్రిందికి జారవేయగల ప్రవాహవేగం లేకుండా పోతోంది. తిరిగి ఈ నగరం పాతకాలంనాటి మలేరియా చిత్తడి ప్రాంతంగా మారిపోతే పోవచ్చు. ఇలాగా అనేక ప్రాంతాలనుంచి అనేక రకాల ప్రజలను ఆకర్షించుతోంది. ఇక్కడి స్థానిక ప్రజలు ఎవరికివారే యమునా తీరగా వుండటంచేత విదేశీయులు ఎవరు వచ్చినా ఇక్కడ కులాసాగానే వుంటారు. ఎవరూ వాళ్ళను గురించి పట్టించుకోరు. ఈ విదేశీయులు వాతావరణం అధ్వాన్నంగా వుందనీ, వీధులు మురికి కూపాలుగా వున్నాయనీ తిట్టుకుంటూనే వుంటారు. వంగీయులలో వున్న కులమత భేదాలను విమర్శించుతూనే వుంటారు. కాని కొంతకాలం అలవాటయిన తరువాత ఆ నగరాన్ని వదలరు. ప్రాంతీయభాషను ఒక్కముక్క కూడా నేర్వకుండా ఇక్కడ హాయిగా జీవితాలు వెళ్లదీసుకుంటారు. స్థానిక ప్రజలలోవుండే కూటాల కంటే కుంచితములైన కూటాలను ఏర్పాటు చేసుకుంటారు.

IX

త్వరితగతిని వచ్చి చూచిపోయే యాత్రికునికి కలకత్తాలో ప్రత్యేక విశేష మేమీ కనుపించదు.—జనం హడావిడి తప్ప. ఈ హడావిడికి కేవలం ప్రతిగా వడివీధిలో, నిమ్మకు నీరెత్తినట్టు అతి ప్రశాంతంగా నెమరువేసుకుంటూ ఆవులూ ఎద్దులూ అడ్డంగా పడుకుంటాయి.—రాకపోకలు అలా స్తంభించి పోవలసిందే—ఆఫీసుకు అసలే ఆలస్యమై పోయిందనుకునే ఉద్యోగి అలా చికాకుపడి జుట్టు పీక్కుంటూ కూర్చోవలసిందే. ఏది ఏమైనా జనసమ్మర్దం కోలాహలంగానే వుంటుంది. 'న్యూమార్కెట్' ప్రపంచంలోకల్లా త్రొక్కిడిగల ప్రదేశమని చెప్పవచ్చు. దాంతో కొంచెం బరోబరిగా పోలిక చెప్ప దగ్గది 'కూస్టన్‌బుల్' నగరంలోని 'ఓల్డుమార్కెట్' వినిమయావసరవస్తువులమీదకూడా దిగుమతికంట్రోలు పాటించకపూర్వం, ప్రపంచంలో ఎక్కడ ఏ సరుకు తయారయినా అది ఈ 'న్యూ మార్కెట్టు'లో కనుపించేది.

అదే విధంగా 'విదేశీ ద్రవ్య చలామణీ'మీద ఆంక్షలు విధించటంతో పెద్ద పెద్ద బ్రిటిష్ కంపెనీలు నిర్వహించుతున్న అమ్మకం గిడ్డంగులన్నీ మూతలు బడ్డాయి. అధిక సుంకాలవల్లా, జీవనవ్యయం పెరగటం వల్ల ప్రజల కొనుగోలుశక్తి దెబ్బతినీ యుద్ధ తరుణంలో పెంపొందిన చిన్న చిన్న దుకాణాలూ, హోటళ్లూ అన్నీ దివాలాతీసినై. సభ్యులు పూర్వంలాగా డబ్బు ఖర్చుపెట్టే స్థితిలో లేని కారణంగా విదేశీయుల క్లబ్బులకు కూడా అదే దుర్గతి పట్టింది. పెద్ద పెద్ద హోటళ్ళలో 'యూరపియన్ భోజనం' సరసమైన ధరకే లభించినా తాగుడుమాత్రం ఎక్కువ డబ్బు ఖర్చు పెడితేగాని లభించని విలాసం. కొన్ని హోటళ్లలో నాట్యాది వినోదాల ఏర్పాటుకూడా వుంటుంది. చైనావాళ్ళ హోటళ్లు చాలావరకు పతనమైపోయాయి. హిందూ హోటళ్ళలో తిండి అధ్వాన్నంగా వుంటుంది. అంతకంటే ఏ గృహస్థు ఇంటికైనా వెడితే కడుపునిండా కమ్మని తిండి పెడతారు. ఇంగ్లండులో మామూలుగానే హోటళ్ళలోకంటే గృహస్థుల యిళ్ళల్లో తిండి బాగుంటుంది. ఏదిఏమైనా శీతాకాలంలో గుర్రపు పందాలు జోరుగానే సాగుతూ వుంటాయి, టెన్నిస్ పందాలు కూడా విస్తృతాసక్తిని సాగుతూనే వుంటాయి. 'ఈడెన్ గార్డెన్స్' చిన్న చిన్న దుకాణాలు లేచి ఖరాబైపోయినా, పెద్ద మైదానం మామూలుగానే వుంది.

# కలకత్తానగరము

కలకత్తా పరిసరములు అంత ఉల్లాస జనకమైనవి కావు. భారతదేశంలో వున్న సైనిక స్థావరాలన్నిటిలో బారక్‌పూర్ బాగుండేది. పురాతన మహావృక్షాలతో ఆ పార్కు విహారయోగ్యంగా వుండేది. కాని యుద్ధంతో అది నాశనమైంది. 'బొటానికల్ గార్డెన్స్' నిజంగా చూడ ముచ్చటగా వుంటాయి. కాని అవి నదికి అవలివడ్డున వుండుటచేతనూ, నదిమీద బల్లకట్టు సౌకర్యాలు సరీగా లేకపోవటంచేతనూ, భీభత్సంగా వుండే మురికివీధులగుండా తప్ప ఆ ప్రదేశాన్ని చేరుకునే అవకాశం లేదు. అలాగే నదికి అవలవున్న చంద్రనగర్ నిన్న మొన్నటిదాకా ఫ్రెంచివారిక్రింద వుండి, విదేశీ విలాస విభ్రమాలకు ఆగారంగా వుండేది అది భారతదేశంలో కలిసిపోవటంతో దానికి ఆ విదేశీవాసన అంతరించింది. చంద్రనగర్ పోయేరోడ్డు చాలా జనసమ్మర్దంగా వుండి ప్రయాణం చాలా బాధాకరంగా వుంటుంది. కలకత్తానుంచి బయలుదేరే మరియొక చరిత్రాత్మకమైనరహదారి ఇప్పుడు పాకిస్థాన్‌లో భాగంగావున్న జెస్సూరుకు వెడుతుంది. అదిపూర్వం వటవృక్షాల గుబురులోవుండి మోహనంగా వుండేది. ఇప్పుడు ఆ శోభయావత్తూ పోయింది. జమినీరాయ్ మోజుగా చెబుతూ వుండేవారు. "కలకత్తానగరం త్వరలో గ్రామీణ ప్రాంతంగా మారిపోగలదు. కారులో కూర్చుని అలా చుట్టూ తిరిగితే శోభాయమానమైన ప్రకృతిసౌందర్యం ఎంతో కనుపించుతుంది"—అని. అందుచేత పరిమితకాలం వచ్చిపోయే యాత్రికులకు కలకత్తా విసుగుదల కలిగించదు. ఇంకా ఎక్కువకాలం మకాం వేసే వాళ్ళకు సినిమాలున్నాయి. అమెరికాలోనూ, బ్రిటన్‌లోనూ తయారయ్యే మంచి చిత్రాలలో చూడవలసినవి ఇక్కడకు వస్తాయి. భారతీయ చిత్రాలు ఎప్పుడోతప్ప మంచివివుండవు. ఇంతకూ చెప్పవచ్చిందేమంటే, కళాపిపాసువు ఎవడైనా వస్తే, ఇక్కడకు ఎందుకు వచ్చారూ అని, బొత్తిగా విచారించనక్కరలేదు. కాని భారతీయ తత్వాన్ని అవగతం చేసుకోవటానికి ప్రయత్నించే విజ్ఞానవేత్తగాని అయితే, అతను మరోకతావున తన కార్యక్రమం ప్రారంభించవలసి వుంటుంది. ఎందుచేతనంటే, నేను మొదటే చెప్పానుగా, ఇక్కడ మహోజ్వల శిల్పసంపద లేవి లేవని. ఒకప్పుడు మహోన్నత దశ ననుభవించిన వంగనాటక రంగంకూడా యీనాడు పతనావస్థలోవుంది. ప్రాచీన సంగీతం బహుజనాన్ని ఆకర్షించుకున్నా స్థానిక గాయకులు మరీ సంప్రదాయాన్ని అంటిపెట్టుకుని వుండేవాళ్లు కావటంచేత విసుగుదల కలిగించుతుంది. కలకత్తాలో భారతీయ నాట్యకళా సంప్రదాయం లేదు. అదృష్టవశాత్తూ జమినీరాయ్ కళాకేంద్రం ఒకటి వుంది. మహామహుడైన ఆ చిత్రకారుడు, తనకు సంక్రమించిన కళాసంపద నంతా, ఆత్మీయమైన తన ప్రత్యేకశిల్పంలో వ్యక్తీకరించుతూ వుంటాడు. పురావస్తు ప్రదర్శనశాలలో అనేక వేల శిల్పాలను దర్శించేకంటే పదినిమిషాలపాటు ఆయనతో ప్రసంగించితే అనేక విషయాలు తెలుసుకోవచ్చు.

అదాటున వచ్చిచూచి పోయేవారికి కలకత్తాలో అంతర్గర్భితమైవుండే రహస్యశోభ అవగతంకాదు. చారిత్రకాన్వేషణాభిలాష ఇంతో అంతో కలవాడే దీన్ని అవగతం చేసుకోగలడు. ఆంగ్లేయ అధికారుల ద్వారా వచ్చిన అంతర్జాతీయ సంస్కృతి, స్థానికవంగ సంస్కృతితో లీనమై ఒక ప్రత్యేక సంస్కృతి యిక్కడ ఆవిర్భవించింది. ఆదిలో ఈ సాంకర్యం కొంత అసభ్యకరంగా వుండకతీరదు. లౌకిక ప్రయోజన సాధన పరమాశయంగా ఇది సాగుతూ వుంటుందనటం కూడా అసత్యంకాదు. కాని యీ సమైక్యత వైజ్ఞానికంగా అనేకమంది మహామహులు ఆ గడ్డమీద ప్రభవించటానికి కారణమైంది. దాని ఫలితాలు నేటికీ కనుపించుతూనే వున్నాయి. రాజారామమోహనరాయ్‌కీ ఆయన సమకాలికులకూ పాశ్చాత్య సంస్కృతితో కలిగిన పరిచయమే, అధునాతన వంగసాహిత్యంలో వచనం ఆవిర్భవించటానికి కారణమైంది. మైకేల్ మధుసూదనదత్తు ఆంగ్లేయ కావ్యములను దృష్టిలో వుంచుకొని వంగకావ్యశిల్పమును సంస్కరించాడు. అనంతరం రవీంద్రుడు ఇంకా ముందుకుపోయి యించుమించు ఒక క్రొత్త భాషనే సృష్టించాడు. తరువాత చదువుకున్న ప్రతి వంగీయునకూ ఆ భాష శిరోధార్యమైంది.

ఈ ముగ్గురేకాక, ఇలాటి మహామహులు ఇంకా అనేకమంది, కలకత్తాలో పుట్టడము, లేదా కలకత్తాలో పెరగడమూ జరిగింది. అందుచేత ఈ వ్యాసంలో ఆదినుంచి తుదివరకు కలకత్తా అన్నా వంగరాష్ట్రమన్నా ఒకటేననే దృష్టిలో వ్రాసుకువచ్చాను. కలకత్తాను

ఆవిర్భవింపజేసిన జాతి చరిత్రకు తెలియకపూర్వమే వంగదేశం అంటూవున్నమాట సత్యమే. అలెగ్జాండరు భారతదేశంలోకి చొచ్చుకురావటానికి వెనుకాడింది 'గంగరిడే' (Gangaridae) యొక్క గజాలను చూచే నంటారు. 'గంగరిడే' అంటే వంగీయులకు గ్రీకులు చేసిన నామకరణం కాని ఈ రెండువందల సంవత్సరాలలో ఈ మహానగరం పెంపొందిన వంగ రాష్ట్రానికి తలమానికమై దానితో అవినాభావం కలిగివుంది, ఇది బొంబాయినగరం మహా స్తరు కాదు. బొంబాయి లేకుండా మహారాష్ట్రం గాని గుజరాతు గాని పెంపొంద గలవు. కాని కలకత్తాను విడిచిస్తే వంగరాష్ట్రం చచ్చిపోతుంది. మరొక విషయం బొంబాయినుంచి గుజరాతీయులను గాని, అత్యంత స్వల్పసంఖ్యాకులు గా వున్న పారశీకులను గాని తొలగించితే దానికివున్న అంతర్జాతీయ స్వభావం నశించుతుంది. బ్రిటిష్ వాళ్లు వైదొలగినా కలకత్తా అలా కాలేదు.

* ఎన్‌కౌంటర్ పత్రికతో గల ప్రత్యేక యేర్పాటుతో *



# కలగూరగంప

# లంకా నగరము ఎచ్చట ఉన్నది?

శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ

ఈ ముఖ్య రామాయణము లనేకములు, రాజకీయ ప్రాబల్యముకొరకు కొందరు వ్రాయుచున్నారు. ఇది విచిత్రము. పరిశోధనాదృష్టితో మూల రామాయణ మేదియో నిర్ణయించి, దానిని అనువదించినచో నేను సంతోషించెడివాడను. అది సత్యమగు రామచరిత్ర కూడ అగు ననుటలో సందియము లేదు. స్వచ్ఛమైన వాల్మీకి శైలినికూడ చవిచూచి యుండెడివారము.

'జాకోబి' మున్నగు విద్వాంసులు బాలకాండ, ఉత్తరకాండలు ప్రక్షిప్తము లని ఏనాడో నిర్ణయించిరి. భారతీయ పండితులు కూడ దీని నంగీకరించిరి. ఇంకను మిగతకాండలలో ననేక ప్రక్షిప్తములు చేరినవి. భారతీయ విద్వాంసుడైన 'యన్. యస్. ఖాడ్ పత్రికర్' మూలరామాయణములో ఆరు వేల శ్లోకము లుండెనని, మాధవాచార్యులు 13 వ శతాబ్దములో తన మహాభారత తాత్పర్య నిర్ణయములో వ్రాసెనని, ఆయన మహారామాయణమని పేర్కొనెనని, 'భారత పురాణానాం మహారామాయణస్య చ' అని, మరి యొకచోట "ఋగాదయ శ్చ చత్వారః పంచ రాత్రం చ భారతం మూలరామాయణం" అని ఇంకొకచోట "ఇతి మూలరామాయణవచనేన" అని చెప్పెనని భాండార్కర్ సంపుటములలో (Vol 5-6) వ్రాసియుండెను. ఒకప్పుడు మూలరామాయణము ఒక దినములో చదువుటకు వీలుగా నుండెనని లక్ష్మణరాయధీమణి 'హిందూమహాయుగము'లో వ్రాసెను. 'వింటర్ నిట్జ్' కూడా తన హైందవ వాఙ్మయచరిత్రలో మూలరామాయణములో ఆరు వేల శ్లోకము లుండెనని వ్రాసెను. యథార్థమైన రామ చరిత్ర ఈ 6 వేల శ్లోకములలో వాల్మీకి ఋషి వ్రాసియుండవలెను క్రీ. శ. 1, 2 వ శతాబ్దముల నాటి దగు 'మహావిభాష' అను బౌద్ధ గ్రంథమునుబట్టి ఇందు పన్నెండు వేల శ్లోకములు కలవని తెలియుచున్నది. ఈ నాటి దానిలో 25 వేల శ్లోకములుకలవు. ఈ ప్రకారము మూలరామాయణము పండితుల కలము పోట్లకు గురియైనది. స్కాందపురాణములోని ఒక శ్లోకమును బట్టి మూలరామాయణము అను గ్రంథము, నాల్గు వేదములు, భారతము, పంచరాత్రికములు, తరువాత నొక శాస్త్రముగా నుండెనని ఉత్తరకాండములోని కొన్ని సర్గలు ప్రక్షిప్తము లగుటచేత వ్యాఖ్యలేదని తెలియుచున్నది. ఈ శ్లోకము సర్వదర్శన సంగ్రహములో ఉదహరింపబడినదని 'వీబరు' వ్రాసెను. మొత్తముమీద మూలరామాయణము గలదని, అది యనేక అవస్థలను జెంది పరిణామము జెంది వర్తమాన రూపము దాల్చెనని స్పష్టపడుచున్నది.

లంకానగర మేదియో, రాముని మార్గ మేదియో కొంచెము ఆలోచించెదము. యమ్. వి. కిబే యమ్.ఎ., అక్సఫర్డులో జరిగిన ప్రాచ్యదేశీయుల అంతర్జాతీయ సభలో నొక వ్యాసమును చదువుచూ, చిత్రకూటమునకు, కిష్కింధకు మధ్యదూరము 98 మైళ్లు అని నిర్ణయించి చెప్పెను. ఇది రామాయణములోని లెక్కలను బట్టియే తేలుచున్నది.

అయోధ్యాకాండ రెండవసర్గ 54-58, 29 నిబట్టి, భరద్వాజుడు రామునితో అటనుండి 10 క్రోసులలో చిత్రకూటము కలదని చెప్పెనని తెలియుచున్నది. "దశక్రోశ ఇతస్తాత్ గిరిర్యస్మి న్నివత్స్యసి చిత్రకూట ఇతి ఖ్యాతో" భరద్వాజుడు భరతునితో చెప్పునపుడు కూడా చిత్రకూటము 2½ యోజనముల దూరములో

కలదని చెప్పెను. ఈవాదు కూడా అదూరము 20-30 మైళ్ళలో నున్నది. అయోధ్యకాండలో వాల్మీకి, అయోధ్య చిత్రకూటముల మధ్యదూర మిచ్చెను. ఇచట మలయ, సహ్యాల పేర్లున్నవి. సుందరకాండలో కూడా నివి పేర్కొనబడినవి. కాని ఇవి యన్ని ప్రక్షిప్తములు. రామాయణమునుబట్టి లంక వింధ్యకు దగ్గరగా నున్నట్లు తెలియుచున్నది. మలయ లేక ప్రస్రవణకు తూర్పున త్రికూట పర్వత గుహగలదు; మధ్యనది గలదు. లంకకు సముద్ర మెక్కువదూరమున లేదు. దీనిని విభీషణుడు సులభముగా దాటెను. మారీచుని చూడబోయి, రావణుడు కూడా సులభముగా దాటెను. అరణ్యకాండ సర్గ 35-శ్లో 37 బట్టి, నదియే సముద్రముగా వర్ణింప బడినట్లు తేలుచున్నది.

అరణ్యకాండ 32 సర్గ-3, 4 శ్లోకములబట్టి ఖరదూషణాదులు చనిపోయినప్పుడు శూర్పణఖ లంక కేగెనని, రావణుడు బంగారు రథముపై సముద్రము దాటి వచ్చెనని మారీచుని చూచెనని జనస్థానమునకు రావణుడు మారీచునితో వెళ్ళునప్పుడుగాని, సీతతో తిరిగి వచ్చునప్పుడుగాని పెద్ద సముద్రము కాన్పించదని, దానిని సులభముగా దాటెనని తెలియుచున్నది. రావణుడు సులభముగా పంచవటికి వచ్చెను. విభీషణుడు రాముని అనుచరులతో మాట్లాడెను.

రామాయణములో వర్ణించబడిన మలయ (సహ్య) మహేంద్ర పర్వతములు వింధ్యలోనివి. లంక కూడా వింధ్యకు దగ్గరగానే యున్నది. అచ్చటనే కిష్కింధగలదు. ప్రస్రవణ యను నది మలయగిరి. దీని అడుగున సముద్ర మున్నది. అది లంకను విడదీయుచున్నది. (యుద్ధకాండ 53 శ్లో 12 16, సర్గ 60-6 సర్గ 64-2)

మహేంద్ర కూడా వింధ్యలో ఒక శిఖరము. కిష్కింధకాండ సర్గ 63, శ్లో 14, సర్గ 64—శ్లో 1-2 ను బట్టి యీవిషయము తెలియుచున్నది. సంపతి, వింధ్య పర్వత శిఖరముమీాద నుండి ఎగిరి హనుమంతుడు మొదలగువారితో కలిసి సముద్రము ఒడ్డు కేగెను. రాముడుకూడా మహేంద్రగిరిఎక్కెను. హనుమంతుడు మున్నగువారు లంకనుండి వచ్చి, రాముని జూచిరి. 73, 74 శ్లోకములబట్టి రాముడు, సహ్యలేక మలయ ప్రస్రవణ చేరినట్లు తెలియుచున్నది. ఇవియన్నియు వింధ్యలో నొకచోటనే యున్నవి.

లక్ష్మణ రాయధీమణి కూడ, రాముడు భరద్వాజాశ్రమము (ప్రయాగ) వచ్చెనని చిత్రకూటము కేగెనని, ప్రయాగకు పడమర పది క్రోసులలో నిది కలదని చిత్రకూటముదగ్గర మందాకిని కలదని ఇప్పటికి కలదని, తర్వాత అత్రి ఆశ్రమము చేరెనని అటనుండి విరాధుని వనము చేరెనని అటనుండి నాలుగు మైళ్లలో శరభంగాశ్రమము, సుతీక్ష్ణాశ్రమము చేరెనని తర్వాత పంచాప్సరస్సరోవరము చేరెనని, ఇది బిలాస్‌పూర్ జిల్లాలోనిదని జనరల్ కనింఘామ్ నిర్ణయించెనని దీనికితర్వాత అగస్త్యభ్రాత ఆశ్రమము, తర్వాత అగస్త్యాశ్రమము చేరెనని, ఖరాదులు జనస్థానము లోనివారని, ఖరాది రాక్షసులను చంపుట యిచట జరిగెనని వ్రాసెను. నాసికపట్టణము, పంచవటి, జనస్థానము మొదలగునవి ఉత్తరమున నున్నవే.

ఈ రాముని మార్గములో వినుకొండను మన పండితులు చేర్చినారు. రాముడు వినుకొండ వచ్చినతరువాత సీతాపహరణ వృత్తాంతము వినెనని అందుచే దీనికి విన్నకొండయని పేరువచ్చెనని చెప్పుట వినుచున్నాము. L. R. Vol 57-113 పేజీలో ముట్లూరు గ్రామ కైఫీయతు కలదు. ఇచ్చట సీత రజస్వలయైనదని దీనికి రజస్వలాపురమని పేరువచ్చినదని, ఇచ్చట కొలనున స్నానము చేసినదని పై కైఫీయతులో వ్రాయబడినది. భద్రాద్రికి కూడ రాముడు వచ్చియుండలేదు. లక్ష్మణరావు, వీరభద్రరావులు కూడ ప్రక్షిప్త రామాయణమును చూచి, ఈ మార్గమంతా సత్యమనియే నమ్మి వ్రాసినారు. రామాయణములోని లెక్కనుబట్టి చూచిన భారత భూభాగమునకు లంకకుగల దూరము సత్యముకాదని తేటతెల్లమగుచున్నది. కొండరాళ్ళలో నిర్మించబడెనని చెప్పబడువారధి జాడ ఎచ్చట కాన్పించదు. మన పండితులీ మధ్య ఈ లంక కాదు మరియొక లంకయని అది ఇంక ఎచ్చటనో దక్షిణమున నున్నదని ఒక ప్రచారము ఆరంభించినారు. ఇది యంతయు మిధ్య. ఇంకను ఈ క్రింది వానిని చూడుడు. 'పులస్త్య'కు 'ద్రవిర'ను చేసిరని ఈయనకు దక్షిణమున కోటలుగలవని వీరికి 'విశ్రావసు ఇలాలిల' అను కుమారుడు కలిగెనని ఈ 'విశ్రావసుడు' 'దేవవర్ణిని' అను అంగీరస బృహస్పతి శాఖకు చెందిన బాలికను వివాహమాడి నర్మదానది ఒడ్డున నివసించెనని వీరి కుమారుడు వైశ్రావణ కుబేరుడని ఈయన పాలిం

చిన ప్రజలను యక్షులంటురని, ఈతనికి 1. నలకుబేర 2. రావణ 3. కుంభకర్ణ 4. విభీషణ యను నలుగురు కుమారులు, శూర్పణఖ యను కుమార్తె కల్గిరని తెలియుచున్నది. దీనినిబట్టి చూచిన రావణుడు ఏలిన 'లంక', నర్మదానదికీ, వింధ్య పర్వతములకు దగ్గర కలదని స్పష్టపడుచున్నది.

2. అనార్యులను రామాయణ రచయిత కోతులు, ఎలుగుబంట్లు గా వర్ణించెను; మనుజులబోలిన వానరములు అలెగ్జాండరు కాలమునగలవు. ఒక పర్యాయము కోతుల మూక, మాసిడోనియా సైనికుల కెదురు నిల్చెనని, అవి సైనిక దుస్తులతో నుండుటగాంచి, నిజమైన సైన్యమని గ్రీకు సైనికులు భయపడి శత్రువులుగా భావించి, ఎదుర్కొనుటకు సిద్ధపడినట్లు తెలియుచున్నది. 'క్లిటార్కసు' దీనిని వర్ణించెను. ఇట్టివి ఉత్తర భారతమున నే జరిగినవి కాన, అచటనే రామకథ జరిగినట్లు ఊహింపవచ్చును. కిష్కింధ కూడా ఉత్తర భారతములోని ఒక నగరము. అది చిత్రకూటమునకు 98 మైళ్ళ పడమరలోని ప్రదేశము. పంపా సరోవరముకూడా 'బిలాసపూరు' జిల్లాలోనిది. ఇవియన్నియు ఉత్తర భారతములోనివనియు స్పష్టముగా చెప్పవచ్చును. ఇక ప్రక్షిప్త రామాయణ కర్తలు లంక యనగా సింహళ ద్వీపమని భ్రమపడి, ఆ మార్గమునకు మధ్యలోనున్నట్టి, తర్వాత ఏర్పడినట్టి దేశములను రాముని మార్గములో చేర్చిరి. దీని కనుగుణ్యముగ అనేక ప్రక్షిప్తశ్లోకములల్లిరి. అశ్యల కాలమునుండి చదువులేనట్టి అనార్యులు, వారి వంశీలు ఈ పిటకథలన్ని నమ్మి సింహళద్వీపమువరకు యాత్రలు చేసి, రామేశ్వరము చూచి పుణ్యఫలమును బొందుచున్నామని ఆనందించుచున్నారు. సత్యవ్రతులైన ఋషులకు నేను ఎట్టి కళంకమును ఆపాదించను. స్వార్థపరులు వ్రాసిన వ్రాతలను విమర్శనాదృష్టితో, పరిశోధనాదృష్టితో, చారిత్రక దృష్టితో జూచి త్రోసివేయవలయును. రాకెట్ల యుగములో ఈ మూర్ఖ నమ్మకములోబడి మునిగి తేలినచో, మన మధోగతి పాలగుదుము. దేశమును అంధ విశ్వాసములతో ముంచినచో నవ్య భారత వర్ష మేర్పడజాలదు. ప్రతివారికి విచారణ, విమర్శన, పరిశోధన, చారిత్రక సత్యాన్వేషణ అవసరము. ఏ దేశములోనైన సాహిత్య అకాడమీలను పేరుతో పైన పేర్కొన్న భావ విప్లవము లేకుండా బూజుపట్టిపోయిన పాతసిద్ధాంతములు గలవారిని ఏర్పరచి పని చేయమని చెప్పినచో, వారు అభివృద్ధి నిరోధకులై అసూయాయత్తచిత్తులై స్వార్థపరులై పేరుకొరకు ప్రాకులాడుచూ దేశమును పాతరాతియుగమునాటికి లాగికొని పోవుట నిశ్చయము. పైగా అభివృద్ధి గాములగు వారికి కూడా ఆటంకములు గల్పించుచుందురు. ఇంతకూ బర్కు (Burke) మహాశయుడు చెప్పినట్లు దేశమును ఆవరించిన రెండు జాడ్యములు "వక్రమార్గములో ధన సంపాదన, అధికార వ్యామోహము అని స్పష్టపడుచున్నది. ఇవి ఉన్నంతవరకూ ఏ దేశములోనైనా నిజమయిన సాహిత్యము అడుగున పడిపోవును. ఆదేశము దిగజారి పదవనకము దేశమగుట తథ్యము. మహాత్ముడు కాంగ్రెసు అధ్యక్షుడైన కారాగృహమునకు పోయివచ్చిన గొప్ప రాజకీయవేత్త అయిన బెంగాలీ బ్రాహ్మణ విద్వాంసుడు బాబూ సురేంద్రనాథ్ బెనర్జీ నోటినుండి వచ్చిన మధురభాషణము ఒకసారి స్మరించుకొనవలసియున్నది. ఆంగ్లేయ ఆధి "పత్యము క్రింద ఆరంభించిన అభివృద్ధిని భంగపరచరాదు. ఇంగ్లండు రాజ

కీయముగా మాకు గురువు. ఆంగ్లేయ చరిత్ర మాకు స్వాతంత్ర్యభావములను ప్రసాదించినది. వానిని మేము మా రక్తములో ప్రతి అణువులోను జీర్ణించుకొనెను. ఇంగ్లాండు చరిత్ర స్వాతంత్ర్య చరిత్రమే. ఈ దేశములోని ఆంగపాలన ముఖ్యముగా అభివృద్ధి దాయకమైన ప్రభుత్వము.

[S. N. Banerjee— "The march of progress which has already commenced under English auspices must not be disturbed.—England is our political guide—English history has taught us these principles of freedom which we cherish with our life-blood —The history of England is the history of freedom — The English rule in this country is essentially a progressive rule"]

అట్టి అభివృద్ధిని త్రోసిపుచ్చి ప్రయోగాత్మకము కానట్టి శాస్త్రముల దాస్యములోనికి దించుటకు కొందరు స్వార్థపరులు ప్రయత్నించుచున్నారు. ఇటి ఛాందసులు రాజకీయ రంగములో సాహిత్యరంగములో సాంఘిక రంగములో మరిదేనిలో నను గిడిన అవి సర్వ నాశన మగును. కాన భారతవర్షమునకు భావ విప్లవము కలిగించిన బుద్ధదేవుడే ప్రపంచమునకు శిరణ్యము. ఆయన బోధనయే జాతీయ ప్రబోధనము. ఆయన బోధించిన శాంతియే విశ్వశాంతి. ఆయన ఆదరణమే భూమండల మంతటా ఆదరణీయము. ఆయన ఆరంభించిన హేతువాదమే జాతీచక్రములో త్రికాలములు నిల్పునటి అనుభూతివాదము. అట్టి బుద్ధదేవుని స్మరించుచు ప్రతిగ్రంథమును విమర్శనాదృష్టి, చారిత్రక దృష్టితో జూచుచు ముందుకు నడచెదరని, స్వార్థపరులు స్వప్రయోజనములకు వ్రాసిన ప్రతిగ్రంథము ఋషి నిర్మితమని నమ్మకుందురని, హెచ్చరించుచున్నాను. అప్పుడే సత్యము బయల్పడును.



# పాల్కురికి సోమనాథుని మాతృభాష కన్నడమా?

శ్రీ కె. సుబ్బరామప్ప

పాల్కురికి సోమనాథుడు తెలుగు సాహిత్యంలో దేశికవితను వ్యాప్తికి తెచ్చి వీరశైవమతాన్ని తెలుగుదేశంలో ప్రచారం చేయడానికి "బసవ పురాణము", "పండితారాధ్య చరిత్ర" అనే రెండు ఉత్తమ ద్విపద కావ్యాలను రచించి ప్రసిద్ధికి వచ్చాడు. ఇతను హైదరాబాదుదగ్గరి జనగామ తాలూకాలోని పాలకుర్తి గ్రామం వాడని తెలుగుదేశంలో వాడుకగా వుంది. కాని పండితారాధ్య చరిత్రకు పీఠిక వ్రాసిన కీ॥ శే॥ డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు సోమనాథుని నివాసస్థలం మైసూరు సంస్థానంలోని తుంకూరి జిల్లాలోని పాల్కురికి అని చెప్పారు.

ఇప్పుడు మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో మూడు తాటాకు పుస్తకాలు లభించినాయి. పాల్కురికి సోమనాథుడు వ్రాసిన పండితారాధ్య చరిత్రలోని గురుభక్తి ఆండారు చరిత్రను కన్నడీకరించిన ప్రాసభూషణ పెమ్మశెట్టి (1650) వార్ధక షట్పదులలో వ్రాసిన గ్రంథంయొక్క మూడు ప్రతులు అవి. ఆ

మూడింటిలోను గ్రంథాదిలో ఆకవి యిలా వ్రాశాడు: "పాల్కురికి సోమనాథను తందెభాషెయల్లి బరెద ద్విపది ఆరాధ్యచరిత్రెయు సురభక్తి అందారు చరిత్రెయు కంపడిసి" (అనగా పాల్కురికి సోమనాథుడు తన తండ్రి భాషలో వ్రాసిన ద్విపద ఆరాధ్య చరిత్రలోని సురభక్తి అందారు చరిత్రను కన్నడించుచున్నాను అని) తండ్రి భాష తెలుగైనప్పుడు తాయిభాష అనగా మాతృభాష కన్నడం అయివుండవలె కదా! అనే శంక తప్పక కలుగుతుంది. పైన తెల్పిన పుస్తకంయొక్క మూడు తాటాకు ప్రతుల్లోనూ "తందెభాష" అనే స్పష్టంగా వుంది.

పాల్కురికి సోమనాథుడు కన్నడ భాషలో "శీల సంపాదనె"; "సహస్రగణనామ"; "పంచరత్న"; "సద్గురు రగళె"; "చెన్నబసవస్తోత్ర"; "శరణుబసవ రగళె" అనేవి వ్రాసినట్లు తెలుగు సాహిత్య చరిత్రకారులూ ఒప్పుకున్నారు. కన్నడంలో జనప్రియత్వంగా వుంటూ కన్నడ నాటకపుస్తకాల్లో కూడా పద్యాలు వేస్తూవుండే "సోమేశ్వరశతకాన్ని కూడా పాల్కురికి సోమనాథుడే వ్రాసినట్లు దీనికి పీఠిక వ్రాసి ప్రకటించిన కన్నడ సాహిత్య పరిషత్తువారే శంకించారు. ఈతణ్ణి గూర్చి యీతని తరువాతి కవులైన కన్నడ శివకవులు సుమారు 12 మందికిపైగా తమ గ్రంథాదుల్లో పేర్కొన్నారు. ఇతణ్ణి అవతార పురుషుణ్ణిగా భావించారు వారు. ఇతని బసవపురాణాన్ని 14 శతాబ్దంలో భీమకవి కన్నడంలోనికి అనువాదం చేశాడు.

ఇదిగాక ఆంధ్రదేశంలో గ్రామాలపేళ్ళ చివరిలో "కుర్కి" లేక "కురికి" అని అఖరు అయ్యే గ్రామాలు లేవు. "కుర్తి" అనే వున్నాయి. ఉదాహరణకు: పాలకుర్తి, మేడికుర్తి, దూబకుర్తి, యిత్యాదులు, 14 శతాబ్దందాకా కన్నడనాడులో "ప"కారంతో ఆరంభమయ్యే పదాలు "ప"కారంగానే వుండిపోయినాయి. ఉదాహరణకు "కోగె పాడువ", పుట్టి, పులి మొదలైనవి యీనాడు హాడువ, హుట్టి, హులి క్రమముగా వానిని అంటారు. అలాగే పత్తి—హత్తి, పగలు—హగలు; పాము—హాము, పాలు—హాలు; దీనినిబట్టి సోమనాథుని కాలంలో పాల్కురికిగా వుండిన గ్రామం యీనాడు భాషాశాస్త్రరీత్యా హాల్కురికిగా మారి యిప్పుడు ఈ పేరుతో పిలవబడుతూవుంది.

కన్నడం మాతృభాషగా గల్గిన మైసూరు దేశీయుడు శైవమతప్రచారంకోసరం తెలుగుదేశానికి వచ్చి తెలుగు నేర్చుకుని తెలుగులో జానుతెలుగులో ప్రచారంకోసం తొలిసారిగా దేశికవితను వ్రాసి ప్రఖ్యాతికి వచ్చాడు. కన్నడిగునికి తెలుగులో కవిత్వం ఎలా సాధ్యం అయిందని అడుగవచ్చు. కన్నడిగులు కానివారు అనేకులు కన్నడ సాహిత్యానికి సేవచేసి పేరుప్రతిష్ఠలు గడించారు. కన్నడకవిచరిత్ర వ్రాసిన ఆర్. నరసింహాచార్యులు, సుప్రసిద్ధ నాటకకర్త టి. పి. కైలాసం; శ్రీ మాస్తి వెంకటేశయ్యంగార్, కె. వి. అయ్యర్ (వీరి నవల "శాంతలా"ను 18 భాషల్లోకి అనువాదం చేయడానికి ఢిల్లీ సాహిత్య అకాడమీ వారు ఎన్నుకున్నారు)—వీరి మాతృభాష తమిళం. కన్నడిగుల ఆస్థానకవి గోవిందపై—కొంకణీభాష, ద. రా. బేంద్రే (సుప్రసిద్ధ కన్నడకవి) మరాఠీ; దేవుడు. నరసింహశాస్త్రి, త. రా. సుబ్బరావు (త. రా. సు) వీరకేసరి. సీతారామశాస్త్రి అనే ప్రసిద్ధ కన్నడ నవలారచయితలు—తెలుగు. ఇంతెందుకు అచ్చతెలుగువాడైన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు మైసూరు చేరుకున్నాక కన్నడం నేర్చుకుని కన్నడంలో వ్రాసిన "సాహిత్యమత్తు జీవనకలె" అనే పుస్తకం మైసూరు విశ్వవిద్యాలయంలో కన్నడ బి. ఏ. ఆనర్సు తరగతికి యీ సంవత్సరం పాఠ్యగ్రంథంగా నిర్ణయించారు.

ఇక పాల్కురికి సోమనాథుడు. కన్నడ మాతృభాష కలవాడైనా, కన్నడకవి అయినా, తెలుగుదేశానికి వలసపోయి తెలుగు నేర్చుకుని తెలుగులో ద్విపదకావ్యాలూ, శతకాలూ వ్రాయడం అతని కేమి కష్టమైన పనికాదుకదా! సత్యదూరమూ కాదనే నా నమ్మకం.

## కీ. శే. అబుల్‌కలామ్ అజాద్



మహా విజ్ఞానవేత్త, భారతవిద్యామంత్రి అబుల్‌కలామ్ అజాద్ ఫిబ్రవరి 22-తేదీన కాలధర్మం చెందారు. ప్రపంచ విజ్ఞానవేత్తలంతా ఈమహావ్యక్తికి బాష్పాంజలు లర్పించారు.

# గ్రంథ విమర్శనము

## కర్పూర వసంతరాయలు

గేయకావ్యం; రచన: శ్రీ సి. నారాయణరెడ్డి; ప్రాప్తిస్థానము: కాకతీయ ప్రింటర్సు అండ్ పబ్లిషర్సు మొజంజాహి మార్కెట్, హైదరాబాదు వెల రు. 2-50.

"జయతి మహీమాలో కాతిత:
　　　కుమారగిరిప్రభో:
సదసి లకుమా దేవి యస్య
　　　ప్రియాసదృశీప్రియా
నవ మభినయం నాట్యార్థానాం
　　　తనోతి సహస్రధా
వితరతి బహూనర్థాన్
　　　అర్థివజాయ సహస్రశ:"

అన్న చాటుశ్లోకాన్ని ఆధారంచేసుకుని శ్రీ నారాయణరెడ్డి ఈ కావ్యవస్తువును కల్పనచేశారు. ఈ కల్పితగాథను పరిశీలించేముందు, ఒకటి రెండు చారిత్రకవిషయాలను తడవి చూడవలసి వుంది.

కుమారగిరిరెడ్డి 1386 నుండి 1402 వరకూ కొండవీడు రాజధానిగా ఆంధ్రదేశమును పాలించాడు. కాటయవేమారెడ్డి ఇతని బావమరది, మంత్రి, దండనాథుడు. కాటయ వేముడు రచించిన శాకుంతల వ్యాఖ్యలోని ఒక శ్లోకము ఆధారంగా కుమారగిరిరెడ్డి "వసంతరాజీయ"మనే పేర నాట్యశాస్త్రం రచించినట్లు తెలుస్తున్నది. ఆ వసంతరాజీయం ఇంతవరకూ లభించలేదు. కుమారగిరి రెడ్డి చైత్రశుద్ధ త్రయోదశి మొదలు కొని తొమ్మిదిరోజులు ఏటేటా వసంతోత్సవాలు జరిపేవాడు. అందుచేత ఆయనకు "వసంతరాయ" బిరుదు సార్థకం. ఈ వసంతోత్సవాలలో కర్పూరాది సుగంధద్రవ్యములు విరివిగా వాడడంచేత కర్పూర వసంతరాయలనికూడా అనటం కద్దు.

నారాయణరెడ్డిగారికల్పన:—కుమారగిరిరెడ్డి మామూలుప్రకారం వసంతోత్సవాలు జరుపుతున్నాడు. ఆసందర్భంలో చైత్రశుద్ధ పూర్ణిమనాడు "లకుమ" నాట్యం చేస్తుంది. రాజు లకుమ పరస్పరం అనురాగబద్ధులవుతారు. రాజు ఆ నిండుసభలో మణిహారం లకుమకంఠాన స్వయంగా అలంకరించుతాడు. రాజు ఆమెను రాజనర్తకిగాచేసి సభాగౌరవం చేకూర్చుతాడు. లకుమ సాంగత్యాన్ని అభిలషించుతున్న రాజు తీర్థసేవనమిషతో, రాణికి బదులుగా లకుమను వెంటబెట్టుకుని బయలుదేరుతాడు. అహోబల నరసింహుని దర్శించుతారు. అనంతరం దాక్షారామ భీమేశ్వరుని సేవించుతారు. భీమేశ్వరుని సన్నిధిని లకుమ "జగజ్జనని వేమమ్మ దాలిచి" నాట్యంచేస్తోంది. "కదలి కంభుని యకుకుదిమ్మలనొదిగి నిల్చిన హైమవతిగా" అభినయించుతోంది. ఆ స్థితిలో "లకుమా! యని పిల్చుచు నామెను కర్పూరవసంతనృపుడు గాటముగా కౌగలించె."

[ఈఘటమును రేపే హైందవుడుచదివినా మనస్సు చివుక్కుమంటుంది. ఇందలి అసభ్యత నారాయణరెడ్డిగారికి ఎందుకు స్ఫురించలేదో ఆశ్చర్యంగా వుంది. "కేవు ఆవేశవశుడు" అంటూ సమాధానం చెప్పజూచారు. ఎంత ఆవేశమైనా ఆ రాజుకు కొంత పాపభీతి వుండవలసింది.]

అనంతరం, లకుమను వెంటబెట్టుకుని కొండవీటికి తిరిగివస్తాడు. లకుమకు ప్రత్యేకం విలాసమందిరం నిర్మించుతాడు. అదీ తనూ కలసిదాన్లో విలాసభోగాలు అనుభవించుతూ వుంటారు. దాని నాట్యవిలాసాల అనుభూతితో 'వసంతరాజీయం' రచించుతాడు. రాచకార్యాలన్నీ విస్మరించి కాలంగడిపేస్తూ వుంటాడు. దర్బారు బూజుపడుతుంది. ఉద్యోగవర్గాల్లోనూ, ప్రజల్లోనూ కూడా అసంతృప్తి బయలుదేరుతుంది. ఈ కథంతా చూచి రాణీ మనోవ్యథపడి మంచపెక్కుతుంది. ఆ వార్త జనంలో వ్యాపించటంతో, ప్రజలలో మరింత అసంతృప్తి ప్రబలుతుంది. ఈ అవకాశం తీసుకుని దేశంలోనూ ఇతరత్రాను కూడా శత్రువర్గాలు తలలెత్తుతాయి. ఈ దుష్పరిణామాన్ని అరికట్టడానికి కాటయ వేముడు ప్రయత్నించుతాడు. ఒక్కసారివచ్చి దర్బారులో కూర్చోమని రాజును వత్తిడిచేస్తాడు. అతని పోరుపడలేక రాజు ఒకనాడు అలా దర్బారులో వచ్చి కూర్చుంటాడు. ఇంతలో లకుమకు కాలు బెణికినట్లు ఒక వార్త వస్తుంది. అదివిని, రాజు, అమాంతం సభలోనుంచి లేచి పోతాడు. సభాసదులు దీన్ని మరింత అవమానకరంగా భావించుతారు. రాజు తిరిగి లకుమా విలాసాలలో మునిగి

పోతాడు. రాణి ఇదంతా భరించలేకపోతుంది. ఒక నాటి అర్ధరాత్రి రాణి లకుమ మందిరానికి వెళ్ళి తలుపు కొడుతుంది. లకుమ బయటికి వస్తుంది.

"నీమూలంగా రాజు దేశక్షేమం విచారించటం లేదు. ఆ కారణంగా దేశం పాడవుతోంది. నీవు ప్రధానమో, దేశం ప్రధానమో ఆలోచించుకోమని లకుమకు చెప్పి రాణి వెళ్లిపోతుంది. లకుమ ఆత్మహత్య చేసుకుంటుంది—

టూకీగా ఇదీ కథ. చివరలో హఠాత్తుగా ఆత్మహత్య చేసుకోవటంచేత, ఇదేమిటని, మనకు ఆశ్చర్యం కలుగుతుంది తప్ప, లకుమలో అలాంటి ఉన్నత లక్షణాలు ఉన్నట్లు రచయిత ఆదినుంచి తుదివరకూ ఎక్కడా సూచించలేదు. ఆదినుంచీ ఎంతో మహోన్నతిగా పోషింపబడిన రాణి ఈ చివరిఘట్టంతో మసిబూసుకుపోతుంది. కుమారగిరి కామించుకున్నది లకుమలోని కళా లేక దానికంపెరాలనా ? నారాయణరెడ్డిగారు ఈ విషయాన్ని కలగాపులగం చేసి ఆరోపామయావస్థను కలిగించారు. అందుచేత ఈ కావ్యాన్ని చదువుతూన్నంతసేపూ దీనికి గల ధార్మిక ప్రయోజనాన్ని గురించి మనకు శంక కలుగుతూ వుంటుంది. కుమారగిరిరెడ్డి కళ పేరు చెప్పుకుని భ్రష్టుపట్టిపోయిన అవినీతిపరుడుగా కనుపించుతాడు నారాయణరెడ్డిగారి కల్పనలో. ఈకల్పనకు ఆధారమని పైన ఉదాహరించిన చాటువులో కూడా, కుమారగిరిరెడ్డినిగురించి ఇలాటి కథను కల్పించటానికి తగిన అవకాశమేమీ కన్పించదు. రాజులూ జమీందారులూ, కళలను పోషించటమున్నది, నాట్యకతెలను ఉంచుకోవటమూ వున్నది. అంతమాత్రంచేత ఇంత దిగజారనవసరంలేదు. అలా దిగజారిన రాజులు తమ్ముతాము నాశనంచేసుకోవటమేగాక దేశాన్ని నాశనంచేయటం కూడా చరిత్రలో వున్నది. చారిత్రికంగా మనకు తెలిసినంతవరకు కుమారగిరిరెడ్డి అట్టివాడని తోచదు.



నిజానికి యీ విషయాన్ని తేల్చవలసినవారు రెడ్డిరాజుల చరిత్రను నిర్మించినవారూ, ఈ కావ్యాన్ని కృతిపుచ్చుకున్నవారూ అయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

కథాకల్పనవిషయంలో ఇలాంటి మతిభేదాలున్నా, ఆధునాతన కావ్యపరంపరలో దీనికి ఒక ఉన్నత స్థానంవున్నది. శ్రీ నారాయణరెడ్డి కవితాశక్తి దీన్లో ఒక సమగ్రస్థాయిని అందుకున్నది. మొత్తం కథను సంపుటీకరించిన విధానాన్ని వదిలేసి ఏ ఘట్టానికాఘట్టం ఒక ఖండకృతిగా చదివితే ఎక్కడికక్కడ ఆనందం కలుగుతుంది. ముక్తకములవలె, రసాత్మకములై కావ్యగౌరవాన్ని పుణికిపుచ్చుకున్న గేయగుచ్ఛాలు ఈ కావ్యంనిండా ఆదినుంచి తుదిదాకా అనేకం కుసుమించి గుబాళించుచున్నయ్.

"గరుడుని గరుత్తులటు
కరములెత్తి పతాక
హస్తముద్రను చూపినది నర్తకి.
కటకాముఖమ్ము నొకటపట్టి చూపి ప
ల్లవహస్తముద్రలీలగ నర్తకి
తనపైన పారిజాతములు జలజలకురిసి
నటుల పులకించెనా యవనీపతి—"

* * *

మనుదిన్న పాము పోలిక రాజమార్గమ్ము
ఒక మహానదివోలె ఉప్పొంగి నడచినది.

* * *

ఆమె కేశము ఝుంఝూనిలం బటుతూగ
ఆమె యంగముల ప్రశ్రయాబ్ధి వీచులురేగ
తలపైన ఎఱ్ఱకల్వలు మంటలను పూచె
నొసట చెందిరబొట్టు కసుబుస్సుమని మాసె
కనులెఱ్ఱబడిపోయె తనువెఱ్ఱబడిపోయె
ఇంతింత ఆమె మనసే ఎఱ్ఱబడిపోయె
నృత్యమందిరము శోణిత వర్తితమ్మయ్యె
ఆమెలో అసురసంధ్యామూర్తి కనవయ్యె

* * *

ఆమె వాసకసజ్జయై నిల్చెను
స్వామికై రెండు కన్నులు కాచెను—
మృగమదము తడియారిపోయె
సిగపూలు ముడుచుకొనిపోయె.
'స్వామీ' యనుచు పిలచెను
తరులన్ని 'స్వామీ' యనుచు అరచెను.
'సింగా' యనుచు పిలచెను గిరులన్ని
'సింగా' యనుచు అరచెను—

ఇలా ఎన్నయినా ఎత్తి చూపవచ్చు. ఎచ్చట తెరచిచూచినా ఏదో ఒక సువాసన, ఇందుకు నారాయణరెడ్డిగారిని అభినందించవలసివుంది.

## యజుర్వేద భాష్యము

### [ప్రథమాధ్యాయము]

శ్రీ దయానంద సరస్వతీకృత సంస్కృతభాష్యమునకు ఆంధ్రానువాదము; అనువాదకులు: శ్రీ అన్నే కేశవార్యశాస్త్రి. ప్రకాశకులు: శ్రీ అన్నే మాధవరావు, ఆర్య గ్రంథాలయము, ముసునూరు, కృష్ణా జిల్లా. వెల: రు 2/-

మహర్షి దయానంద సరస్వతి ఆర్యసమాజ స్థాపకులు. ఆర్యవిజ్ఞానానికి వేదములు మాత్రమే ప్రమాణములనీ, వేదవిరుద్ధములైన ప్రవచనములు బ్రాహ్మణాదికములలో ఎక్కడున్నా అవి త్యాజ్యములని ఆయన విశ్వాసం. పురాణములు సంపూర్ణంగా వేదవిరుద్ధములనీ అందుచేత అవి పఠనీయములు కావనీ ఆయన బోధించారు. సరియైన వేదపరిజ్ఞానము వ్యాప్తికి తెస్తే కాని లోకంలో నేడున్న ఈ అంధకారం తీరదనే అభిప్రాయంతో ఆయన వేదానికి భాష్యంరచించారు.

దయానందుని భాష్యమును గురించి శ్రీ అరవిందులు ఇలా సంస్తుతించారు:

"దయానందుని దివ్యదృష్టి, యుగయుగాలుగా వస్తూయున్న మూర్ఖత్వము మధ్యనుండి, నలువైపులా ఆవరించియున్న అజ్ఞానాంధకారము మధ్యనుండి ఘోరమైన వ్యవస్థాశూన్యమైన లోకము మధ్యనుండి సత్యమును గ్రహించగలిగినది. చిరకాలమునుండి మూసిపెట్టబడిన ద్వారముల బీగములను కనిపెట్టినవాడు. సత్య ప్రవాహమును నిర్బంధించియుంచిన కీళ్ళను బ్రద్దలుకొట్టి ఛిన్నాభిన్నమొనర్చినవాడు"—

ఆ భాష్యమునకు ఇది శ్రీ అన్నే కేశవార్య శాస్త్రిగారి అనువాదము. ఈ గ్రంథమునందు తొలుత స్వరసంయుతముగా వేదమంత్రము, దానికి దయానంద సరస్వతి భాష్యము ఆపైని ఆంధ్రానువాదము క్రమముగా నొసంగబడినవి. అందందు అవసరమని తోచినచోట ధాతుపాఠములను సైతము టిప్పణిగా నిచ్చియున్నారు.

శ్రీ కేశవార్య శాస్త్రిగారి యీ ప్రయత్నము భగీరథప్రయత్నము వంటిది. గ్రంథసంఘటనమునందు వీరు చూపుచున్న శ్రద్ధ నమోవాకము లర్పింపదగినదిగా యున్నది. ఇట్టి మహాకార్యమును సంఘటించుట మాటలతో పనిగాదు. వేదపరిజ్ఞానమునందు నిష్ణాతులైన వారు మాత్రమే ఆ ఛాయలకు పోదగియున్నారు. తొలుత నట్టి పరిజ్ఞానమును సంపాదించుట ఒక చరితార్థత. అట్టివారు ఈ దేశమున ఇప్పుడెందరున్నారు? అట్టి పరిజ్ఞానమును తమకు తాము సంపాదించుకొనినను, దానిని తిరిగి సర్వమానవులకు అందుబాటులోనికి తేవలెనని దీక్షవహించి కృషి చేయు ఉదారులెందరు? శ్రీ కేశవార్య శాస్త్రిగారి యీ మహాయజ్ఞము ఆంధ్రజాతికి సర్వకామప్రదాయిని యగుగాక!

పాఠకులు రచనావిధానము నవగతము చేసుకొనుటకు ఒక మంత్రమును, దయానందభాష్యమునకు కేశవార్య శాస్త్రిగారి అనువాదమును క్రింద పొందుపరచుచున్నాము.

మంత్రము :—

వసోఃపవిత్రమసి ద్యౌరసి పృథివ్యసి
మాతరిశ్వనో ఘర్మో౽సి విశ్వధా
అసిపరమేణ ధామ్నాదృగ్ంహస్వ
మాహ్వార్మాతే యజ్ఞపతి ర్హ్వార్షీత్ —

ఆంధ్ర భాష్యము

ప్రతి పదార్థము :- ఓ విద్యాప్రయుక్త మానవుడా! నీవు (వసోః) యేయజ్ఞమైతే (పవిత్రమ్ అసి) శుద్ధికి హేతువైయున్నదో (ద్యౌః అసి) విజ్ఞానప్రకాశ

మునకు హేతువును సూర్యకిరణములందు స్థిరముగ నుండునదియునై యున్నదో (పృథివీ అసి) ఏదివాయువుతోపాటు దేశదేశాంతరములు వ్యాపించునదై యున్నదో (మాతరిశ్వా) ఏది వాయువును (ఘర్మః అసి) శుద్ధిమొనర్చునదియై యున్నదో (విశ్వధా అసి) ఏది విశ్వమును ధారణ మొనర్చునదై యున్నదో (పరమేణధామ్నా) ఏది యుత్తమ-సుఖయుక్త-స్థానముచే, (దృగ్ంహస్వ) సుఖమును పెంపొందజేయుచున్నదో: ఆ యజ్ఞమును (మాహ్వాః) త్యజించకుము; అటులనే (తే యజ్ఞపతిః) నీ యజ్ఞమును రక్షించు నీ యజమానిని [నీ యజమాని] కూడ (మాహ్వార్షీత్) త్యజించకును. [త్యజించకుండునుగాక]. ధాత్వర్థమును బట్టి 'యజ్ఞ' శబ్దమునకు మూడర్థములున్నవి. ఒకటి: ఇహ పరలోకముల సుఖమునకై విద్యాజ్ఞాన ధర్మముల ననుష్ఠించుచు విద్వాంసులను వృద్ధుల సత్కరించుట; రెండవది: పదార్థముల గుణముల సమ్మేళన వియోగముల బాగుగా నెరిగి శిల్పవిద్యను ప్రత్యక్షమొనరించుకొనుట; మూడవది నిరతము విద్వాంసుల సమాగమము, అభ్యాసశుభ గుణములను విద్యాసుఖధర్మ సత్యములను నిరతము దానమొనర్చుట.

[యజ దేవపూజా సంగతి కరణ దానేషు (ధాతుపాఠము)].

భావార్థము:— మనుష్యులువారి ఉత్తమ విద్యా క్రియలవలన యజ్ఞముల ననుష్ఠించుచో, ఆ యజ్ఞము వలన పవిత్రతా ప్రకాశనము, పృథివీరాజ్యము, వాయురూపప్రాణమునకు తుల్యముగు రాజనీతి, ప్రతాపము, అందరిని రక్షించుట ఇహ పరలోకములందు సుఖవృద్ధి పరస్పరము ఆర్జవబుద్ధితో మెలంగుట కుటిలత్వమును త్యజించుట, ఇత్యాది శ్రేష్ఠ గుణములు ప్రభవించుచున్నవి. కావున సమస్త మానవులు పరోపకారార్థమును, స్వసుఖార్థమును విద్యాపుష్టార్థములతో ప్రీతిపూర్వకముగ యజ్ఞములను సతతమనుష్ఠించవలయును.

తె. సూ.

# స్వీకారము

దయామయి: ఖండకావ్య సంపుటి. రచయిత పేరు ప్రకటించబడలేదు; ప్రచురణ: కవితా సంస్థానం, విశంరాజుపల్లె; వెల రు. 0-4-0.

కారుమేఘాలు: కథలసంపుటి రచన: శ్రీ వాయిని దామోదరరెడ్డి, దేవరకొండ, కొత్తపల్లి తాలూకా; వెల రు. 0-5-0.

వస్తుపాలుడు: నవల (చారిత్రాత్మకము): రచన: శ్రీ వేంకటేశ్వర వేంకటరమణ కవులు; ప్రచురణ; భారతీయ వైశ్యచారిత్రిక పరిశోధనాసమితి, విజయవాడ, వెల రు. 1-4-0.

మహాభినిష్క్రమణము: (ఖండకావ్యము) రచన: శ్రీ రాచమల్ల నీలకంఠారెడ్డి; పైడిపాలెము (పోస్టు). కడపజిల్లా; వెల రు. 0-6-0.

కృష్ణవేణి: (ఖండకావ్య సంపుటి) రచన: శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య కవి, తెనాలి; వెల రు. 0-5-0.

బసవేశ్వర కళ్యాణము: పద్యకావ్యము; రచన! శ్రీ కట్టి భీమలింగాచారి; ప్రచురణ: రామా అండ్ కో విలాగు, వెల రు. 1-0-0.

జగద్గురు: శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వర శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ జగద్గురు శంకరాచార్య దివ్యచరిత్రము. రచన: శ్రీయుతులు ఉప్పటవడియం కృష్ణశాస్త్రి, కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, వీరభద్రశాస్త్రి; వ్యాససమితి, విజయవాడ 2. అమూల్యం.

ఆనందవాణి: (వికాసపంచిక) సంపాదకురాలు శ్రీమతి పు. ప్రభావతి; సంచిక అనేకమంది ప్రముఖుల చిత్రాలతోనూ వ్యాసాలతోనూ, త్రివర్ణ ముఖ చిత్రంతోనూ సుందరంగావుంది. వెల: రు. 1-0-0. ప్రాప్తిస్థానం ఆనందవాణి కార్యాలయం. 12 తంబుచెట్టివీధి మద్రాసు. 1.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.